## శుభాకాంక్షలు

మా పాఠకులు, రచయిత(త్రు)లు, ఏజంట్లు, ప్రకటన కర్తలందరికీ నూతన సంవత్సర శుభాకాంక్షలు. —సం.

### "ముఖచిత్రం"

బుగ్గలో నునుపు
పెదవుల్లో ఎరుపు
చూపుల్లో మెరుపు
కురిపిస్తున్న
అందాల జవ్వని
సినీ నటి అశ్విని
ముఖచిత్రం
కడు రమణీయం!

మంతెన విజయలక్ష్మి, విజయవాడ–15

### సీరియల్స్

నటి అశ్విని ముఖచిత్రంతో ప్రారంభించిన శైలకుమార్ గారి కొత్త సీరియల్ 'ఆరోహణ' ప్రారంభంలో నే మమ్మల్ని ఆకట్టుకుంది.

పి. రాము, టి. కామేష్, గుంటూరు

★ ★ ★

"ఆరోహణ" సీరియల్ ఆకట్టుకున్నది. ప్రచురిస్తున్న నాలుగు సీరియల్సూ రసవత్తరంగా సాగుతున్నవి.

ఈదబోయిన శ్రీనివాస్, నేలకొండపల్లి

★ ★ ★

5–11, డిసెంబర్,'86 "అశ్విని" ముఖచిత్రంతో వెలువడిన సంచిక ఆకర్షణీయంగా ఉంది. "ఆదూరి సావిత్రి" గారి "ఒడిలో చెలి మోహనరాగం" సీరియల్ చాలా బాగుంది. శైలి మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకొంది. రచయిత్రికి అభినందనలు.

ఆచంట శ్రీవల్లీదేవి, పొందూరు

★ ★ ★

నటి అశ్విని ముఖచిత్రంతో వెలువడిన సచిత్ర వారపత్రికలో కొత్త సీరియల్ "ఆరోహణ" ప్రారంభములో నే చాలా బాగున్నది.

గుడ్ల శాంతారామ్, పొందూరు

★ ★ ★

అశ్విని ముఖచిత్రంతో వెలువడిన సంచికలోని – శైలకుమార్ గారి "ఆరోహణ" సరికొత్త సీరియల్




ఆదిలో నే చక్కటి శైలిలో మనోహరంగా చాలా బాగుంది.

కొల్లి శివరామిరెడ్డి, శాయిలీల, నందివెలుగు

★ ★ ★

నేను 25 సం.ముల పూర్వం నుంచి అన్ని వీక్లీలు చదువుతున్నాను. కాని ఎప్పుడూ దేనికీ ఉత్తరం వ్రాయలేదు. కె. నాగేశ్వరి గారి "రసరాగ వాహిని" చదువుతుంటే వ్రాయాలనిపించింది. జయదేవుని అష్టపదులవివరణ చాలా బాగుంది. ప్రేమ, క్రైం నవలలు ప్రాముఖ్యత వహిస్తున్న ఈ రోజులలో ఇంత మంచి సీరియల్ అందిస్తున్న మీకు, రచయిత్రి గారికి నా అభినందనలు.

ఎం. బాల, అమలాపురం

★ ★ ★

అశ్విని ముఖచిత్రంతో వెలువడిన ఆం. స. వా. పత్రికలో 'ఆరోహణ' సీరియల్ ఆదిలో నే ఆసక్తికరంగా వుంది.

చక్రవర్తి, నీలిమల మధ్య గడచిన గతం ఏమిటో? కథను మంచి సస్పెన్సులో వచ్చే సంచిక కోసం ఆతృతగా ఎదురు చూసేలా, కమ్మని శైలిలో కమనీయంగా వ్రాస్తున్న రచయిత శైలకుమార్ అభినందనీయులు.

ఎక్కలంక రామారావు, మానేపల్లి

### వ్యాసాలు

5–11 డిసెంబర్ 1986 నటి "అశ్విని" ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రిక ఎంతో ఆకర్షణీయంగా వున్నది. "సంగమేశ్వరం" వ్యాసం చాలా బాగున్నది. చదువుతూ ఫోటోలు చూస్తుంటే, స్వయంగా దర్శించిన అనుభూతి కల్గింది.

డా. సి. సత్యనారాయణ, కుప్పనపూడి

(74 వ పేజి చూడండి)



ఆంధ్రసచిత్రవారపత్రి

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగార
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు : (1938-1972)
2-8 జనవరి '87
శ్రీ అక్షయ నామ సం. పుష్య శు. తదియ.
సంపుటము 79 : సంచిక 18
ముఖ్య సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
కార్యవాహక(యాక్టింగ్) సంపాదకుడు :
మతుకుమల్లి మాధవరావు
విడి ప్రతి వెల రు. 2.
పోస్టులో 6నెలల చందా రు. 78.
పోస్టులో 12నెలల చందా రు. 156.
ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003

### విషయానుక్రమణిక

ముఖచిత్రం :
నటి : సుమలత
(ఫోటో : పి. రవిచందర్)

**కథలు :**



**సీరియల్ నవలలు:**



**వ్యాసాలు, శీర్షికలు :**

# బుల్‌వర్కర్® వారి
# టమ్మీ ట్రిమ్మర్




## అతి త్వరగా అతి సులభంగా, అత్యుత్తమమైన పద్ధతి :

- మీ పొట్టను చదునుగా చేసుకోండి
- మీ నడుమును సన్నబరుచుకోండి
- మీ పిరుదలనీ, తొడలనీ సరిచేసుకోండి
- మీ శరీర ఆకృతిని మెరుగుపర్చుకుని, ఆ నమ్మకాన్ని పొందండి.

**మీరు మీరే చూడండి, కొలతలు చూసుకోండి, తెలుసుకోండి ఆ తేడాని, కొద్ది రోజుల్లోనే !**

| | | |
|---|---|---|
| ఈ వ్యామామంతో గట్టిదైన, చదునైన పొట్ట రూపొందుతుంది. | ఈ వ్యామామంతో మీ నడుము బలపడి, మీ శరీర వైఖరి మెరుగవుతుంది. | ఈ వ్యాయామంతో పిరుదలు సరియై తొడలు గట్టిబడతాయి. |

మీ నడుమును సన్నబరుచుకోడానికి, మీ పిరుదలనీ, తొడలనీ సరిచేసుకోడానికి, మీ వీపును గట్టి పరుచుకోడానికి, మీ శరీర వైఖరినీ,ఆకృతినీ మెరుగుపరుచుకుని, మీరు మరింత నమ్మకంతో మెలగడానికి, ఉత్సాహం రెకెత్తించే కొత్త పద్ధతి యిది !

**ఉబ్బి పైకొచ్చిన మీ పొట్టను టక్కున పోగొట్టుకోండిక :** ఇక్కడే తయారైన బుల్‌వర్కర్ వారి టమ్మీ ట్రిమ్మర్. చాలా సులభమైన. అలా చురుకైన, చలాకీ అయిన శరీరంతో జీవితాన్ని అనుభవించాలనుకున్న ఎవరైనా తేలికగా చేయగలిగిన ప్రణాళికగలది. అదిగూడా ఆయాస పడకుండా, ఆర్భాటం లేకుండాను.

**తమాషా కబుర్లేమీ కాదు, భోజన నియమాల్లేవు.** బుల్‌వర్కర్ వారి టమ్మీ ట్రిమ్మర్, శాస్త్రీయమైన, మూల సూత్రాలైన ఏరోబిక్స్ ఎనారోబిక్స్‌తో రూపొందిచబడి, త్వరగా, ప్రభావ పూర్వకంగా, రోవింగ్ మిషను చేసేటంతగా, పనిచేస్తుంది — అయినా మార్కెట్‌లో ఆ రోవింగ్ మిషనుధర కన్న ఊహించలేనంత తక్కువ ధర దీనిది. ఈ చెప్పిన పద్ధతిని అనుసరిస్తే, మీ పొట్ట యిక గట్టిగా, చదునుగా రూపొందుతుంది. కేవలం కొద్ది రోజుల్లోనే !

**స్త్రీలకూ, పురుషులకూ కూడా అదే విధంగా పనిచేస్తుందిది**
చిత్రాలు కూర్చిన కోర్సు జతపరచబడింది దీంతో.

**నరిలివి, చవక ధాయ నాణ్యత గల ఉత్పాదనలను తీసుకోండి.**

## ఫలితాలు గ్యారంటీ లేదా మీరేమీ చెల్లించక్కర్లేదు !

ఇప్పుడు ! రెండు మోడళ్ళలో దొరుకుతోంది.
రెగ్యులర్ (కొత్తగా చేసేవారి కోసం)
సింగిల్ స్ప్రింగ్‌తో ధర రూ. 224/-

సూపర్ మోడల్ (తర్వాత స్థాయి తరిఫీదుకు)
డబుల్ స్ప్రింగులతో ధర రూ. 260/-

ఈ కూపన్ తీసివేయబడి వుంటే, టమ్మీ ట్రిమ్మర్‌ని వి.పి.పి ద్వారా వీరికి రాసి ఆర్డర్‌చేసి తెప్పించుకోవచ్చు : బుల్‌వర్కర్ ప్ర. లి. 15, మేథ్యూ రోడ్, బొంబాయి 400 004.



**పేచీలేని ఇంటిదగ్గర పరీక్షించుకునే 14 రోజుల నదుపాయం మీ కోసం !**
మీకు దీనివలన వచ్చిన ఫలితాలు పూర్తిగా తృప్తికరంగా లేకపోతే, యీ కాలం లోపల మీరు దీన్ని మాకు తిప్పి పంపించెయ్యండి, ధరని పూర్తిగా ముదరా పొందండి. మిమ్మల్ని ఏ ప్రశ్నలూ అడగం.

**నడుము తగ్గించుకుని విజేతలు కండిక, నేడే!**

## బుల్‌వర్కర్®

ఇప్పుడు ప్రపంచ మంతటా 30 కన్న ఎక్కువ దేశాల్లో !

® రిజిష్టర్డ్ ట్రేడ్‌మార్క్

## ఉచిత కానుక

యీ ఉత్పాదనతో మీరు 10 రోజులలోగా సమాధానమిస్తే, వంటి కొవ్వును కొలిచే ప్రత్యేకమైన సాధనం ఉచితం.



## ఈ కూపన్‌ని పంపించండి నేడే

బుల్‌వర్కర్ ప్ర. లి. 15, మేథ్యూ రోడ్, బొంబాయి 400 004. TT-401-TEL

మీ 14 రోజులు ఇంట్లో ఉచిత పరీక్ష సదుపాయం క్రింద కొత్త టమ్మీ ట్రిమ్మర్‌ని నాకు వెంటనే పంపించండి. ఫలితాలతో నాకు పూర్తి తృప్తి కలగకపోతే పరీక్ష సమయంలో వెంటనే డబ్బు వాపస్ కోసం, అప్పించినే నేనుతిరిగి పంపించెయ్యవచ్చు. ఏ ప్రశ్నలూ వేయబడవు. SW-59

**మాకు కావలసిన మోడల్‌ని ఎంచుకోండి**

☐ రెగ్యులర్ మోడల్ 1 స్ప్రింగ్‌తో ధర రూ. 224/-
☐ అడ్వాన్స్‌డ్ మోడల్ 2 స్ప్రింగులతో, ధర రూ. 260/-

**తగిన గడిలో ✓ చేయండి.**

☐ రిజిష్టర్ పోస్ట్ పార్సిల్ ద్వారా పంపండి. నేను రూ.............డ్రాఫ్ట్/ఐపిఓ/ఎమ్. ఓ. నం.............. తేదీ ..............బుల్‌వర్కర్ ప్రైవేట్ లిమిటెడ్‌వారి పేరున చెల్లించేట్లు పంపిస్తున్నాను.
☐ వి.పి.పి. ద్వారా పంపండి. అందుకోగానే నేను పోస్ట్‌మేన్‌కి రూ. ...........చెల్లిస్తానని వాగ్దానం చేస్తున్నాను.

పేరు ......................................
చిరునామా ......................................
......................................
పిన్ ........................ సంతకం ......................

SW-59

# ప్రజలని హీనంగా చూసే పాలకులు!

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

ఇతరులకి వంత పాడటంలో భారతీయ పత్రికా ('చయిత ~ 'అసాధారణ ప్రజ్ఞావంతులు. అమెరికా అధ్యక్షుడు ̣రీగన్ ఆ దేశం చట్టాలకి విరుద్ధంగా ప్రవర్తి ̣ంచి పొరపాటు చేసారని న్యూయార్క్, వాషింగ్టన్‌లలోని పత్రికలు ఆయనని తూర్పార బడుతున్నాయి. ̣అవి అన్ని సందర్భాలలో అలాగే చేస్తాయి. గుట్టుచప్పుడు కాకుండా చేసిన ఆయన చర్యలకి ఆ పత్రికలతో పాటు మనం కూడా ఆయనని దుయ్యబడుతున్నాము. లెబనాన్‌లో ముస్లిం మతోన్మాదులు హామీ బందీలుగా పట్టుకున్న అమెరికా వారిని విడిపించేందుకే అయాతొల్లా ఖొమేనీ పాలనలో ఉన్న ఇరాన్‌కి నేరుగా, ఇస్రాయెల్, బహుశ ఇటలీ ద్వారా పరోక్షంగా ఆయుధాలని సరఫరా చేసారని, తత్సంబంధిత మంత్రికి కూడా ఆ విషయం పత్రికలు చదివితే గానీ తెలియలేదని రీగన్‌పై ఆరోపణ. బందీల విడుదలకీ, ఆయుధాలకీ బేరం పెట్టి, తీవ్రవాదుల పాలనలో ఉన్న ఇరాన్‌తో చర్చలకి దిగారన్న ఆరోపణకి గురైనారు ఆయన.

ఇటువంటి సందర్భాలలో అమెరికా సంయుక్త రాష్ట్రాల నిబంధనలు ఏమిటో నాకు తెలియదు కానీ రీగన్ ఎలాంటి పొరపాటూ చెయ్యలేదని నాకు అనిపిస్తున్నది. వాళ్ళు హామీ బందీలుగా నిర్బంధింపబడటానికి వారు అమెరికా వారు కావటం మినహా మరో కారణం ఏమీ లేదు. ఇదే విధంగా పంజాబ్‌లోని అమాయకులైన హిందువులని కేవలం వాళ్ళు హిందువులనే కారణంగానే హతమారుస్తున్నారు. అమెరికా సంపన్నమైన దేశం, ప్రపంచంలో అత్యంత ధనవంతమైనటువంటిది. ఆ దేశ ప్రజల కృషి ఫలితంగానే అది నేటి ఈ స్థితిలో ఉన్నది. అటువంటి పౌరులని కొందరిని పశ్చిమ ఆసియాలోని కొంతమంది మతోన్మాదులు అపహరించుకు పోయారు. ఆ దేశంలోని సంపదకీ, అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని పౌరులకీ అధ్యక్షుడు రీగన్‌కీ మధ్య అవినాభావ సంబంధం, ఒక విధమైన ప్రత్యక్ష అనుబంధం ఉన్నాయి. వారు అమెరికా వారన్న కారణంగా నిర్బంధింపబడిన వారిని విడిపించటం కోసం ఆ దేశం డబ్బు ఎందుకు ఖర్చు చెయ్యకూడదో నాకు తెలియటం లేదు. దాని వలన మరో విధమైన చిక్కులు, మరికొందరు అమెరికన్‌ల ప్రాణాలకి ముప్పు వాటిల్లనంత వరకూ అలా చెయ్యటమే అధ్యక్షుడి విధి.

బాధ్యత గల నాయకులందరూ, ఒక్క భారతీయ నాయకులు తప్ప, అలాగే చేస్తారు. అయిక్యరాజ్య సమితి ఉద్యోగపు ముసుగులో గూఢచార కార్యకలాపాలు సాగిస్తున్నందుకు కొన్ని నెలల క్రితం ఒక కె. జి. బి. వ్యక్తిని అరెస్టు చేసినప్పుడు సోవియట్ ప్రభుత్వం వెంటనే మాస్కోలో ఉన్న ఒక అమెరికన్ పత్రికా రచయితని, అతని మీద ఏ ఆరోపణా లేకపోయినా, అరెస్టు చేసి జైల్లో పడేసింది. అప్పుడు అమెరికా అధ్యక్ష భవనం ఏం చేసింది? విదేశ వ్యవహారాల మంత్రుల స్థాయిలో చర్చలు జరిపి ఆ అమెరికన్ పత్రికా రచయిత ఆ దేశం నుంచి







బయటపడేలా చేయటానికి న్యూయార్క్ నించి ఆ కె. జి. బి. గూఢచారిని బయటికి పంపేలా బేరం కుదుర్చుకున్నది. ఇస్లామాబాద్‌లోనో, కరాచీలోనో మన వాళ్ళని అరెస్టు చేసినప్పుడు రాజీవ్‌గాంధీ తదితరులు చేసే కల్లబొల్లి ప్రకటనల లాంటి వాటితో తృప్తి పడకుండా అధ్యక్షుడు రీగన్ స్వయంగా చొరవ తీసుకుని ఆ చర్చలకి అవకాశం కల్పించారు. దేశం లోపలా, వెలుపలా ఉన్న తమ పౌరుల రక్షణ బాధ్యత దేశాధ్యక్షుడిగా రీగన్‌దే. అందులోనూ వాళ్ళు కష్టాలలో ఉన్నప్పుడు అది మరీ ఎక్కువగా ఉంటుంది. ఆ కష్టాల నుంచి వారిని గట్టెక్కించటానికి ఆయన తమ దేశానికి చెందిన అపార రాజకీయ, ఆర్థిక పలుకుబడిని ఎందుకు ఉపయోగించకూడదో నాకు అర్థం కావటంలేదు.

మరో వైపు భారత ప్రభుత్వం తన పౌరులని హీనంగా చూస్తుంది. వారి ప్రవర్తన తనకి సిగ్గుచేటు అన్నట్టుగా ఉంటుంది దాని ధోరణి. బంగ్లాదేశ్ యుద్ధం తర్వాత ఎన్నో ఏళ్ళ తరబడి భారత సైనికులు కొందరు పాకిస్తాన్‌లోని జైళ్లలో మగ్గుతున్నా వారి గురించి తమకేమీ తెలియనట్టే శ్రీమతి గాంధీ ప్రవర్తించారు. ప్రతినిత్యం పంజాబ్‌లో ఎంతో మంది హత్య చేయబడుతున్నారు. వాళ్ళు భారతీయులు కావటమే ఆ అమాయకులు చేసిన తప్పు. వారి కోసం ప్రభుత్వం చేస్తున్నది ఏమిటి? వారి కుటుంబాలని పరామర్శించేందుకు బర్నాలా ప్రభుత్వం ఎవరినీ పంపలేదని విన్నాను. ఇక అకాలీ నాయకులు ఉన్నారు. వారంతా భారతీయులే, అందులో ఎంతో మంది అధికారం, హోదా కల స్థితిలో ఉన్నా కూడా ఈ హత్యలని హర్షిస్తున్నారు. ఇటీవలే ఆ రాష్ట్రంలో రెండు డజన్ల మందిని ఊచకోత కోసారు. అప్పుడు రాజీవ్ ఏం చేసారో తెలుసా? అందరికీ తెలిసిందే. ఆయన కింది ఉద్యోగి రాసిన ప్రకటనని ఒకదానిని వెలువరించి ఊరుకున్నారు. ఇప్పటికి కొన్ని నెలలుగా పంజాబ్‌లో జరుగుతున్న మారణ

హోమాన్ని ఆపటానికి కొత్త ఢిల్లీ ప్రభుత్వం చేసినది అతి స్వల్పం. అయినా ప్రభుత్వం మాత్రం అక్కడ కొనసాగుతూనే ఉన్నది, దానికి మద్దతు ఇచ్చే పార్టీలు కొనసాగుతూనే ఉన్నాయి. అవి ఎన్నికలలో పోటీ చేస్తూ పోతూనే ఉంటాయి. ఈ మారణ హోమం ఏదో మామూలు విషయమే అన్నట్టుగా ఉంటుంది వాటి తీరు. హిందూ సంస్కృతిపై ఆధారపడి ఉన్నామని చెప్పుకునే – అంతకన్నా ఎక్కువగా వ్యాఖ్యానించదలుచుకోలేదు – పార్టీలు కూడా తీర్మానాలు చేసి చేతులు దులుపుకుంటున్నాయి. వాళ్ల మాటలతో నే ఆ కుటుంబాల వేదన చల్లారగలదన్నట్లు అవి భావిస్తున్నాయి.

ప్రపంచంలోని ఈ భాగంలో భారతదేశం ఒక ప్రాంతీయ శక్తి అనీ, బలమైన శక్తులలో ఒకటనీ భావించబడుతూ ఉంది. పంజాబ్‌లో, తదితర చోట్ల జరుగుతున్న మారణహోమాన్ని ఆపటానికి పనికిరాని ఈ శక్తి వల్ల ప్రయోజనం ఏమిటి?

భారతదేశం ఇవాళ ఈ స్థితిలో ఉండటానికి కారణం తాము భారతీయులుగా భావించే వారు చెమటోడ్చి పని చేయటమే. వారిలో పంజాబ్‌లో డజన్ల కొద్దీ చంపబడుతున్న వారు కూడా ఉన్నారు. తన ప్రాణానికి రక్షణ కల్పించ లేనటువంటి ప్రభుత్వం, నాయకులు ఉన్నప్పుడు ఏ భారతీయుడైనా దేశం కోసం ఎందుకు శ్రమ పడాలి? కొద్ది సంవత్సరాలకి ముందు దాదాపు 400 మంది అమెరికాకి చెందిన దౌత్యవేత్తలు, తదితరులు




టెహరాన్‌లో ఖొమేనీ మనుషుల చేతికి చిక్కినప్పుడు వారి రక్షణ కోసం అధ్యక్షుడు కార్టర్ హెలికాప్టర్‌లనీ, విమానాలని పంపారు. తన పౌరులని సురక్షిత ప్రాంతానికి చేర్చటానికి ఇస్రాయెల్ రహస్య దళాన్ని ఉగాండాకి పంపించింది. మన కోసం మన ప్రభుత్వం ఏమి చేస్తుంది? విదేశాలలో ఉన్న మన రాయబార కార్యాలయానికో, కాన్సలేట్‌కో వెళ్ళి చూడండి అక్కడి మన అధికారులు మనతో ఎలా ప్రవర్తిస్తారో మీకే తెలుస్తుంది. వాళ్ళు మనని గడ్డిపోచ కన్నా హీనంగా చూస్తారు. అసలు మనదేశంలోనే మనం అలా చూడబడుతున్నాము. తన పౌరుని హీనంగా చూసే ప్రభుత్వం పట్ల ఆ పౌరుడు కూడా అదే భావంతో ఉంటాడు.

ఆ దేశపు చట్టాలు ఏ విధంగా ఉన్నప్పటికీ అధ్యక్షుడు రీగన్ తప్పు చేసారని నేను అనుకోవటం లేదు. ఆయన పత్రికల వారితో అబద్ధాలు చెప్పారనీ, వాస్తవాన్ని పూర్తిగా వెల్లడించలేదనీ అంటున్నారు. మన పాలకులు పత్రికలకే కాదు పార్లమెంటుకీ అబద్ధాలు చెపుతూ ఉంటారు. తమ దేశం పౌరులని రక్షించటానికి రీగన్ ఒకటి లేదా కొన్ని అబద్ధాలని చెప్పినా వాటిని ఒక మంచి పనికి ఆయన చెప్పారు. నేనే ఈ దేశానికి ప్రధానమంత్రిని అయితే ప్రజల భద్రత కోసం అవసరమైతే అబద్ధం ఆడతాను. మోసం, హత్య కూడా చెయ్యటానికి వెనుకాడను. వాళ్ళు ఎక్కడ ఉన్నా, అక్కడికి వాళ్ళిలా వెళ్ళినా వారి రక్షణే నా ప్రధాన కర్తవ్యం. నా వ్యక్తిగత రక్షణకి, నా కుటుంబ భద్రత కోసం కోట్ల రూపాయలు ఖర్చు పెట్టి మిగతా దేశాన్ని దాని ఖర్మకి వదలటం సిగ్గుచేటుగా భావిస్తాను. అధ్యక్షుడు రీగన్ అభినందనీయుడు. □

సీరియల్

ఆదూరి సావిత్రి

(గత సంచిక తరువాయి)

బాబూరావు తన గదిలో తలుపులు బిడాయించుకుని ఉన్నాడు. పన్నెండు గంటలయినా తలుపులు తెరవలేదు.

ఏం చేస్తున్నాడు లోపల? ఎలాంటి కుటిలపు ప్లానులు వేస్తున్నాడు? అతన్నంత సేపు ఒంటరిగా ఉండనివ్వటం ఇష్టం లేదు శర్వాణికి. తలుపు తట్టడానికి భయపడుతోంది. తాతగారి వేపు నిస్సహాయంగా చూసింది.

"చూడమ్మా శర్వాణీ, వాడు మంజూ నూ ప్రణీత్‌ని ఎన్ని తిట్టినా నువ్వేం అనకు. వాడి ఆక్రోశం ఉక్రోషం నీ సమక్షంలో అలా నిరాటంకంగా కురిసెయ్యనీ. నువ్వు అడ్డుపడకు. ఇప్పుడు నువ్వు వాళ్ళని సపోర్ట్ చేస్తే వాడి గాయం ఇంకా భగ్గుమంటుంది. వాడి అనుమానం నీ మీదకు రానందుకే తృప్తిపడాలి మనం." అన్నారాయన.

ధైర్యం తెచ్చుకుని తలుపు తట్టింది శర్వాణి.

"ఏం కావాలి?" కొట్టినట్టుగా అడిగాడు బాబూరావు.

ఇన్నేళ్ళు అతనితో కాపురం చేసినా అతని దగ్గర, తగినంత చనువు లేదామెకు. అతనంటే ఆమెకు భయమే ఎక్కువ. అనురాగాన్ని కూడా పీక నొక్కేంత భయమది. అతను చనువుగా ఉన్నప్పుడు దగ్గర కూచుని మాట్లాడ గలదు గానీ.. సీరియస్‌గా ఉంటే సాధ్యమైనంత వరకూ ఆ ఛాయల కెళ్ళదు. కానీ ఇప్పుడు తప్పదు.

"వాడినలా ఒంటరిగా ఒదలకు. కడుపులో ఉంటే ... ఆ కసి ఇంకా పెరుగుతుంది. ఆత్మీయుల సమక్షంలో కక్కేస్తే ఆ కక్ష యొక్క ఉధృతం కాస్త తగ్గుతుంది. అలా తగ్గకపోతే వాళ్ళ పట్ల ప్రమాదంగా పరిణమిస్తుంది. ఈ సమయంలో వాడు ఒంటరి.

మనమంతా ఒకటనే భావన వాడికి రాకూడదు. మనని వాడు శత్రువులా పరిగణించకూడదు. వాడి ఆలోచనల్ని మనం ఈసడించుకుంటున్నామనే సత్యం వాడి దగ్గర వెల్లడి కాకూడదు." అన్న తాతగారి మాటలు గుర్తుకు తెచ్చుకుని తలుపు తడుతోందామె..

"ఒక్కసారి తలుపు తియ్యండీ" అన్నది.

లోపలి నుంచి ఏ అలికిడీ లేదు.

"తెయ్యరూ!" అన్నదామె అభ్యర్థనగా.

ఆమె గొంతు తడారిపోతోంది....

తలుపు తీసి, సీరియస్‌గా చూశాడు తను. మాట్లాడకుండా లోపలి కెళ్ళి తలుపు దగ్గరగా వేసి మంచం అంచున కూచుంది శర్వాణి.

అతను కూడా ఆమె పక్కనే కూర్చున్నాడు. బెదురుతూ అతని చేతి మీద చేయి వేసిందామె. అంతే! ఒక్కసారిగా బరస్టయ్యాడతను.

"చూడు! అదేం చేసిందో! అది మన బిడ్డ కాదు. మన పాలిటి శత్రువు. నా ప్రత్యర్థి రాజకుమార్ చెంతకు చేరి, ఆ ప్రణీత్‌గాడిని పెళ్ళి చేసుకుంటుందీ! ఏం? నేను చచ్చాననుకుందా? నా శత్రువు దానికి మిత్రుడయ్యాడా? నాకింత అవమానం, మనస్తాపం కలిగించినందుకు, దాన్ని నరికి పాతెయ్యాలనలు...

మనం అందలం ఎక్కించాలనుకుంటే మాత్రం ఆ అదృష్టం దాని కేదవద్దూ? ఇదిగో చెబుతున్నా వాణీ జాగ్రత్తగా విను. నేను ఊళ్ళో లేను గదా అని నువ్వు దానింటి కెళ్ళటం గానీ, అది ఈ ఇంటికి రావటం గానీ జరగకూడదు. అలా జరిగితే నా మీద ఆన!

నేను చచ్చానని గానీ, చావాలని గానీ నువ్వు కోరుకునేట్టయితేనే నువ్వీ పని చెయ్యి..."

సరిగ్గా ఆమె ఆయువు పట్టు మీద గురి చూసి కొట్టాడు బాబూరావు. ఇహ తను చెప్పే వరకూ ఆమె తన శాసనాన్ని ధిక్కరించదు! దొంగతనంగా కూడా ఆ పని చెయ్యదు. ఆ నమ్మకం అతనికుంది.

"నీకూ ఆ రాజకుమార్ మీదే మోజుగా ఉంటే... సరే నా మాట ధిక్కరించి వాడి వర్గంలో నే చేరిపో!" ఇంకో బాణానికి విషం పూసి విసిరాడతను.

ఆమె చిగురాకులా ఒణికి పోతోంది. అక్కడుంటే అతనింకేం మాట్లాడుతాడో అనే భయం నిలువెల్లా ఆవహించిందామెను. చటుక్కున లేచి వెళ్ళిపోతే, అతని మాటలు తిరస్కరించిందనీ, అతను రౌద్రరూపం ధరిస్తాడేమో...

జరిగిన కథ –8: మంజీర, ప్రణీత్‌ల వివాహానికి పెద్దలు తాంబూలాలు పుచ్చుకుంటారు. మంజీర, ప్రణీత్‌లు ఒకరి మనసు నొకరు అర్థం చేసుకుని ప్రేమైక జీవులవుతారు. మంజీర తండ్రి బాబూరావు అక్రమాలు చేసి ఎం. ఎల్. ఏ. గా ఎన్నికయి, మినిస్టరవుతాడు. ప్రణీత్ సబిన్స్పెక్టర్‌గా సైదిపల్లికే వస్తాడు. పెళ్ళి గురించి అడగడానికి వెళ్ళిన ప్రణీత్ తండ్రి వెంకట్రామయ్యను బాబూరావు అవమాన పరుస్తాడు. ఈ పెళ్ళి జరగదనీ, మంజీరను ఆర్థిక మంత్రి కొడుక్కి ఇవ్వడానికి నిర్ణయించు కున్నాననీ అంటాడు. ఆందోళన చెందుతున్న మంజీరను హైమ, తాతగారు, శర్వాణి ఓదారుస్తారు. రాజకుమార్ సాయంతో ప్రణీత్ మంజీరను రహస్యంగాపెళ్ళి చేసుకుని బాబూరావు దగ్గరికి వస్తాడు. నవ వధూ వరుల్ని బాబూరావు అవమానించి వెళ్ళగొడుతాడు.

అక్కడే ఉంటే ఇంకేం ఒట్టు... అసహ్యమైన నిష్ఠూరాలు వినాల్సి వస్తుందోనని గజగజలాడిపోతోంది.

ఇంతలో ఆమె, మొరనెవరో విన్నట్టు "అమ్మా శార్వాణీ. అన్నం పెడతావా?" అంటూ హాల్లో నుంచి పిలిచారు తాతగారు. ఒక్క ఉదుటున లేచి బయట కెళ్ళిందామె.

"మీరు అన్నం తింటారా" అని భర్త నడుగాలని కూడా తోచలేదామెకు... తాతగారికి అన్నం పెడుతూ కూడా తల ఎత్తటం లేదామె. గుండెల నిండా ఎన్నో టన్నుల బరువు పేరుకున్నట్టుందామెకు ఆ బరువంతా కన్నీరు ఘనీభవించినదే.

"శార్వాణీ" మృదువుగా పిలిచారు తాతగారు కూర వడ్డిస్తున్న శార్వాణి కళ్ళలో నుంచి టపటపా జారిన కన్నీళ్ళు తాతగారి కంచంలో తెల్లగా మెరుస్తున్న అన్నం మీద పడ్డాయి

"అన్నం తీసి వేరేగా పెడతాను" అంటూ ఆ కంచం తియ్యబోతున్న ఆమెను మృదువుగా వారించి 'ఒద్దు లేమ్మా? ఈ ఇంట్లో వ్యక్తులు, అన్నంలోకి ఆధరువుగా నీ కన్నీళ్ళు ఎన్ని తాగినా, అవి ఇంకిపోవు." అంటూ అన్నం కలుపుకున్నారాయన

"ఆయన . ఆయన తన మీద ఒట్టు వేసుకున్నారు నేను మంజూ ను..." అంటుంటే ఆమె గొంతు పూడిపోయింది

తెలుసమ్మా "

"మీరు విన్నారా?"

"వినక్కర్లేదు, నీలాంటి భార్యల్ని అలాంటి భర్తలు ఎలా శిక్షిస్తారో నాకు బాగా తెలుసు."

"ఆయన లేనప్పుడు . దాన్ని చూడొచ్చనుకున్నాను "

" .. . "

"మీరు కూడా వెళ్ళగూడదట మీ ద్వారా కూడా దాని అవసరాలు, క్షేమ సమాచారాలూ తెలియవు."

"నేనూ వెళ్ళను. వాడి ఒట్టుకు జడిసి మాత్రం కాదు. అలా వాడికి భయపడుతూ ప్రతిసారీ దొంగతనంగా వెళ్ళటం. ఎవరీ వార్తని వాడికి చేర వేస్తారోనని ప్రతివాడికీ భయపడటం వాడి అరుపులు ఇదంతా నాకూ ఇష్టం లేదు అందుకే వెళ్ళను దాని అవసరాలు మన కన్నా ఎక్కువగా వాళ్ళే తీరుస్తారు. ఆ చల్లని ఇంట్లో మనమ్మాయి• క్షేమంగానే ఉంటుంది వాడిలో ఆ ఉధృతం తగ్గాక, పరిస్థితులవే చక్కబడుతాయి అన్నారాయన కానీ ఆయన ఊహించినట్టు బాబూరావులో ఆ ఉధృతం తగ్గనేలేదు పైపెచ్చు వాళ్ళంటే ఏర్పడ్డ వ్యతిరేకత, పాము విషంలా అతనికి నిలువెల్లా ఎక్కసాగింది . అతని మనసు మారకుండా యధాశక్తి ఎగదోసే గుంట నక్కల్లాంటి పరివారం అతనికి వాలానే ఉంది

* * * *

మంజూ ! బాధ పడుతున్నావా? బెంగగా ఉందా? అనునయంగా అడిగాడు ప్రణీత్

"నా గురించి నేనేం బాధపడటం లేదు పాపం అమ్మ! బహుశా.. నన్నా యింటికి రానిచ్చినా, ఆమె ఈ ఇంటి కొచ్చినా అంతు చూస్తానని బెదిరించి ఉంటారు నాన్న. అమ్మ నన్నెప్పుడూ వదిలి ఉండలేదు ఇంత వరకు ఇంకో ఆడపిల్లయినా లేదు కొంత వరకైనా సరిపెట్టుకోడానికి నన్ను చూడకుండా ఉండలేక .. నాన్న కెదురు చెప్పలేక నలిగి పోతూ ఉంటుంది అమ్మ కస్సలు నోరు లేదు" అన్నది మంజూ

'నీకుందా?"

"నాకూ లేదు సుమా! ఈ సంగతి మీరెప్పుడూ గుర్తు పెట్టుకోవాలి ఒకవేళ . మనకూ అమ్మాయి పుడితే ... అదీ ఇలాగే చేస్తే నన్ను మాత్రం మీరిలా శిక్షించకూడదు. నేను భరించలేను .'

"మనకూ అమ్మాయి పుడుతుందా?! ఎప్పుడు?" చిలిపిగా అడిగాడు ప్రణీత్. చటుక్కున ఆమె ముఖం ఎర్ర బారింది సిగ్గు బరువుతో కళ్ళెత్తలేక పోయిందామె గబుక్కున క్యాజువల్‌గా అనేసింది గానీ తీరా ప్రణీత్ ప్రత్యేకంగా అడిగే సరికే సిగ్గుపడిపోయి ముఖం పక్కకు తిప్పుకుంది . ఆమెలో ఈ మార్పునే అతను కోరుకునేది ఎలాగైనా ఆమె దిగులును మరిపించాలని అతని



కొత్తశీర్షిక

# రచయిత్రి జవాబులు



ప్రముఖ రచయిత్రి శ్రీమతి ఆదూరి సావిత్రి తమ సీరియల్ నవల "ఒడిలో చెలి మోహనరాగం"పై పాఠకుల ప్రశ్నలకి సమాధానాలు ఇస్తారు. ఈ అవకాశాన్ని వినియోగించుకో దలచుకున్నవారు తమ ప్రశ్నలని "రచయిత్రి జవాబులు" శీర్షిక పేర సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ – 520003 అనే చిరునామాకి పంపవచ్చు. వాటిలో రచయిత్రి ఎంపిక చేసిన ప్రశ్నలని, వాటికి ఆమె ఇచ్చిన సమాధానాలని వారం వారం ఈ సీరియల్ పేజీలలో ప్రచురిస్తాము. ప్రతివారం రచయిత్రి ఉత్తమంగా ఎంపిక చేసిన ప్రశ్నని పంపిన వారికి ఆమె రాసిన నవలలలో ఏదో ఒకదానిని బహుమతిగా ఇవ్వటం జరుగుతుంది. ఈ అవకాశాన్ని పాఠకులు వినియోగించుకోగలరని ఆశిస్తున్నాము.

– సంపాదకుడు

## ఒడిలో చెలి మోహన రాగం

తహతహ......

పలుచని డిమ్ము లైటు కాంతిలో ఆ గదిలో ఉన్న పందిరి మంచం తెల్లని దుప్పటీ, తెల్లని ఇస్త్రీ గలీబులు తొడిగిన దిండ్లతో కొత్త దంపతులకు స్వాగతం పలుకుతోంది గది నిండా అగరొత్తులు, జాజిపూల పరిమళం ఆహ్లాదంగా పరుచుకుంది.

తనకు చేతనయినంతలో గదిని సింపుల్‌గా అలంకరించింది కామేశ్వరి రాత్రి పదింటికి వచ్చాడు ప్రణీత్ స్నానం చేసి వచ్చాక అతనికి మంజీరే అన్నం పెట్టింది అతను గదిలోకి వెళ్ళబోతుంటే ఈ రోజు ఆ గదిలో పడుకోమన్నా రత్తయ్య అన్నది మంజీర అతని వెనకేవచ్చి అది ఇంటి వాళ్ళ గది వాళ్ళ నడిగి కామేశ్వరి ఆ గది తీసుకున్న విషయం ప్రణీత్‌కి తెలీదు ఆశ్చర్యంగా ఆ గదిలో అడుగు పెట్టిన ప్రణీత్ పెదవులు చిరునవ్వుతో విడిపడ్డాయి వెను తిరిగి మంజీర వేపు చూశాడు

అతని కళ్ళలో కొంటితనాన్ని ఎదుర్కోలేని ఆమె కళ్ళు కిందికి వాలిపోయాయి ఉద్వేగంతో ఆమె గుండెలు ఎగిసిపడుతున్నాయి అతనామెను సమీపించాడు

ఆమె శరీరమతని కౌగిలిలో తటిద్గానమై సాగింది అతని కనురెప్పలను ఆమె ఎత్తయిన గుండెలు మెత్తగా కోసేస్తున్నాయి విడిన జుట్టు అతన్ని కప్పేస్తోంది...

అతని కంటి రెప్పల మీద ఆరని తడి ఆమె నాలుకదే

అటు కాలమటు విశ్వ మొక్క తృటిలో ఒదిగినట్లు ఏదో రహస్యం అతన్నావరించుకుంది. ఆమె కాలి అందెలతని పాదం మీద ఘల్లు ఘల్లు మన్నాయి. భరించలేని సౌందర్యపు వెలుగులో అతనికి స్పృహ తప్పింది

క్షితిజ రేఖలా ఒంగిన ఆమె బుజాల ఒంపు దగ్గర చెదిరి విరిగిన సముద్ర కెరటంలా పడి ఉన్నాడతను ..

వెచ్చ వెచ్చని మనసులో.. పొరలి వచ్చే నిదురలో చినుకురాలినట్లు ఆ అనుభవం తాలూకు సవ్వడి ఇద్దరిలోనూ .

సరిగ్గా ఒక్క అరగంట కన్ను మలిగిందో లేదో ఆకాశం విరిగినట్లు ఏదో అనిపించి అతను కన్నులు తెరిస్తే పెనవేసుకున్న ఆమె శరీరపు స్పర్శ . వెచ్చదనం. నునుపు అతని మదిలో మనక నిద్రపోతున్న కోర్కెను ఉధృతంగా రేపింది . ఇటు తిరిగి ఆమె నల్లుకున్నాడతను కళ్ళెత్తి చూసి నవ్వెందామె ఆమె చేతి గాజులతని వీపుకు గుచ్చుకుంటున్నాయి

కారుమేఘంలా ఆమెను కమ్మేసి. మెరుపులా మెరిసి . చినుకు చినుకుగా రాలి పడ్డాడ తను

చినుకుల కలనేత వస్త్రాన్ని ధరించిన ధరిత్రిలా .. చల్లగా అతన్ని తన చేతుల మధ్యకు లాక్కుందామె అతని తల ఆమె గుండెల మధ్య అలసటగా వాలింది

భాష కందని దగ్గరతనం చనువు వాళ్ళ నావరించుకుంది. .

ఆ తెల్లారి నుంచీ వాళ్ళ కళ్ళు భాషను నేర్చుకుంటే పెదవులు చిలిపితనాన్ని నేర్చుకున్నాయి రాత్రి తాలూకు మధురిమ ఉదయానికి కూడా పొద్దు పొడుపులా వాళ్ళ మొహాల్లో మెరుస్తూనే ఉండేది ..

* * * *

మంజూ ఆ ఇంటి నొదిలేసి అప్పుడే పది రోజులయింది

బాబూరావు హైదరాబాదు వెళ్లాడు అతనెళ్ళినా అతను విధించిన ఆంక్ష శర్వాణిని కాపలా కాస్తూనే ఉంది

దూడను బలవంతాన లాక్కెడుతుంటే జాలి చూపులు చూసే ధేనువులా ఆమె వాకిటి వరండాలో ఒంటరిగా కూర్చుని ఉంది

'మంజూ " అని పిలవబోయి ఆగిపోతుంది అన్నట్లు మంజూ లేదు కదూ! అప్పుడే పది రోజులు! అయినా ఆ పిలుపు తాలూకు అలవాటు నాలికనూ మనసునూ ఒదలటం లేదు దానికి తనంటే ఎంత ప్రేమ!

రోజూ దానికి జడ తనే వెయ్యాలి అంతవరకూ దువ్వెన తలలో గుచ్చుకుని తన వెనకే తిరుగుతూ ఉంటుంది ఇప్పుడు కామేశ్వరి వేస్తోందా?

లేక అడగటానికి బిడియపడి మంజూ తనే వేసుకుంటోందా? అది వేసుకుంటే జుట్టంతా చిక్కులుపడిపాడయిపోతుంది .

దుప్పటి కప్పుకు పడుకుంటే 'అమ్మా! ఎందుకు పడుకున్నావ్? ఒంట్లో బాగోలేదా? కాళ్ళు పట్టనా? తలకు అమృతాంజనం రాయనా? ' అంటూ తను లేచి తిరిగే వరకూ మంచం వదిలేది కాదు." ఉండు, నీకు జడ నే వేస్తాను అంటూ దువ్వెన తెచ్చి, వెయ్యటానికి ప్రయత్నించేది

అదేమిటీ? పెరుగు కొంచెమే వేసుకుంటావేం? వేడి చేస్తుంది ఇంకొంచం వేసుకో" అంటూ తన పక్కన కూర్చుని వడ్డించేది తను దానికి తల్లి అయితే చాలా సార్లు అదే తనకు తల్లిలా ప్రవర్తించేది

మంజూ ! నువ్వు లేవు నీ పిలుపు ధ్వనిలో ఉన్న మమత ఇంటి ముందున్న జూకామల్లె తీగలో కూడా ఇంకా అల్లుకునే ఉంది నా గుండెల్లో చిక్కబడే ఉంది

అటు పక్క నుంచి తొంగి చూస్తున్న గోరింట పువ్వు "మంజూ ఏది?" అని ప్రశ్నిస్తోంది

తెల్లని శరీరంతో కాళ్ళకు మువ్వలతో మెడలో పట్టెడతో చెంగు చెంగున ఎగురుతూ వచ్చిన నీ పెంపుడు లేగదూడ గుమ్మం ముందు ఆగిపోయి నా నేస్తం ఏదీ అన్నట్లు దిగులుగా చూస్తోంది

నల్లమచ్చల తెల్లపిల్లి నీ మంచం చుట్టూ.తిరిగి మంచం మీద కెగిరి చూసి, నువ్వులేక పోవటంతో బిత్తరపోయి, కిందికి దూకి ఇల్లంతా వెతుకుతుంది నీ కోసం నా వెనకే తిరుగుతూ 'మంజూ ఏదీ?" అన్నట్లు సతాయిస్తుంది అలిగి వెళ్ళి, పొయ్యి ముందు కళ్ళు మూసుకుని ముడుచుకు పడుకుంటుంది

పెరట్లో ఉన్న నందివర్ధనం పువ్వు వికసించటం మానేసి మొగ్గలోనే ముడుచుకుపోతూ నీ నిష్క్రమణ పట్ల తన సంతాపాన్ని ప్రకటిస్తోంది

కిటికీ అవతలున్న హిమ స్నాత మాలతీ లత నన్ను పలకరించటం మానేసింది తల దించుకుని ఏదో గొణుక్కుంటుంది

# గడుసులోకం —బాబు







నీ మాట . నీ కర స్పర్శ నెరుగని ఏ ప్రాణి ఉంది మంజూ ఈ ఇంట్లో?

నా లోపల ఎవరో అటు నుంచి ఇటు నడుస్తున్న చప్పుడు? ఆ చప్పుడు నీ జ్ఞాపకాలదేనమ్మా!

అర్థంలేని నా స్త్రీత్వాన్ని మాతృత్వంగా మార్చిన పరమార్థానివి తల్లీ నువ్వు!

నిన్ను దూరం చేసుకుని ఎలా బ్రతకను? రోజులు ఇంత బారంగా గడుస్తాయని నా కిప్పుడే తెలుస్తోంది .

నీకు సమీపంలో ఉండీ . నిన్ను చూడటానికి రాలేను మాట్లాడలేను. మీ నాన్న లాంటి మగవాడికి ఆడదాని ఆయువు పట్టు మీద చావు దెబ్బ కొట్టటం వెన్నతో పెట్టిన విద్యమ్మా!"

శార్వాణి కన్నుల నుండి స్రవిస్తున్న అశృవుల వేడిమి కామె చెంపలు కమిలి పోతున్నాయి.

ఆమెను తాతగారు గమనిస్తూనే ఉన్నారు..

ఆ తల్లి నేమని ఓదార్చాలో ఆయన కర్థం కావటం లేదు

'అత్తయ్యా!"

చివ్వున తల తిప్పి చూసిన శార్వాణి కళ్ళు తళుక్కుమన్నాయి

"హైమా! మంజూ ను చూశావా? ఎలా ఉందది? నువ్వు కూడా రావటం మానేశా వెందుకనమ్మా! ఆతృత నిష్ఠూరం కలిసిన స్వరంతో అడిగింది శార్వాణి.

"మా అత్తకి బాగోలేదు ఆమెకి భయం ఎక్కువ మంచం దగ్గర నుంచి కదలనియ్యదు ఇంటి పని ఆవిడ కాపలా వీటితో తీరక రాలేదత్తయ్యా' అన్నది హైమ.

ఇప్పుడెలా ఉంది?

"లేచి, తిరుగుతోంది '

"మంజూ మంజూ ఎలా ఉంది?!"

"కులాసాగానే ఉంది నీలాగే రావటం మానేశావేమని నన్ను తిట్టింది ముందెళ్ళి అమ్మని చూసిరా అంటూ నన్ను నీ దగ్గరకు.తరిమింది తను బాగనే ఉన్నట్లు చెప్పమంది నీకూ, తాతగారికి.'

'జడ ఎవరేస్తున్నారు దానికి? చిక్కి పోయిందా?'

"ఏం చిక్కలేదు లక్షణంగా ఉంది నీ మీద బెంగ తప్ప. దానికింకే బాధా లేదు. కామేశ్వరి పెద్దమ్మ దాన్ని కూతురిలా చూసుకుంటోంది జడ కూడా ఆవిడే వేస్తోంది."

తాతగారు కూడా ఆసక్తిగా వచ్చి హైమ కబుర్లు వింటున్నారు

"అత్తయ్యా! అసలు నువ్వెందుకిలా దాని గురించిన దిగులుతో పిచ్చి దానిలా తయారవుతున్నావు? మంజూ కోరుకున్న వాడితో హాయిగా సంసారం చేసుకుంటోంది ఊళ్ళోనే ఉంది కూడా ఎప్పటికయినా మిరిలా దాన్ని అత్తవారింటికి పంపాల్సిందే గదా '

'అది కాదమ్మా, మేమందరం ఉండి కూడా అనాధలా ఒంటరిగా వెళ్ళిపోయి పెళ్ళి చేసుకుందది

ఇంత ఆస్తికి వారసురాలది అయినా కూడా ప్రతి చిన్న దానికీ వాళ్ళనే దేవిరించాలిప్పుడు

పుట్టింటి కానుకలూ పసుపు కుంకుమలు, చీరెసారెలూ పెట్టించుకోకుండా. మనసులో మాట చెప్పుకోటానికి లేకుండా నాకు మాత్రం ఉందదామ్మా? ఒక్కబిడ్డ! దాని పెళ్ళి మా చేతుల మీదగా జరగాలని పీటల మీద కూర్చుని కన్నె దార పొయ్యాలని ఆర్భాటంగా పెళ్ళి చేసి, సారెతో అత్తారింటికి పంపాలని అది ఈ ఇంటికి వస్తూ పోతూ ఉండాలని

చిన్నప్పట్నుంచీ ఎంత అపురూపంగా పెంచుకున్నాను దాన్ని అఖరుకు దాని పెళ్ళి కూడా కళ్ళతో చూడలేక పోయాను

దీన్నయినా ఎలాగో భరించొచ్చు కానీ .. అది నా దగ్గరకు రాకూడదు నేను దాని దగ్గర కెళ్ళకూడదు మాట్లాడుకోకూడదు ' ఈ ఆంక్ష నెలా బరించగలను హైమా నేను!' శార్వాణి కంఠంలో బాధను అణిచి పెడుతున్న చాయలు

కొంచెం సేపుండి, లేచింది హైమ వెడతానంటూ

అన్నట్లు హైమా! నిన్న రాత్రి ఆవు ఈనింది పాలున్నాయి ఒక్క పది నిమిషాల్లో జున్ను చేసి ఇస్తాను మంజూ కిస్తావా? దానికి జున్ను అంటే ప్రాణం " ఆత్రంగా అన్నది శార్వాణి

'అలాగే! నేను బెల్లం తరిగిస్తాను పద త్వరగా చేసివ్వు " అంటూ శార్వాణి వెనకే వంటింట్లో కెళ్ళింది హైమ ..

తెల్లగా తోమిన ఇత్తడి గిన్నెలో పాలు పోసి కుంపటి మీద పెట్టి, బెల్లం డబ్బా అందుకో బోతున్న శార్వాణి అలాగే ఆగిపోయింది

"జాగ్రత్త! ఈ ఇంటి నుంచి దానికేవయినా పంపాలని చూసినా దానితో సంబంధాలు కొనసాగించినా నా మీద ఒట్టు!' బాబూరావు కంఠం ఝుళిపిస్తున్నట్లుగా అనిపించింది ఆమెలో పాల పొంగులా ప్రవేశించిన ఉత్సాహం ఒక్కసారిగా దిగజారిపోయింది అప్రయత్నంగా కళ్ళలోకి నీళ్ళు చిమ్మాయి

ఏమిటత్తా అలాగే నిలబడి పోయావు? డబ్బా ఇటివ్వు " కత్తి పీట ముందుకు లాక్కుంటూ అన్నది హైమ

'ఒద్దులే హైమా "

ఆశ్చర్యంగా చూసిన హైమ శార్వాణి చెంపల మీద కురుస్తున్న కన్నీటిని చూసి 'ఏమయిందత్తా? అన్నది ఆదుర్దాగా

'మీ మామయ్య ' శార్వాణి గొంతు పెగలటం లేదు

## ఒడిలో చెలి మోహన రాగం

"ఏదీ?"

"ఆయనకు... నేనిలా పంపటం ఇష్టముండదు"

"సింగినాదంలే, ఆయనిష్టం ఎవరి క్కావాలి." ]

"..........."

"అయినా, ఈ సంగతి మావయ్య కెలా తెలుస్తుంది? ఎవరు చెపుతారు? నేను ఎవరికీ తెలీకుండా చాలా జాగ్రత్తగా తీసికెడతాను."

"ఎవరో చెపుతారని కాదు."

"మరి?"

"........."

"చెప్పత్తయ్యా! ఏమిటి నీ సందేహం?"

"నీకు... నవ్వుగా ఉంటుంది."

"ఛా! ఇలాంటి సమయంలో నేను నవ్వుతానా!?"

"మీ మావయ్య ఒట్టేశారు."

"ఏమని?"

"మంజూ ఇంటికెళ్ళినా.. మాట్లాడినా ... దాన్ని ఈ ఇంటికి రానిచ్చినా .. ఏదైనా పంపినా ... తన మీద ఒట్టని చెప్పారు."

"ఒట్టు తీసి గట్టున పారెయ్యి."

"........."

"నిజమత్తా! చిన్నప్పుడు నేనూ మంజూ ఇలాగే ఒట్లు పెట్టుకునే వాళ్ళం. తరవాత... సమయానుకూలంగా ఆ ఒట్లు తీసి గట్టున పారేసే వాళ్ళం. మాకేం హాని జరిగేది కాదు. నువ్వూ అలాగే ఒట్టు తీసి గట్టున పెట్టు."

"ఆయన ... నా మీద ఒట్టు వేస్తే... అలాగే చేసే దాన్ని."

"ఆయన నీ మీదెందు కేస్తాడు? నీ మీదేస్తే నువ్వు పట్టించుకోవని ఆయనకు తెలుసు.

అయినా.. నీకీ మూఢనమ్మకాలేమిటి? కూతురు కన్నా ... నీకు ఒట్టు తాలూకు పట్టింపే ఎక్కువా?"

"పట్టింపు కాదు. నమ్మకం."

"నా మొహం! నీకు మంజూ అంటే ఎక్కువిష్టమా... మావయ్యంటే ఎక్కువిష్టమా?"

"నాకు ఇద్దరూ సమానమే. అంతేకాదు. ఆ ఒట్టు మంజూ మీద వేసినా ... తాతగారి మీద వేసినా కూడా నేను దాన్ని దాటను. నా ఒక్కదాని మీదయితేనే నాకు పట్టింపుండదు."

"నువ్వింత పిచ్చి తల్లివి కనకనే.. నువ్వు కన్నకూతురి విషయంలో నీ హక్కుల్ని కాలరాస్తున్నాడు మావయ్య. అయితే ఆయనగారు ఒప్పుకునే వరకూ ఈ పరిస్థితి ఇంతేనా?"

"ఇంతే."

"ఇప్పుడు మంజూ కు నువ్వు జున్ను ఇవ్వవా అయితే?"

"ఒద్దు హైమా" ఇలా చెయ్యాలి సొచ్చినందుకామె మననెంత గాయపడుతోందో ఆమె మొహం స్పష్టంగా చెపుతోంది.

"పోన్లే! నీ జున్ను ఎవరిక్కావాలి. ఈ రోజు ఉదయం మా కర్రావు ఈనింది. సాయంత్రం నేనే జున్ను తయారు చేసి మంజూ కిస్తాను." అన్నది హైమ.

"నిజంగా! నిజంగా నా హైమా? మీ ఆవు ఈనిందా?"

"ఏం? ఈనటం అనే గుత్తాధికారాన్ని కూడా బాబూరావుగారి ఆవులే తీసుకున్నాయనుకున్నావా?" అన్నది హైమ. మంజూ ఆ ఇంటి నొదిలి వెళ్ళిపోయాక మొదటిసారిగా మనసారా నవ్వింది శార్వాణి. హైమ మాటలకు తల వెనక్కి ఒంచి పకపకా నవ్వింది.

ఆ సంతోషం ఆమె కెందు కొచ్చిందో హైమకు తెలుసు. ఆ అమ్మాయి కిప్పుడు రిలీఫ్‌గా అనిపించింది.

"నిజం అత్తా. సాయంత్రం ... బెల్లం, ఏలక్కాయలు, పచ్చకర్పూరం వేసి జున్ను చేస్తాను. నేనూ మంజూ చెరో గిన్నె నిండా పోసుకుని, దొడ్డి గుమ్మంలో

కూర్చుని హాయిగా తింటాం ఈ సారి మీ ఇంటికి ఒక్క చెంచాడు కూడా పంపం అన్నది హైమ

"మాకేం, ఒద్దులే తల్లీ! నువ్వు నీ ఫ్రెండే తినండి ' అన్నది శార్వాణి ఆమె ఇంకా నవ్వుతూనే ఉంది

హైమ వెళ్ళిపోతుంటే వాకిట్లోకొచ్చి థాంక్స్ తల్లీ! మంచివార్త చెప్పి, ఆ ఇల్లాల్ని సంతోష పెట్టావు లేకుంటే పాలు జున్నుగా మారటం ఆగే వరకూ ఏడుస్తూనే ఉండేదామె కూతురుకు పెట్టుకోలేని తన అసమర్థతను తలుచుకుని అందరం బాగనే ఉన్నామని చెప్పు మంజూ కు. శార్వాణి దిగులు సంగతి తెలియనివ్వకు చిన్నపిల్ల ఇది వింటే బెంగ పడుతుంది ఆ ఇంట్లో వాళ్ళ మనసుల కనుగుణంగా నడుచుకుని మంచి పేరు తెచ్చుకోమను

నువ్వు తరుచుగా వచ్చి పోతుండమ్మా! అన్నారు తాతగారు

అలాగే తాతయ్య " అని వెళ్ళి పోయింది హైమ

* * * *

బాబూరావు పేరు చెప్పుకుని అతని అండతో పైడిపల్లిలో అధికారాన్ని చలాయిస్తూ ఉంటాడు పాపారావు.

ఏ పదవీ బాధ్యతా లేనివాడయినా ఎవరూ ఎన్నుకుని అంగీకరించక పోయినా అతనో చిన్న సైజు నాయకుడా ఊరికి ఆ పదవి అతనంతట అతను సృష్టించుకున్నదే

గూడాన్ని జాగ్రత్తగా కాపు కాస్తుంటాడు, వాళ్ళు ఏకమవకుండా

బాబూరావు పైడిపల్లి వచ్చినప్పుడు ఊళ్ళో జరిగిన సంఘటనల నన్నిటినీ తన కనుకూలంగా మలుచుకుని మధ్య మధ్య బాబూరావు పేరు ఇరికించుకుంటూ పోయి అవతలి వాడిమీద ద్వేషాన్ని రెచ్చగొట్టి తను చేసిన వెధవ పన్లకు ఆయన ఆమోదాన్ని ఆ మూడ్‌లో పొందుతుంటాడు పాపారావు

పాపారావు ఆడవాళ్ళ విషయంలో కీచకుడి లాంటివాడు మంత్రిగారి ముఖ్య అనుచరుడు కాబట్టి అతని జులుం ఆ పల్లెలో యథేచ్ఛగా సాగిపోతుండేది

పాపారావు చేసే వెదవ పనులకు ఎప్పటికప్పుడు అడ్డుపడుతూ అతను చూపే ఏ ఆకర్షణలకూ లొంగక విధి నిర్వహణలో కఠినంగా ఉండే ప్రణీత్ అంటే పాపారావుకు గిట్టదు.

మంజీరను తీసికెళ్ళి పెళ్ళి చేసుకున్నాక ప్రణీత్‌మీద పాపారావుకి బాగా పట్టు చిక్కింది

బాబూరావు వచ్చినప్పుడల్లా క్యాజువల్‌గా చెప్పినట్లు ప్రణీత్‌మీద ఏదో ఒకటి చెప్పి ఆయన్ని రెచ్చకొట్టేవాడు ప్రణీత్, రాజకుమార్‌ల స్నేహం గురించి కథలుగా వర్ణించి బాబూరావు మనసులో విషాన్ని నింపేవాడు

* * * *

పాపారావు భార్య పేరు హరిణి ఒక మాదిరి అందగత్తె ముగ్గురు పిల్లల తల్లయిన హరిణి సంసారపు గొడవల్లోపడి, పూర్వపు నునుపుదనం కోల్పోతే




ఇలాంటి వాళ్ళు రాజకీయ రంగంలో ఎక్కువగా ఉంటూ ఉంటారు నాయకులు వీళ్ళని తమ నియోజక వర్గాలకు ట్రంప్‌కార్డ్స్ లా భావించి. సాధారణంగా వాళ్ళ చర్యలకు అడ్డుపడరు దాన్ని అలుసుగా తీసుకుని ఇలాంటి వాళ్ళు విజృంభిస్తూ ఉంటారు వీళ్ళ దుశ్చర్యల ప్రభావం ఆ నాయకుల మీద పడుతూనే ఉంటుంది అయినా వాళ్ళు పెదవి విప్పరు

అదే రాజకీయం!

ఎన్నికల సమయంలో చీలిపోయిన గూడెం తిరిగి ఒకటవనే లేదు అలా ఒకటవకుండా అడ్డుపడేవాళ్ళలో ప్రముఖుడు పాపారావే ఇందుకు బాబూరావు మద్దతు ఎప్పుడూ ఉంటుంది

'ఒక గ్రూప్ నిలబడాలంటే కేవలం అభిమానం మాత్రమే చాలదు ఇంకోడి మీద ద్వేషం కూడా ఉండాలి ఈ సత్యం తెలిసిన వాడు బాబూరావు

గూడెం కలిసిపోతే రాజకుమార్ బలపడతాడు ఇలా విడివిడిగా చీలిఉంటేనే తన గ్రూప్ తనకుంటుంది అందుకే ఆ రెండు వర్గాలనూ కలవ నివ్వడు బాబూరావు

పాపారావు బాబూరావు గ్రూప్‌కి ఉప నాయకుడు కార్య నిర్వహణాధికారి బాబూరావుకి కుడి భుజం లాంటివాడు

ఊళ్ళో రాజకీయ దౌత్యాన్ని నెరిపేబారం అతని మీద పెట్టి తను రాజధానీ నగరంలో నిశ్చింతగా ఉంటాడు బాబూరావు ఆయన ప్రతినిధిగా పాపారావు

పాపారావు దుష్ప్రవర్తన వల్ల మానసికమైన మార్దవాన్ని కూడా కోల్పోయింది

హరిణికి పాపారావుకీ ఇంట్లో నిత్యం రణరంగమే ప్రతి విషయానికి తనను చావబాదే పాపారావు అంటే ఆమెకు భయం ద్వేషం భార్య దగ్గర కూడా తనక్కావలసిన ప్రతిదాన్నీ అధికార బల ప్రదర్శనల ద్వారానే పొందాలనుకునే అతని అహం ఆమెకు నచ్చదు బజారు ఆడవాళ్ళను తెచ్చి హరిణిని లేపి, ఆమె ఎదురుగానే వాళ్ళను అనుభవిస్తూ ఆమె ఇవ్వలేని సుఖాన్ని గురించి ఎద్దేవా చేస్తూ ఉంటాడు పాపారావు అతనికి అదో ఆట!

ఉక్రోషంతో కోపంతో కుతకుతలాడి పోతుంది హరిణి అక్కడికక్కడే అతన్ని నరికి పారెయ్యాలని పిస్తుందామెకు 'తను కూడా ఈ దరిద్రుడిని కాదని ఎటైనాపోతే? అనిపిస్తుందామెకు అతని మీద తనకున్న అసహ్యాన్ని, అసంతృప్తిని, రకరకాల చర్యల ద్వారా వ్యక్తం చేస్తుంటుంది హరిణి అది చూసి అతనింకా రెచ్చి పోతుంటాడు ఇద్దరూ ఆగర్భ శత్రువుల్లా మసులు తుంటారు ఒకే చూరుకింద

ఒక కొంప ఆ కొంపను బాధ్యతగా కావలి కాయటానికి పిల్లల్ని కనటానికి, తనకు నమ్మకంగా అన్నీ చేసి పెట్టటానికీ ఒక ఆడమనిషి కావాలి

ఆమే భార్య! భార్యమీద పాపారావు అభిప్రాయం ఇదీ!

పిల్లలంటే పాపారావుకు మమకారం! ఈ ఒక్క వీక్ పాయింటూ ఆమెకు దేవుడిచ్చిన వరం

(ఇంకాఉంది)

## వ్యక్తిగతం



శ్రీమతి కుల్దీప్ కౌర్ బ్రిటిష్ పౌరసత్వం గల పంజాబీ మహిళ ఆమెని నవంబర్ 6న ఢిల్లీ పోలీసులు అరెస్టు చేశారు ఆమె వయసు 40 సంవత్సరాలు. ఆమెకు తీవ్రవాదులతో సంబంధాలున్నాయనే నేరారోపణతో పోలీసులు ఆమెను నిర్బంధం లోకి తీసుకున్నారు ఆమెకు. ఆమె కుటుంబానికి దేశంలోనూ, విదేశాలలోనూ చాల మంది ప్రముఖులతో స్నేహ సంబంధాలున్నట్టు తెలుస్తున్నది' కేంద్ర హోం మంత్రి శ్రీ బూటాసింగ్ తోను, లండన్‌లో స్థిరపడిన ఆయన సోదరునితోను ఈ కుటుంబానికి సాన్నిహిత్యం ఉన్నదట శ్రీ బూటాసింగ్ లండన్ వెళ్ళినప్పుడు శ్రీమతి కౌర్ ఇంట్లో విందుకు హాజరయ్యారని, ఆమె భర్తతో చాల సేపు ముచ్చటించారని తెలుస్తున్నది ఆమె భారత దేశానికి వచ్చిన సందర్భంలో ఆమెకు శ్రీ బూటాసింగ్ కారు పంపారని అందువల్లనే ఆమె సోదాలు లేకుండా విమానాశ్రయం నుంచి బయట పడిందని తెలుస్తున్నది తనకసలు ఆ స్త్రీ తెలియనే తెలియదని శ్రీ బూటాసింగ్ అన్నారు

82 సంవత్సరాల వయసులో అనారోగ్యంతో ఉన్న తండ్రిని కలిసేందుకు భారతదేశం వచ్చిన శ్రీమతి కౌర్ విదేశీ పౌరురాలయినందున పంజాబ్ వెళ్ళేందుకు అనుమతి దొరకలేదు తండ్రిని ఢిల్లీలోనే కలిసి ఆమె బ్రిటన్‌కు తిరుగు ప్రయాణం కాగా ఢిల్లీలోని ఇందిరాగాంధీ అంతర్జాతీయ విమానాశ్రయంలో ఆమెను ఆపివేశారు ఆమె అరెస్టు వివరాలు తెలుసుకునేందుకు, ఆమెను విడుదల చేయించుకుని తీసుకు వెళ్ళేందుకు బ్రిటన్ నుంచి పాలక పక్షం పార్లమెంటు సభ్యుడు టెర్రీడిక్స్ ఢిల్లీ వచ్చారు శ్రీమతి కౌర్ భర్త శ్రీ మొహిందర్ పాల్ సింగ్ బేడీ బ్రిటన్‌లోని ఆసియా వారికీ, కన్జర్వేటివ్ పార్టీకీ సత్సంబంధాలు నెలకొల్పేందుకు ఆ పార్టీ ఏర్పరచిన ఆంగ్లో - ఏషియన్ సొసైటీకి అధ్యక్షుడు ఈ సొసైటీలోని తగాదాల మూలంగా పంజాబ్‌లోని కొన్ని పత్రికలు ఈ కుటుంబానికి టెర్రరిస్టులతో సంబందాలున్నాయని ఆరోపిస్తూ రాశాయని శ్రీమతి కౌర్ అంటున్నారు ఢిల్లీ విమానాశ్రయంలో సోదా చేసినప్పుడు ఆమె దగ్గర 'దేశ్‌పర్‌దేశ్' అనే పంజాబీ పత్రికలో అచ్చయిన భింద్రన్ వాలే, తదితరుల ఫోటోలున్నాయి ఆ ఫోటోలు అచ్చయిన పేజీకి వెనుక వైపున తన కూతురి వివాహం ఫోటోలు, తమకు అభినందనలు తెలుపుతూ బ్రిటిష్ ప్రధాని శ్రీమతి మార్గరెట్ థాచర్ పంపిన సందేశం ఉండడం వల్లనే తానది ఉంచుకున్నానని శ్రీమతి కౌర్ అన్నారుట

## వారఫలం

### 2-1-1987 శుక్రవారం మొదలు 8-1-1987 గురువారం వరకు

★ **మేషం** · మంచి ధైర్యం చేసారు సమయం ఎరిగి మీ అభిమతం నెరవేర్చుకో గలుగుతారు పత్రికా ప్రచురణమందు చెప్పదగిన అనుకూలత ఏర్పడుట గమనిస్తారు సజ్జన సాంగత్యం చేకూరుతుంది విలువగల వస్తువులు సేకరించుకో గలుగుతారు అలవాటుగా చేసే పనులందు మేలున్నది స్త్రీలకు ఉత్తమ సాంగత్యం వృత్తియందు ప్రగతి

★ **వృషభం** : రాజకీయంగా మీకు ఈ వారం ఏమాత్రం మేలుగాదు వ్యవహారరీత్యా అంతకన్న గాదు వ్యాపార సంబంధంగా అసలు లాభంలేదు వారఫలం ఉత్తమం కాదని మీరే గ్రహిస్తారు ఏ పనీ సానుకూలం కాకపోవటం గమనింపదగిన విషయం స్త్రీలకు ఊహించని రీతిని ఒకానొక వ్యవహారం సానుకూలం కానున్నది సభా పత్రికా గౌరవాదులు కొందరకు

★ **మిధునం** కృషితో నాస్తి దుర్భిక్షమ్ అని ఎరిగినవారుగాన, నిరంతరంగా కృషి చేసి మేలు పొందుతారు భారీ వ్యాపారాన లాభం గడిస్తారు చేసే వృత్తియందు ప్రగతి సాధిస్తారు ఇతరుల వలన రావలసిన పైకాన్ని ఎలాగైనా గుంజుకొంటారు అధికాదాయం లేక పోయినా ఆదాయానికి లోపం రాదు స్త్రీలకు విలాసంగా వారం గడవటం. విందు వినోదాలతో కాలక్షేపం చెప్పదగిన ముఖ్యాంశం

★ **కర్కాటకం** : రాజకీయంగా ఎలాంటి మేలు జరుగదని గ్రహించాలి అభిమానించే వారుంటారు వారివలన ఏవో వ్యవహారాలు సానుకూలం చేసికో గలుగుతారు ఇంట ఈ వారం జరుగవలసిన శుభ కార్యం, వాయిదా పడుట కూడ గమనింపదగిన అంశం అధికారమందు వృద్ధి కొందరకు చెప్పదగిన అంశం స్త్రీలకు స్వల్పాదాయం

★ **సింహం** : ఎంతో కాలంగా ఆశించిన విలువైన యంత్రాన్నిగాని, వాహనాన్నిగాని, అమూల్య వస్తువులనుగాని సేకరించుకో గలుగుతారు పదిమందిలో పేరు ప్రతిష్ఠలకు ఆకరమైన వారం దాయాదులు, కానివారి గొడవ తగ్గుముఖం పడుతుంది వీలైనంతలో మౌనంగా ఉండటం అలవరచుకొనటం శ్రేష్ఠం స్త్రీలకు శుభ కార్యతత్పరతకు అవకాశముంటుంది

★ **కన్య** : విద్యా విధానాన కొందరకు అభిలషించిన రీతిన జరుగనున్నది పరీక్షలందు విజయం చెప్పదగిన అంశం వృత్తిరీత్యా అనుకూలమైన వారం కాని వారిగొడవ లేకపోతే మీకు ఎలాంటి యిబ్బంది రాదని గ్రహించాలి స్త్రీలకు ఉద్యోగ రీత్యా యిటీవల కనిపించిన అనానుకూలత తొలగి పోయి, ప్రశాంతత ఏర్పడుతుంది

★ **తుల** : చిత్ర విచిత్రమైన సంఘటన జరుగవచ్చు కాదనుకొన్న వ్యవహారం సఫలం కానున్నది వృత్తియందు ప్రోత్సాహం అతిశయిస్తుంది మిక్కిలి కావలసిన వారివలన ఏదో ఊహింపరాని మేలు జరుగనున్నది క్రితం చేసిన పనులందు చేసిన తప్పులు దిద్దుకొంటారు స్త్రీలకు లాభదాయక వారం క్రొత్త వస్తుసేకరణకు అనుకూలం

★ **వృశ్చికం** · ఈ రాశి జాతకులకు వారమంతా పోరాటంగా పరిణమిస్తుంది ఏదో పోగొట్టుకొన్నట్లు బాధపడుతూరు నిజంగానే అలా యిలా తిరుగుతూ వస్తువులు పోగొట్టుకోవటం జరుగుతుంది మీ శ్రేయస్సు కోరిన వారితో అనవసరంగా విరోదం కొనితెచ్చుకోవలసి రావచ్చు. గమనించాలి స్త్రీలకు ప్రత్యేకంగా విందు వినోదాలలో పాల్గొనటం, వృదా కాలక్షేపం చెప్పదగిన అంశాలు

★ **ధనుస్సు** : అడుగడుగునా యిబ్బందులు రావటం గ్రహించగలరు ఎలాగైనా ఈ వారం యిబ్బంది పడక మానదు ఈ హెచ్చు తగ్గులు, యిరుకు యిబ్బందులు. దనాభావం. అదిక వ్యయం వ్యయరాశి 'శని' ప్రబావంగా గ్రహించి, శనికి శాంతి జరపటం శ్రేయం 'అనారోగ్య సూచనలు కూడ కొందరి విషయంలో చెప్పవచ్చు స్త్రీలకు మానసికంగా బాగ లేకపోవటం. అనవసరంగా కాలహరణం

★ **మకరం** · స్థితియందు మెరుగు కనిపిస్తుంది పెంపు చేకూరుతుంది ఎంతో కాలంగా ఉన్న యిబ్బందులు తొలగిపోతాయి సుఖ శాంతులు, కొందరకు రచనా వ్యాసంగాన సదవకాశాలు, కొందరకు 'సినీ' రంగాన చక్కని అవకాశాలు లభిస్తాయి, చేపట్టండి శక్తియుక్తులు ప్రదర్శించండి పది మందిలో పేరు తెచ్చుకోండి స్త్రీలకు వృత్తియందు చెప్పదగిన మార్పు, వస్తుసేకరణకు అవకాశం

★ **కుంభం** ఎవరో ఒకరు మీ ఆదాయానికి అడ్డు తగులుతారు మీ మార్గానికి అవరోధాలు కల్పిస్తారు సాధు సజ్జన సాంగత్యం లభ్యం కాకపోవచ్చు రాజకీయంగా మేలుగాదు ప్రభుత్వ పరంగా గొడవలు రావచ్చు అత్యాశకు పోయామని బాదపడుతారు స్త్రీలకు డబ్బు అందటం, శుభ కార్యాలోచనలు ఉండటం

★ **మీనం** : రాశియందు స్థితుడు రాహువు మీనరాహువు, గోచార గ్రహమయినా కొంత యిరుకు యిబ్బందులు తెచ్చి పెడుతాడు ముందు వెనుక లాలోచించి ఏ పనికైనా దిగవలె ధన రాబడి అంతంత మాత్రమే చిక్కిన అవకాశాలను జారవిడవకండి శ్రేయోదాయకంగాదు ఇంకా అధిక వ్యయం తప్పదు స్త్రీలకు సాహితీ మార్గాన చక్కని అవకాశాలు లభ్యం కావటం, స్థిరాస్తి పెంపొందించుకొనే అవకాశాలుంటాయి

—విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# కోహినూర్

దాటి పోతాను ఈ బాట
రాళ్లమయమైనా సరే కంటకావృతమైనా సరే
నీ చేతిలో నా చేయుంచి వంత చింతలు మఱచి
సాగిపోగలను నిశ్చింతగా ప్రశాంత పవనంలో పయనించే
విహంగంలా
అనురాగం చిందే నీ హృదయం నాకు వేయి విధాల విదితం

**KOHINOOR®**

గులాబీరంగు
సుఖదాయకమైన లూబ్రికేటెడ్
కాండోమ్. ఎలెక్ట్రానిక్
ఉపకరణాలతో పరీక్ష
చేయబడినది.




ఇప్పుడు
ఖర్చు ఆదా చేసే
విధంగా ఒకే
ప్యాక్‌లో పది.

ttk తయారీ

MAA (S) LRC 5 A TEL 86

# లాటరి

వి.వి.సుబ్బారెడ్డి

అవధాన్లుగారు రిటయిరయ్యాక ఆరోగ్య వరంలో సెటిలయ్యారు ఆయన సంపూర్ణ నామ ధేయం అగ్నిహోత్రావధాన్లే అయినా సింపుల్‌గా ఏ హెచ్ అవధాన్లు అని పేరుని కత్తిరించుకున్నారు. ఆయన పని చేసింది 'అగ్నిమాపక దళం'లో 'కొంపలార్పడం' ఆయన వృత్తి, చేసినంత కాలం చిత్తశుద్ధితో పని చేసారు ఆయనా?- ఆయన నిప్పులాంటి మనిషి గదండీ!" అని అనిపించుకున్నా రందరిచేతా

'ఉద్యోగ ధర్మమే నా ఊపిరి- ఆ తర్వాతే పెళ్ళాం- బిడ్డలూ- యితర వ్యాపకాలూను' అని బహి రంగంగా అనేకమార్లు ప్రకటించే వారాయన.అసలు ప్రమాదాలన్నవి- అవి ఏవయినా కానీయండి- ముందుగా చెప్పిరావు గదండీ?'- అందుకనే ఆయన యిల్లు వదిలి వెళ్ళడానికి- తిరిగి యిల్లు చేరడానికి ఓ టైంటేబులంటూ ఏమీ వుండేదికాదు అవధాన్లు గారి ఈ వృత్తి ధర్మం- పాపం ఆయన ఏకైక కుమారరత్నం యాజులు చదువుమీద గట్టి దెబ్బ కొట్టింది యాజులు తల్లి ఒక పాతకాలంనాటి మనిషి కావడంతో – దానికి తగ్గట్టే వాడి చదువంతా వానాకాలంపాలై, నాని- బి ఏ తో ఆగిపోయి, ఇక కదలనని మొరాయించింది

"నేనింక చదవన్నాన్నా! ఏదయినా ఉజ్జోగం చేసుకుంటా'- ఒక శుభ ముహూర్తంలో తండ్రి ముందు కుండ బద్దలు కొట్టి తెగేసి చెప్పేసాడు యాజులు

'విసుత్తపోలేదు అవధాన్లుగారు తన పరపతిని తాకట్టుపెట్టి, సంపాదన ఎరజూపి కొడుక్కి మంచి చదువుని 'కొన' గలిగిన స్థితిలో తానున్నా, అలా 'కొనక', యిక కొడుక్కి చదువు వంట బట్టేలా లేదని గ్రహించినవాడై, తమ ఊళ్ళోనే ఏదో గవర్నమెంటు ఆఫీసులో చిన్న ఉద్యోగం వేయించి- ఆ వెంటనే తమ దగ్గర బంధువుల అమ్మాయిని ముడిపెట్టి- కొడుకుని ఓ యింటివాణ్ణి చేసి 'అమ్మయ్య' అనుకున్నారు అవధాన్లుగారు

యాజులుకి దురభ్యాసాలంటూ ఏంలేవు- ఒక్క దూమపానం తప్పిస్తే అసలు ఈ అలవాటు అటు తాత గార్నించి తనకి సంక్రమించిందట ఎటొచ్చీ ఆయనేమో 'సీమ సిగార్లని' కాలిస్తే తను ఫిల్టరు సిగరెట్లుతో సరిపెట్టుకున్నాడు

కాల చక్రం తిరుగుతోంది విసుగూ- విరామం లేకుండా ఉద్యోగంలో ఓ మెట్టు ఎక్కి 'సీనియర్ అసిస్టెంటు' అనిపించుకున్నాడు యాజులు సంసారంలో తొలి 'ఇంక్రిమెంటు'ని ప్రసాదించాడా భగవంతుడు!- ఒక 'మగ నలుసుని' వాడికి తండ్రి పేరే పెట్టుకున్నాడు సాంప్రదాయబద్ధంగా కాముని పున్నమినాడు- అదే 'హోలీ' పండుగనాడు పుట్టడం చేతనో యేమిటో అవధాన్లుకి రంగులంటే మహా ఆనందం! రంగు కాగితాలంటేనూ- అందులో పంచరంగుల లాటరీ టిక్కెట్లంటే మరీ చెప్పలేనంత ఇది!

* * * * * *

ఆ రోజు తనకి బాగా జ్ఞాపకం! రాజకీయ నాయకుడెవరో 'జాల్రీ తన్నేశాడని చెప్పి, ఆఫీసుకి సెలవిచ్చారు- పడక్కుర్చీలో జార్లబడి పేపరు చూస్తున్న యాజులుకి చటుక్కున ఏదో గుర్తొచ్చి

"ఒరేయ్! అబ్బాయ్!" అంటూ పిలిచాడు కొడుకుని.

"పిల్చావా నాన్నా"- అవధాన్లు ఆల్బంలో రంగు రంగుల బొమ్మల్ని అంటించే కార్యక్రమాన్ని సగంలో ఆపివచ్చి అన్నాడు.

ఆఁ ఆ రవణ షాపుకెళ్ళి ఓ సూపర్‌స్టార్ ఫిల్టరు పేకట్ తీసుకురా ఇదుగో- ఇంద- ఈ ఐదు రూపాయల నోటు తీసుకువెళ్ళు" కొడుక్కి ఆర్డరు జారీ చేసాడు యాజులు

తండ్రి చేతిలోని నోటుని అందుకొని తుర్రు మన్నాడు అవధాన్లు

రవణ కిళ్ళీబడ్డీ పెట్టుకొని సైడ్ బిజినెస్‌లా లాటరీ టిక్కెట్లు, అమ్మకాన్ని చేపట్టాడు, వ్యాపారంలో 'వేన్నీళ్ళకి చన్నీళ్ళు' అవసరాన్ని గ్రహించిన వాడై.

వచ్చిన అవధాన్లను చూసి-

"ఏం బాబూగారూ! బాగా చదువుకొంటున్నారా?" పరామర్శించాడు రవణ.

"ఆ ఆఁ!" అంటూ" ఒక సూపర్‌స్టార్ ఫిల్టరు సిగరెట్టు పెట్టి తెమ్మన్నాడు నాన్న, ఇదుగో ఐదునోటు" అంటూ రవణకి ఐదు రూపాయల నోటు ఇచ్చాడు అవధాన్లు.

సిగరెట్టు యిస్తూ "చిల్లరలేదు బాబుగారూ! ఆ పేకెట్టు నాలుగు రూపాయలు. ఇంకా మీకు నేను రూపాయి యివ్వాలి. దానికి బదులు యిదుగో యీ లాటరి టికెట్టు తీసుకోండి. నాన్నగారికి నేను చెప్పానని చెప్పండి. ఎల్లుండే కల్పతరు బంపర్ డ్రా దాంట్లో మీకు ప్రైజు గారంటీ" అన్నాడు నవ్వుతూ రవణ

జరిగిందంతా తండ్రికి వివరించాడు అవధాన్లు.

ముందా సిగరెట్టు పెట్టిలా యియ్యి. ఆ లాటరీ టిక్కెట్టు నాకెందుగ్గానీ నువ్వే వుంచుకో" అన్నాడు కొడుకుతో.

* * * * * *

అగష్టు 15-

స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలు ఎటు చూసినా! లౌడ్‌స్పీకర్లలోంచి దేశభక్తి ప్రసారమవుతోంది- పొంగిపొరే నదిలా పరవళ్ళు త్రొక్కుతూ. ఊరంతా ఒకటే కోలాహలం!! ఆ రోజేనండీ బంపర్ డ్రా. యాజులుకి ఆ ధ్యాసేలేదు. యిక ఎటొచ్చీ తాపత్రయ మంతా అవధాన్లదే! మరో మూడు రోజులు గడిచిపోయాయి.

ఆ రోజే పేపర్లో డ్రా ఫలితాలు ప్రకటిస్తారని అవధాన్లు విన్నాడు తెల్లారాక పేపరు రాగానే గమ్మున ప్రక్కింటి శర్మగారింటికి వెళ్ళి

అంకుల్! ఒక్కసారి పేపరిలా యివ్వరూ! ఇప్పుడే పట్టుకొచ్చి యిస్తా మళ్ళీ"

"ఏవోయ్ ఏమిటి సంగతి? ఏవైనా లాటరీ ఛాన్సు గాని తగల బోతోందా ఏమిటి?" సరదాగా నవ్వుతూ పేపరు అవధాన్ల కిచ్చారు శర్మగారు

పేపరందుకొని యింటికొచ్చి బెడ్‌రూంలోకి పోయి తలుపులు దగ్గరగా వేసొచ్చి పేపరుని నేల మీద పరచి పేజీలు తిరగేస్తున్నాడు ఆఁ ఇదిగో మూడో పేజీలో వేసారు ఫలితాలు! వెళ్ళి రవణ తనకి అంటగట్టిన లాటరి టికెట్టుని "జామెట్రి' బాక్సు లోంచి తీసి పట్టుకొచ్చాడు. తన టికెట్టు నెంబరు ఎ వై – 508515 ఎందుకయినా మంచిదిలే అయినా అత్యాశ పనికిరాదంటారుకదా' అనుకొంటూ లిస్టులో దిగువ నుంచి పైకి వెతుకుతున్నాడు నెంబర్లని

కన్సొలేషన్ నెంబర్లలో లేదు తన నెంబరు ఫోరుత్ప్రైజు గెల్చుకున్న నెంబర్లలో కూడాలేదు పోనీ- థర్డ్ ప్రైజు నెంబర్లలో – అక్కడా లేదు. తన పిచ్చిగానీ అసలు ప్రైజుల్ని గెలుచుకునే ముఖాలే వేరు సెకండ్ ప్రైజు లిస్టుకూడా చూసేస్తే యిక పేపరు మడిచేసి యిచ్చెయొచ్చు

రెండవ ప్రైజులు రెండు ఒక్కొక్కటి ఏకంగా ఏభైవేల రూపాయలు ఒకటో నెంబరు ఎ. పి 624324 తన నెంబరే కాదు! రెండో నెంబరు ఎ. వై-ఐదూ- సున్నా- ఎనిమిది- ఐదూ- ఒకటీ- ఐదూ- అమ్మో! తన టికెట్టు నెంబరే అదీ- తన కళ్ళని తనే నమ్మలేక పోతున్నాడు. అవధాన్లు ఒకటే దడ- వళ్ళంతా ముచ్చెమటలు! వెళ్ళి ట్యూబ్‌లైటు వేసి, ఫాన్ ఆన్‌చేసొచ్చి మళ్ళీ- మళ్ళీ చూసాడు సందేహంలేదు. ఆ నెంబరూ, తన టికెట్ నెంబరూ ఒకటే!

నాన్నా" అంటూ ఒక చేత్తో పేపరు, రెండో చేత్తో టిక్కెట్టు తీసుకొని సుడిగాలిలా దూసుకు వెళ్ళాడు అవధాన్లు.

"మన టిక్కెట్టుకి సెకండ్ ప్రైజు వచ్చింది నాన్నా ఏకంగా ఏభైవేల రూపాయలు- తెలుసా" అన్నాడు.

ఆఁ-" విస్తుపోయి క్షణం సేపటికిగానీ తేరుకో లేదు యాజులు "ఏమిట్రా- నువ్వు చెప్పేది నిజమే?'- ఏదీ ఆ పేపరిలా యియ్యి ముందు, నన్ను చూడనీ" అంటూ నెంబరు మరోసారి చూసి నిర్ధారణ చేసుకొని

ఏమేవ్! ఇలారా ఓసారి అర్జంటుగా" అంటూ గట్టిగా భార్య కోసం కేకవేసి.

"మనకి లాటరీలో సెకండ్ ప్రైజొచ్చిందే. ఏభైవేలు అన్నాడు ఆనందంగా, పొపుగరిటితో బయటికి వచ్చిన భార్యామణితో,

"ఏమిట్రా ఆ హడావిడి?" గీస్తున్న గడ్డాని సగంలో ఆపివేస్తూ అన్నారు అవధాన్లుగారు.

"అవున్నాన్నా! మీ మనవడు మొన్న లాటరీ టికెట్టు తెచ్చాడు మన రవణ షాపు నుంచి సిగరెట్టు పేకట్




కొనఘుని ఐదు రూపాయలు నోటిచ్చి పంపిస్తే చిల్లర లేదంటూ దానికి బదులు ఈ లాటరి టికెట్టు యిచ్చాట్ట. దానికే సెకండు ప్రైజు వచ్చింది." అన్నాడు సంతోషంతో తేలియాడుతూ.

"మన అదృష్టమంతా మన బుజ్జిగాడేనండీ! అందుకే నేనెప్పుడో చెప్పాను పెద్దయ్యాకా వాడు మనలా కాకుండా ఏ లక్షాధికారో అవుతాడని హుఁ! మీకే నా మాటంటే విలువలేకుండా పోయింది 'నీ ముఖంలే' అంటూ కొట్టి పారేసారు. మరి యిప్పుడేమంటారు చెప్పండి?!" అంది యాజులు గారి భార్య కాస్తంత నిష్ఠూరంగాను, మరింత వ్యంగ్యంగానూ.

"ఆఁ చాల్లిద్దూ నీవేళాకోళం!" మృదువుగా భార్యని కోప్పడ్డాడు యాజులు.

"కంగ్రాట్యులేషన్స్ యాజులుగారూ! మీరు లాటరీలో ఏకంగా సెకండ్ ప్రైజు కొట్టేసార్ట! ఈ శుభవార్త అప్పుడే ఊరంతా పాకిపోయింది రవణ ఆ దారిన పోయే ప్రతీవాణ్ణి పిలిచి మరీ చెబుతున్నాడు ఈ సంగతి అసలు మొదట్లో ఈ వార్తని మేమూ నమ్మలేక పోయామనుకోండి ఇదుగో– యిక్కడికి వచ్చాకా నిజమని రూఢీ అయింది

అది సరేగానీ– ఏమిటి మా అందరికీ ఈ శుభ సందర్భాన 'శాంతి' చేసే ప్రయత్న మేమయినా ఉందాలేదా యింతకీ? ఏమంటావు చెల్లెమ్మా' అంటూ హడావిడి చేసేసారు శర్మగారొచ్చి స్వయంగా అభినందిస్తూ.

"దానికేం భాగ్యం అన్నయ్యగారూ!" అంది యాజులుగారి భార్య వినయం ఉట్టిపడుతూ.

అనుకోకుండా తలుపు తట్టిన అదృష్టానికి ఎంతగానో పొంగిపోయారు యింటిల్లిపాదీ. ఆ నోటా, ఆ నోటా ఈ వార్త పాకి ఎందరో హితులూ, శ్రేయోభిలాషులూ స్వయంగావచ్చి అభినందనలతో ముంచెత్తారు యాజుల్ని

# ఈ 'వేమన' పద్యాలు




ఆదికాలములను నల్పుడేమి యెఱుంగు
చెప్పలేడుగాని తప్పుబట్టు
తోయనేర్చు కుక్క దొంతులు చేర్చునా
విశ్వదాభిరామ వినురవేమ

గుక్క తిప్పుకోలేక పోయాడు యాజులు ఆనందంతో తల మునకలవుతూ.

ప్రైజు డబ్బు చేతికందాలంటే ఇంకా టైం పడుతుందట! ఏవేవో చాలా ఫార్మాలిటీలు పూర్తి చేయాల్ట! అందుకని బాంకుకి వెళ్ళి ఓ మూడువేలు ఏత్రా చేసి యింటిల్లిపాదికీ బట్టలు తెచ్చాడు. ఇరుగు, పొరుగు వాళ్ళకి పంచడానికి స్వీట్లు తెచ్చాడు. అంతేకాదు ఆఫీసులో కొలీగ్స్‌కి పార్టీ చేసి, తనకి అలవాటు లేకపోయినా మిత్రులకి యధాశక్తి ఔషధ సేవ చేసి వాళ్ళని తృప్తి పరచి తను తృప్తి పొందాడు.

ఆ ఆనందంతో చూస్తుండగానే రెండు రోజులు

## లాటరి

రెండు క్షణాల్లా దొర్లిపోయాయి. జరిగినదంతా ఒక కమ్మని కలేమోనన్న ఆలోచన వచ్చేది యాజులకి ఓసారి. మరుక్షణంలో ఆ ఆలోచన వచ్చినందుకు తనలో తాను నవ్వుకునేవాడు.

* * * * * *

ఆ రోజు–

అవధాన్లు వరండాలో పడకుర్చీలో జార్లబడి పేపరు తిరగేస్తూంటే– అతని చూపులు అలా వచ్చి, వచ్చి ప్రక... లు కాలమ్ దగ్గర ఆగాయి కాకతాళీయంగా.

"15-8-85న జరిగిన కల్పతరు బంపర్ డ్రా నెంబరు 148 లో ద్వితీయ బహుమతిని గెలుచుకున్న నెంబరు ఎవై–508515కి బదులుగా ఎ. వై-505815గా సవరించి చదువుకొన వలసిందిగా మనవి."

ప్రకటనని చూసీ చూడగానే అవధాన్లు చూపులు వెర్రి చూపులుగా మారిపోవడం జరిగింది.

వాయువేగాన్ని మించినది మనోవేగమని చెబుతారు! మరి ఆ మనోవేగాన్ని కూడా అధిగమించి లిప్తకాలం కంటె యింకా తక్కువ వ్యవధిలో ఈదుర్వార్త ఊరంతా వ్యాపించింది దావానంలా!

"సుఖాన ఉన్న ప్రాణం దుఃఖాన పెట్టుకున్నట్లైనదండీ!" అంది యాజులు భార్య కడుపులో అగ్ని గోళాన్ని దాచుకొని!

"అసలు నేను చెప్తే విన్నావుటే! అక్కడికి నీకొడుకేదో గొప్ప ప్రయోజకుడయినట్లు మాట్లాడి వాణ్ని వెనకేసుకొచ్చావే! వాడిలా చదువు, సంధ్యా లేకుండా లాటరీ చుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్నాడంటే అందుక్కారణం నువు చేస్తున్న గారాబం కాదూ?" అన్నాడు కస్సుమంటూ లేచిన యాజులు. భార్యమీదఉన్న అక్కసునంతా పైకి వెళ్ళగ్రక్కుతూ.

అంత క్రితం అడుగడుగునా అభినందనలను అందజేయడానికి స్వయంగా వచ్చిన శ్రేయోభిలాషుల్లో ఏ ఒక్కరూ ఈ సారి ఈ కష్టసమయంలో వచ్చి కనీసం "అయ్యోపాపం!" అన్న సానుభూతిని అందజేయడానికి కూడా సాహసించలేకపోయారు. అవును మరి! "నీ సుఖాన్ని నలుగురితో పంచుకో, నీ దుఃఖాన్ని నీలోనే దాచుకో" అని ఉండనే ఉంది పెద్దల మాట! కాగా, పాపం! పైకి వ్యక్తం చెయ్యలేకపోయినా, అడుగున గుండె పొరలలో సానుభూతిని గూడుకట్టుకునే ఉండాలి తన శ్రేయోభిలాషులందరికీ" అనుకున్నాడు యాజులు, వాళ్ళని తప్పుబట్టడం ధర్మం కాదు గనుక.

అవధాన్లు గారికి లోపల సాగర మధనం" జరుగుతూనే వున్నా, పైకి మాత్రం చాలా గంభీరంగా ఉన్నారు.

"చూడు యాజులూ! జరినదానికి మనం చింతించి ఏం ప్రయోజనం? అంతా విధిలిఖితం! ఎలా రాసి పెట్టి ఉందో అలా జరక్క మానదు. మనం కేవలం నిమిత్త మాత్రులం. అంతే!" అంటూ పైకి వేదాంత బోధ చేసారు.

అవును మరి! మంట లార్పడం వృత్తిరీత్యా అవధాన్లుగారు సర్వీసులో ఉండగా అవలీలగా చేసిన పనే కావచ్చు! కానీ మరి ఈ నాడు! తన వాళ్ళ గుండెల్లోని 'కార్చిచ్చు'ని ఆర్పాలంటే పాపం– ఆయనకీ సాధ్య పడిందికాదు, ఎంత ప్రయత్నం చేసినాగానీ! మూడు వేలూ పోతే పోయాయిగానీ, చివరకు ఆ డబ్బుతో కొనుక్కున్న అవమానం మాత్రమే మిగిలింది పాపం యాజులుగారికి– ఆయన కుటుంబానికీ! □

సీరియల్

# ఆరోహణ

శైలకుమార్



(గత సంచిక తరువాయి)

గదికి వచ్చాడు చక్రవర్తి నీలిమతో మాట్లాడిన మాటలు పదే పదే గుర్తొస్తున్నాయి తరంగాలు తరంగాలుగా హృదయాన్ని తాకుతున్న ఆనందం అతన్ని ఉక్కిరి బిక్కిరి చేస్తోంది ఆ ఉద్వేగం అతన్ని నిలువ నీయటం లేదు.

నిశ్చలంగా గోడకు వున్న క్యాలండరును చూస్తూ కూర్చున్నాడు చక్రవర్తి విషాదమే కాదు ఎక్కువైన ఆనందాన్ని కూడ భరించటం చాలా కష్టం ఆ ఆనందాన్ని అందరికీ చెప్పెయ్యాలనీ అంత ఆనందాన్ని పొందిన అదృష్ట వంతుడిగా తనను అందరూ గుర్తించాలని తపిస్తాడు మనిషి ఆ క్షణంలో అందరికన్నా తాను ఉన్నతుడనని అనుకుంటాడు

నిలువలేక పైకి లేచి టైం చూశాడు పన్నెండు. సిగరెట్ ప్యాకెట్ చేతిలోకి తీసుకుని చూశాడు ఇంకా రెండు సిగరెట్లు వున్నాయి

'నమ్మమంటారా' అని అడుగుతూ చూసిన నీలిమ ముఖం గుర్తొచ్చింది పులకరించింది అతని శరీరం

సిగరెట్ వెలిగించుకుని వీధిలోకి వచ్చాడు నిశ్శబ్దంగా, నిర్మానుష్యంగా వుంది వీధి అతని అడుగుల శబ్దం అతనికే వినిపిస్తోంది ఇళ్ళల్లో తిరుగుతున్న ఫ్యాన్ల శబ్దం తప్ప మరేం లేదు అందరూ నిద్ర పోతున్నారు

డబ్బు సంపాదించడంలోను, ఎదుటి మనిషిని ఏదో రకంగా మోసం చెయ్యటంలోనూ, తప్పించుకోలేని యాంత్రికతతోను రోజంతా అలసి పోయిన శరీరాల ఆదమరుపు

నాసికాపుటాల్ని తాకిన నైట్ క్వీన్ పరిమళం ఆగి ఆ ఇంటి వైపు చూశాడు చక్రవర్తి. ఎందుకు ఈ మనుషులు రాత్రి పూట నిద్రపోతారో అర్థం కాదు.

పొగలాగ కమ్ముకుని ఊహలతో ఉక్కిరి బిక్కిరి చేసే వెన్నెలని, పూల పరిమళాలతో నిండి పోయిన గాలిలోని చల్లదనపు సాంద్రతని, మనసుని మరో లోకాలకు తీసుకుపోయి విహరింప చేసే నీరవాన్ని, మధుర రాగ వాహినిని మదిలో దాచుకున్న మౌనాన్ని ఎందుకు అనుభవించలేరు వీళ్ళంతా. అందరినీ నిద్ర లేపి రాత్రిలోని సౌందర్యాన్ని చూపించాలని వెర్రి వూహ

నవ్వుకుంటూ తన ఆనందాన్ని ప్రభాకర్‌తో పంచుకోవాలని అతని గదికేసి నడక సాగించాడు

ప్రభాకర్ రూము కిటికీ నుంచి నీలిదీపపు కాంతి సన్నగా వెలుపలికి ప్రసరిస్తూ వుంది 'మంచి నిద్రలో వున్నాడేమో' అనుకుంటూ తలుపు దగ్గరికి వచ్చాడు

లోపల నుంచి గాజులు గల గల మన్న శబ్దం వినిపించటంతో తలుపు తట్టబోయిన వాడల్లా ఆగి పోయాడు చక్రవర్తి గుసగుసగా మాటల శబ్దం

'అబ్బ వుండు నాజూకైన విసుగుతో మత్తుగా స్త్రీ కంఠం ఆ కంఠం ఎక్కడో విన్నట్లు అనిపించింది చక్రవర్తికి మరుక్షణం గుర్తుపట్టాడు

ఆ స్వరం రేఖది

ఆశ్చర్యము, అసహ్యము కలిగాయి చక్రవర్తికి. రేఖ పట్ల మిగిలిన కొద్ది పాటి గౌరవం కూడ తుడిచి పెట్టుకు పోయింది

లోపలనుంచి వినిపిస్తున్న గుసగుసలు

ఇక అక్కడ నిలబడటం బావ్యం కాదని వెనక్కి తిరిగాడు చక్రవర్తి గదికి వెళ్ళ బుద్ధి కాలేదు. అలా తిరిగి వద్దామని రైల్వే స్టేషను వైపు నడిచాడు

ఆ నిశ్శబ్ద మహా సామ్రాజ్యానికి తానే నిరంకుశ చక్రవర్తి నైనట్లూ, నిద్రపోతున్న జగత్తులో తానే చైతన్య మూర్తి అయినట్లు భావన అతనిలో

'రూము కావాలా సార్

ఆలోచనలకు భంగం కలగటంతో ఆగి చూశాడు చక్రవర్తి సరిగ్గా రైల్వే స్టేషనుకు ఎదురుగా వున్న రోడ్డు కూడలిలో వున్నాడతను

'వద్దు అని కదిలాడు చక్రవర్తి

కాలేజీ అమ్మాయుందిసార్ రహస్యంగా చెప్పాడు చక్రవర్తితో పాటు నడుస్తూ అతను

ఆగి కోపంగా అతని ముఖంలోకి చూశాడు చక్రవర్తి చెంప పగిలేలా కొట్టాలనిపించింది అతన్ని, చేస్తున్న ఆ చీకటి వ్యాపారానికి కాలేజీ అమ్మాయిల పేరు వాడుతున్నందుకు

ఇంతలో ఓ గుంపు చేతిలో ట్రంకు పెట్టెలు, భుజాల మీద పిల్లలతో 'గోవిందా' అని అరుస్తూ సాగిపోయింది తిరుమలకు కాలి నడకన వెళ్ళే వాళ్ళు

వాళ్ళని తన ఎదురుగా వున్న అతన్ని మార్చి మార్చి చూసి మౌనంగా రూము దారి పట్టాడు చక్రవర్తి

లైటు ఆర్పేసి పడుకున్నాడు నిద్ర రావటం లేదు చేతికి సిగరెట్ ప్యాకెట్ తగిలింది ఉన్న ఒకే ఒక్క సిగరెట్‌ను తీశాడు నీలిమ మాటలు, ఆమెకిచ్చిన వాగ్దానం

గది అంతా నిండిన చీకటి ఏదో ప్రశాంతతను కలిగిస్తోంది చక్రవర్తికి ఆఖరి సిగరెట్‌ను ప్రేమగా తడిమి వెలిగించాడు ఆలోచనలు, కలలు, ఊహల్లో తేలిపోతూ చీకట్లో గడిపేశాడు ఆ రాత్రిని చక్రవర్తి

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

**జరిగిన కథ–4 :** తిరుపతిలో సన్మానానికి వచ్చిన సినీకవి చక్రవర్తికి నీలిమ కలుస్తుంది ఇద్దరూ ఒకరి సంగతుల నొకరు కనుక్కుంటారు చక్రవర్తికి పదేళ్ళ క్రింద స్మృతులు మదిలో మెదులుతాయి ఆఫీసులో హేళనకు గురవుతుండే కవి చక్రవర్తి ఊరట కోసం కపిల తీర్థం వెళ్ళి అక్కడ ఒక శ్రావ్యమైన గొంతులో తన పాట వింటాడు ఆ పాట పాడిన నీలిమతో పరిచయం చేసుకుంటాడు చక్రవర్తికి స్నేహితుడు ప్రభాకర్ తోడు నిలుస్తాడు. చక్రవర్తి తన రచనలన్నీ నీలిమకిచ్చి ఆమె అభిప్రాయం అడుగుతాడు రోడ్డు మీద రంగుల బొమ్మలు వేసే రవిని చక్రవర్తి ఆదరించి మంచి సలహా చెప్తాడు చక్రవర్తికి రేఖతో విచిత్రమైన అనుభవం ఎదురవుతుంది. నీలిమ చక్రవర్తి రచనల్ని మెచ్చుకుంటుంది ఇద్దరి మధ్య సాన్నిహిత్యం పెరుగుతుంది

మరునటి రోజు ఆఫీసులో మామూలుగా ప్రవర్తించ సాగారు ప్రభాకర్, రేఖ. తమ మధ్య ఏమీ లేనట్టుగా, ఏమీ జరగనట్టుగా ప్రవర్తిస్తున్న వాళ్ళను చూసి చాలా ఇబ్బందిగా ఫీలయ్యాడు చక్రవర్తి

రాత్రి విషయం గురించి ప్రభాకర్‌ను అడగాలని మనసెంత తొందర చేస్తున్నా అణచుకున్నాడు వాళ్ళ గురించి ఆలోచిస్తూనే తన పని తాను చేసుకు పోసాగాడు చక్రవర్తి

"కవిగారికేదో ఉత్తర మొచ్చింది అంది రేఖ కాస్త గట్టిగా ఉత్తరం చేతో ఎత్తి పట్టుకుని

విసురుగా తన సీటు నుండి లేచాడు చక్రవర్తి. ఉత్తరం అందుకుంటూ రేఖ కళ్ళలోకి సూటిగా చూశాడు. ఏమనుకుందో గాని చటుక్కున కళ్ళు దించుకుంది.

తనకు పరిచయం లేని వ్రాత కావటంతో వెనక్కి తిప్పి చూశాడు ఉత్తరాన్ని. ఫ్రం అడ్రసులేదు.

చించి చదివాడు. రవి దగ్గర నుంచి వచ్చింది అది. 'తాను మద్రాసులో స్థిరపడిన తరువాతే ఉత్తరం రాయాలనుకోవటం వల్ల ఇంత ఆలస్యం అయిందని, ప్రస్తుతం సినీ రంగంలో స్థిరపడ్డానని జీవితం సాఫీగానే సాగుతోందని' వ్రాశాడు రవి.

రవి ఆకారం చక్రవర్తి కళ్ళముందు కదిలింది. అతను అడ్రసు రాయక పోవటంతో మనసులోనే విసుక్కుంటూ ఉత్తరాన్ని డ్రాయరులో పడేశాడు.

మధ్యాహ్నం అయింది. లంచ్ బ్రేక్.

ప్రభాకర్‌తో పాటు బయటికి వచ్చాడు చక్రవర్తి.

"ఇవాళ మెస్‌కు వద్దు హోటలుకు వెళదాం"

"అలాగే" అన్నాడు ప్రభాకర్.

ఇద్దరూ హోటలులోకి ప్రవేశించి కూర్చున్నారు సర్వర్ వచ్చాడు వాళ్ళకు కావలస్నివి చెప్పారు

"రాత్రి నీ రూముకు వచ్చాను ఉండబట్టలేక అన్నాడు

ఆఁహాఁ యధాలాపంగా అన్నాడు ప్రభాకర్

"పన్నెండుకు పైనే వచ్చా" అన్నాడు ప్రభాకర్ ముఖంలోకి చూస్తూ

ముఖం పైకి రాబోయిన నవ్వును అదిమి పట్టాడు ప్రభాకర్ చక్రవర్తి ఆశించిన సమాధానం అతని నుంచి రాలేదు ప్రభాకర్ నిర్లిప్తత మరింత ఆతృత పెంచుతోంది చక్రవర్తిలో

"రేఖ ఎందుకిలా చేస్తోంది" సూటిగా అడిగేశాడు చక్రవర్తి.

రెండు నిముషాలు మాట్లాడలేదు ప్రభాకర్.



## ఆరోహణ

"నీకామె మీద ఏమైనా కోరికా"సందేహంగా అడిగాడు

"ఛ ఛ జుగుప్సగా అన్నాడు చక్రవర్తి

"తనంటే అసహ్యంగా వుందా"

ఔనన్నట్టు తల ఊపాడు చక్రవర్తి

సర్వరు వాళ్ళు చెప్పిన పదార్థాలు తెచ్చి టేబులు మీద పెట్టాడు

"చూడు చక్రవర్తీ అందం లేని కారణంకంటే కట్నం ఇవ్వలేని కారణంగా పెళ్ళి కాక పోయినా బాధ పడటం లేదామె తనవాళ్ళ కోసం తాను నలిగి పోతున్నా చింతించటం లేదు రేఖ రోగిష్టి తల్లి, పెళ్ళి కావలసిన ఇద్దరు చెల్లెళ్ళు, చదువుకుంటున్న తమ్ముడు వీళ్ళందరి బాధ్యతా నవ్వుతూనే మోస్తోంది

ఆగి చక్రవర్తి మొహంలోకి చూశాడు ప్రభాకర్ మౌనంగా వింటున్నాడు చక్రవర్తి

వచ్చే జీతం అందరి అవసరాలకూ చాలక పోవటం వల్ల, వద్దన్నా పై బడిన వయసు కోరికల తీవ్రమైన ఒత్తిడి వల్ల ఇలా చేస్తోంది"

'అర్థమైందా' అన్నట్టు చక్రవర్తి కళ్ళలోకి చూశాడు ప్రభాకర్

అయితే మరి నువ్వు

"అంటే

పెళ్ళి చేసుకోవచ్చు కదా

'నాకు స్త్రీ పట్ల అసహ్యం తప్ప ప్రేమగాని, గౌరవం గాని లేవు సూటిగా, స్పష్టంగా చెప్పాడు ప్రభాకర్

'ఎందుకు' ఆశ్చర్యంగా అడిగాడు చక్రవర్తి

'నా జీవితపు ప్రథమ భాగంలో ఓ స్త్రీ చేసిన గాయం ఇంకా మానలేదు ఆ అవమానపు అగ్ని ఇంకా ఆరలేదు' బరువుగా అన్నాడు ప్రభాకర్ అతని కళ్ళల్లో లీలగా తడి

"ఎవరినైనా ప్రేమించి భంగ పడ్డావా ప్రభాకర్" అనునయంగా అడిగాడు.

"ఔను. అందరికన్నా ఎక్కువగా ప్రేమించాను కాని నా ప్రేమతో అవసరం లేని ఆమె . ఆమె. .. లేచి పోయింది" కన్నీళ్ళు రాలి అన్నంలో పడ్డాయి

"ఎవరామె" గాద్గదికంగా అడిగాడు చక్రవర్తి.

"నా తల్లి"

నిర్ఘాంత పోయాడు చక్రవర్తి ఒక్కక్షణం భూమి కంపించి నట్టయింది అంతటి కఠోర మైన నిజాన్ని అంత నింపాదిగా చెప్పిన ప్రభాకర్‌పట్ల గౌరవం, ప్రేమ, జాలి, దయ ఒక్కసారిగా కలిగాయి పొంగి పొరలుతున్న దుఃఖాన్ని బ్రద్దలౌతున్న అగ్ని పర్వతాన్ని అతను ఎంత బలవంతంగా అదిమి పట్టాడో అర్థమైంది చక్రవర్తికి

"అయాం సారీ ప్రభాకర్" అన్నాడు బాధగా చెయ్యి కడిగేశాడు తినకుండానే

'పరవాలేదు అన్నాడు ప్రభాకర్ కళ్ళు తుడుచుకుంటూ

బిల్లు తీసుకు వచ్చాడు సర్వరు అతనికి డబ్బు ఇచ్చి సిగరెట్ వెలిగించి చక్రవర్తికి ఆఫర్ చేశాడు ప్రభాకర్

"వద్దు మానేశాను

"ఎప్పటి నుంచి"

రాత్రి నుంచి

"మనం ఎన్నిసార్లు మానెయ్యలేదు" అంటూ ప్యాకెట్ ముందుకు తోశాడు ప్రభాకర్

'లేదు నిజంగా మానేశాను

ఆశ్చర్యంగా చక్రవర్తి మొహంలోకి చూశాడు ప్రభాకర్

"ఎందుకని

"మానేశాను అంతే

"మానెయ్యటం మంచిదే చక్రవర్తి కాని దాన్ని అనవసరమైన సెంటిమెంట్సతో 'ముడి పెట్టు కోవ[illegible]ం మంచిది కాదు" అన్నాడు ఏదో గ్రహించిన వాడిలా నవ్వాడు చక్రవర్తి

'చక్రవర్తి నువ్వంటే నాకెందుకో ఇష్టం నీకు కవిగా మంచి భవిష్యత్తు వుందని నా నమ్మకం ఎలాంటి స్థితి ఎదురైనా దాన్ని పాడు చేసుకోకు'

ఆ మాటలు కదిలించాయి చక్రవర్తిని

'ప్రభాకర్ మేమనుకున్న దాని కన్నా చాలా గొప్పవాడివి నువ్వు" అన్నాడు చక్రవర్తి గాద్గదికంగా

కాసేపు అలాగే కూర్చుని ఇద్దరూ లేచారు

* * * * * * * * * * *

ఎంత ప్రయత్నించినా నీలిమకు నిద్ర పట్టటం లేదు విపరీతమైన మానసిక ఘర్షణకు లోనవుతోంది ఆమె చక్రవర్తిని మోసం చేస్తున్నానా, భ్రమల్లో పెడుతున్నానా అనుకుంది

వరండాలో కుర్చీ వేసుకుని కూర్చుంది నీలిమ చల్లని గాలి. వరండాని, పూల మొక్కలని తెల్లగా తడిపేస్తున్న వెన్నెల ఆశల్లా, కోరికల్లా ఆకాశంలో మెరుస్తున్న నక్షత్రాలు ఆ నీరవపు నిశిలో ఆమెలో ఏవేవో ప్రకంపనాలు.

చక్రవర్తి ఆంతర్యం తెలుస్తూనే వుంది తనే బయట పడటం లేదు. నిజం చెప్పేస్తే అనుకుంది తన మనసుని తనే ప్రశ్నించుకుంది తాను చక్రవర్తిని ప్రేమించటం లేదా? కాని ఎలా సంభవం ఇది నిజం చెప్పెయ్యాలి చక్రవర్తికి నిజం చెబితే దూరమౌతాడేమో! అతని సాంగత్యాన్ని తానూ కోరుకొంటోంది అతనితో మాట్లాడాలని, అతన్ని చూడాలని తనకూ వుంది.

నవ్వుకొంది నీలిమ విచిత్రంగా వుంది ఆమె మనసు. ఎందుకిలా జరిగింది? ప్రశ్నించుకుంది సమాధానం లేని ప్రశ్న గాలిని ఎవరాపగలరు? నీటి గమనాన్ని ఎవరు అడ్డుకోగలరు?

"సౌరభము లేల చిమ్ము పుష్ప వ్రజము

చంద్రికల నేల వెదజల్లు చందమామ

ఏల సలిలమ్ము పారు గాడ్పేల విసరు

ఏలనా హృదయమ్ము ప్రేమించు నిన్ను భావ కవితా పితామహుడు కృష్ణశాస్త్రి గుర్తుకు వచ్చాడు చక్రవర్తి ప్రేమలో తన బాధ్యత మరచి పోవటం న్యాయమా? ఎలా చక్రవర్తికి చెప్పటం? కాని చెప్పక తప్పదు ఏదో ఒక రోజు. నిజాన్ని భరించక తప్పదు ఏదో ఒకనాడు

ఆమె కళ్ళు ఆర్ద్రమయ్యాయి ఆ ఘర్షణలో అలాగే నిద్రపోయింది నీలిమ ఆ కుర్చీలో

ఆఫీసుకు బయలుదేరాడు చక్రవర్తి. ఎందుకో ఆఫీసుకు వెళ్ళాలని అనిపించటం లేదు అతనికి నీలిమ దగ్గరికి పరుగెత్తాలని, ఆమె మాటలు వినాలని, ఆమెనే చూస్తూ కూర్చోవాలని అనిపిస్తోంది. ఎంత ఆపినా ఆగని కోరిక

బాధ్యతను కోరిక జయించింది. హృదయ స్పందన ముందు యాంత్రికత ఓడిపోయింది

నీలిమ ఇంటికి బయలుదేరాడు చక్రవర్తి నిశ్శబ్దంగా వుంది నీలిమ ఇల్లు గాలికి పూల చెట్లు తల లూపుతూ స్వాగతం చెప్పాయి చక్రవర్తికి

గేటు తీసి వరండాలోకి వచ్చాడు ఎవ్వరూ లేరు తలుపులు తీసే వున్నాయి 'నీలూ' అని పిలవబోయి ఆగిపోయాడు చుట్టూ చూశాడు లైబ్రరీ గది తలుపులు ఓరగా వేసి వున్నాయి చొరవగా తలుపులు తోశాడు.

పుస్తకాల రాక్‌ల మధ్య కుర్చీలో కళ్ళు మూసుకుని ధ్యాన ముద్రలో వున్న దానిలా కూర్చుని వుంది నీలిమ అప్పుడే స్నానం చేసిందేమో ఆమె శరీర పరిమళం గదంతా నిండి మత్తుగా వుంది వెంట్రుకలు ఆమె నుదురు మీద పడి కదులుతూ, అక్కడి నుంచి వక్షం మీదికి జారి దూకుతున్న నల్లని ప్రవాహంలా వున్నాయి

ఆమె కూర్చున్న భంగిమ ఎంతో ముద్దొచ్చింది చక్రవర్తికి అమాంతం ఆమె ఎర్రని లేత పెదవుల మీద గాఢంగా ముద్దు పెట్టుకోవాలనుకున్నాడు

నీలిమకు దగ్గరగా వెళ్ళాడు చక్రవర్తి ఆమె ముఖంలోకి చూస్తూ అలాగే నిలబడ్డాడు ప్రేమగా ఆమె తల నిమరాలనీ, ఆమె కళ్ళల్లోకి చూస్తూ ఆ కారుణ్యతలో కరిగి నీరవ్వాలనీ, రాగమై భావమై గీతమై ప్రవాహమై ఆమె శరీరకపు టస్మిత్వంలోకి అంతర్ధానం చెంది తనను తాను మరచిపోవాలని అనిపిస్తోంది అతనికి.

నిట్టూరుస్తూ కళ్ళు తెరిచింది నీలిమ. ఎదురుగా తననే సూటిగా చూస్తూ

వున్న చక్రవర్తి ఒక్క క్షణం ఆమె కేమీ అర్థం కాలేదు మరుక్షణం తేరుకుంది

'ఎప్పుడొచ్చారు" అంది స్వప్నం లోంచి పలికినట్లు –

'ఇప్పుడే" అన్నాడు బరువుగా ఊపిరి వదులుతూ మధురమైన కల చెదరిపోయిన వాడిలా

"ఏమిటి అంత దీర్ఘాలోచన" కూర్చుంటూ అడిగాడు.

"ఏదో పుస్తకం గురించి" అబద్ధం ఆడింది

"పుస్తకాలు తప్ప మీకు ఇంకేమీ అక్కర్లేదా '

సూటిగా చూసింది అతని మొహంలోకి ఆ మాట ఆమె హృదయాన్ని తాకి ఎన్నో భావాల్ని కదిపింది

"చక్రవర్తీ కావాలనుకున్నవన్నీ మనిషికి దొరకవు అందుకే అక్షరాల మధ్య అంతర్యాన్ని వెతుక్కుంటాను" అంది బరువుగా

"అందుకోవాలే గాని అందనిది వుండదు నీలిమా '

"లేదు చక్రవర్తీ అందుకోవటానికి ధైర్యం చాలకపోవచ్చు పరిస్థితులు అనుకూలించకపోవచ్చు."

లేచి ఆమె ముఖాన్ని రెండు చేతులలోకి తీసుకుని 'ఎందుకీ బాధ? నీ కోసం నేనున్నా నీలూ' అనాలనిపిస్తోంది చక్రవర్తికి

"మీ కివాళ ఆఫీసు లేదా" వాతావరణం తేలిక చెయ్యాలని అడిగింది నీలిమ

"వెళ్ళలేదు "

"ఎందుకు "

"కొన్ని ప్రశ్నలకు సమాధానాలుండవు '

ఆమె హృదయం లయ తప్పింది కరెంటు పోవటంతో తిరుగుతున్న ఫాను ఆగింది ఉక్కగా అనిపించి కిటికీ తెరవటానికి లేచింది నీలిమ

కిటికీ తెరచి తలుపును వెనక్కి తోసింది కాని బయట గాలి విసురుకి వేగంగా మూసుకుంది కిటికీ తలుపు తలుపు మధ్య నీలిమ వేలు

"అబ్బా" అంది బాధగా

ఒక్క ఉదుటున లేచి ఆమె చేయి బయటికి తీశాడు చక్రవర్తి వేలు కమిలిపోయింది. నెమ్మదిగా చేత్తో ఆ వేలును రాశాడు చేయి అలాగే పట్టుకుని నీలిమ కళ్ళల్లోకి చూశాడు. ఆ కళ్ళల్లో తడి. ఆమె చూపులను తట్టుకునే శక్తి కోల్పోయాడు చక్రవర్తి. అంత సామీప్యంగా నిలబడి ఆమెకేమీ కానట్లు ఉండలేకపోయాడు నిగ్రహాన్ని సడలిస్తున్న స్పర్శ

"నీలూ" అంటూ మరింత దగ్గరకు తీసుకుని ఎదకు హత్తుకున్నాడు అల్లుకు పోయింది అతన్ని చక్రవర్తీ అంటూ.

అగ్నిపర్వతం చల్లబడినంత ప్రశాంత కౌగిలి ఎన్నో రోజులు ఎదురు చూసిన కౌగిలి ప్రపంచపు లాలనంతా నింది, కరుణ రసగంగ పొంగి, ఆశల నింగిని అందుకున్న కౌగిలి అంతులేని శాంతిని ఆ సొంతం చేతుల మధ్య ఇముడ్చుకున్న కౌగిలి భాషకు అందని భావాలను, అక్షరాలు చెప్పలేని అనుభూతులను విడమరచి చెప్పిన కౌగిలి

"నీలూ నీలూ అన్నాడు తమకంగా ఆమెను మరింత హత్తుకుంటూ

స్వప్నం కరిగిపోయి వాస్తవంలోకి వచ్చిన దానిలా అతనీ కౌగిలి మెల్లగా విడిపించుకుంది నీలిమ. ఆమె కళ్ళు వర్షిస్తున్నాయి

"కూర్చో" అంది అతని తల నిమిరి.

ఆమెనే చూస్తూ కూర్చున్నాడు చక్రవర్తి మౌనంగా ఒకరినొకరు చూసుకున్నారు చాలా సేపు ఆ నిశ్శబ్దంలో ఎన్నో నిదురించిన భావ జలపాతాలు

"ఈ రోజు నీకు చాలా చెప్పాలి చక్రవర్తీ నా గురించి ఎన్నో విషయాలు చెప్పాలి' అంది బరువుగా

'చెప్పు' అన్నట్లు చూశాడు చక్రవర్తి

నీలిమ లేచి కళ్ళు తుడుచుకుని ఇంట్లోకి వెళ్ళింది కొద్ది సేపటి తరువాత ఓ వ్యక్తిని వీల్ ఛెయిర్‌లో తోసుకుంటూ చక్రవర్తి వద్దకు తీసుకు వచ్చింది ఆ వ్యక్తికి మోకాళ్ళ దాకా రెండు కాళ్ళూ లేవు సన్నగా పీక్కుపోయి వుంది శరీరం సున్నితంగా వున్న అతని ముఖంలో వేదనా చిహ్నాలు

"ఈయన నా భర్త సుధాకర్" చెప్పింది నీలిమ

అదిరిపడ్డాడు చక్రవర్తి తాను విన్నది నిజమని నమ్మటానికి కొద్ది సేపు పట్టింది. పిడుగు నెత్తిన పడి శరీరాన్ని రెండు ముక్కలుగా కోసేస్తున్నంత బాధ కూర్చున్న చోటే నిలువునా కూరుకుపోతున్న భావన చేయి అందించిన వ్యక్తే అమాంతం అగాధంలోకి తోసేసినంత దుఃఖం చక్రవర్తిలో గుండె వణికి నెత్తురు కళ్ళల్లోకి చిమ్మింది.

నమస్తే ' అన్నాడతను

ప్రతినమస్కారం చెయ్యాలన్న విషయం కూడ మరచిపోయి శిలా ప్రతిమలా వుండిపోయాడు చక్రవర్తి.

నెమ్మదిగా వీల్ ఛెయిర్‌ను ఇంట్లోకి తోసుకుపోయింది నీలిమ. తాను చూసింది నిజమా! అని తల్లడిల్లిపోయాడు చక్రవర్తి

తన ఎదురుగా వచ్చి కూర్చున్న నీలిమను చలన రహితంగా, పిచ్చి వాడిలా చూశాడు చక్రవర్తి.

' చక్రవర్తీ" పిలిచింది గాద్గదికంగా. కదలిక వచ్చింది చక్రవర్తిలో.

"నీలూ నీకు పెళ్ళయిందా" నమ్మ లేనట్లు అడిగాడు

"అయింది చక్రవర్తీ. మూడు సంవత్సరాల క్రితమే అయింది. పెళ్ళయిన సంవత్సరం తరువాత ఒక రోజు తెల్లవారు జామున నెల్లూరు నుంచి వస్తూ వుంటే కారుకు యాక్సిడెంటు అయింది. ఆ యాక్సిడెంటులోనే ఆయన రెండు కాళ్ళూ పోయాయి' ఆగింది నీలిమ.

ఆమెనే చూస్తున్నాడు చక్రవర్తి.

"ఆయన చాలా సహృదయుడు చక్రవర్తీ. యాక్సిడెంటు తరువాత తనకు విడాకు లివ్వమని, నాకు నచ్చిన వ్యక్తిని పెళ్ళి చేసుకొమ్మని ఎన్నో సార్లు చెప్పారు కాని నా మనసే అంగీకరించలేదు శారీరకంగాను, మానసికంగాను దెబ్బతిన్న ఆయనను వదలి వెళ్ళటం రాక్షసత్వం అనిపించింది. మనసు ఒప్పుకోలేదు ఇలాగే గడిచింది రెండేళ్ళ కాలం. ఆ రెండేళ్ళూ నాకు పుస్తకాలే అన్నీ."

చక్రవర్తి ముఖంలోకి చూసింది నీలిమ, ఏ క్షణం అయినా బాధను ఆపుకో లేక బిగ్గరగా ఏడ్చేలా వున్నాడు.

"ఆ తరువాత చిత్రంగా నువ్వు నా జీవితంలోకి ప్రవేశించావు. మొదట మామూలు పరిచయమే అనుకున్నాను. కాని క్రమంగా మనసు నీ పట్ల ఆకర్షింపబడింది హృదయం నీ పట్ల తొణికింది. ఇరిగిందేమిటో తెలిసేటప్పటికే నీ పట్ల అనురాగం పెన వేసుకుంది "

నీలిమ కళ్ళ నుంచి కన్నీరు రాలుతోంది.

"నీకు దగ్గర కాలేక, అశక్తుడుగా వున్న ఆయనను దూరం చేసుకోలేక నాలో నేనే నరకాన్ని అనుభవించాను. ఆయనకు అన్యాయం చేస్తున్నా నన్న బాధ నీకు నిజాన్ని చెప్పటానికి భయం."

"నీలూ" పిలిచాడు చక్రవర్తి తల ఎత్తి అతని కళ్ళల్లోకి చూసింది.

"నీ గతం నాకవసరం లేదు నాక్కావలసింది నీతో ముడిపడిన భవిష్యత్తు" అన్నాడు స్థిరంగ, నిజాయితీగ చక్రవర్తి

హృదయాన్ని రెండు వస్తువుల మధ్య పెట్టి కర్కశంగా నొక్కేస్తున్నంత బాధ విపరీతమైన మంచితనాన్ని కూడ భరించటం కష్టం ఎలా సమాధానం



## ఆరోహణ

చెప్పాలి అతనికి కాని చెప్పక తప్పదు కదా

"అదే సాధ్యం కాదు చక్రవర్తీ ఆయనలోని మంచితనం, సహృదయం కట్టి పడేస్తోంది నన్ను నీ విషయమూ ఆయనకు తెలుసు కాని ఎవ్వరూ లేని ఆయనను నిర్లక్ష్యంగా వదలి రావటానికి నా మనసే అంగీకరించటం లేదు.'

ఆమె ముఖంలోకి చూశాడు చక్రవర్తి

"నీలూ మరి ఇవన్నీ మొదటే నాకెందుకు చెప్పలేదు. నీ పట్ల ఇన్ని ఆశలు పెంచుకున్న తర్వాత, నీవే ప్రపంచం అనుకున్న తర్వాత, నీ సామీప్యంలో మనిషిగా ఎదగాలనుకున్న తర్వాత ఇప్పుడా ఇప్పుడా ఈ విషయం చెప్పేది" అతని కళ్ళల్లోనూ అశ్రువులు

ప్రతిసారీ చెప్పాలని ప్రయత్నం. కాని చెప్పలేని బలహీనత ఇలాంటి రోజు వస్తుందని తెలిసీ నన్ను నేను మభ్య పెట్టుకున్నాను చక్రవర్తీ" వెక్కి వెక్కి ఏడవసాగింది నీలిమ

లేచి నీలిమ దగ్గరకు వచ్చాడు చక్రవర్తి ఆమె కన్నీరు తుడిచాడు ఆ చేతిని అలాగే పట్టుకుంది నీలిమ

నీలూ' అన్నాడు ఆర్ద్రంగా

అతని కళ్ళల్లోకి చూసింది నీలిమ ఎంతో ఇష్టపడిన బొమ్మ కళ్ళ ఎదురుగానే పగిలిపోయినపుడు తపించే పసిపాపలా వున్నాడు

చక్రవర్తీ కవిగా నీకెంతో భవిష్యత్తు వుంది నా వల్ల దాన్ని పాడు చేసుకోనని మాటివ్వు" అంది చేయి సాచి

'భవిష్యత్తే నువ్వయినపుడు ఇంకా ఏం మిగిలింది నీలూ

కాదు చక్రవర్తీ కాదు తాత్కాలికమైన సుఖాల కోసం, బలహీనతల కోసం శాశ్వతమైన కీర్తిని దూరం చేసుకోవద్దు ఎంతో ఎదగాలి చక్రవర్తీ నువ్వు ఎదిగిపోతున్న నిన్ను చూసి ఎదనిండా ఆనందం నింపుకోవాలి నేను ఏదీ మాటివ్వు

ఆమె కళ్ళల్లోకి చూసి ఆమె చేతితో చేయి కలిపాడు రెండు చేతులు కలిశాయి ఉద్రేకం లేని చేతుల స్పర్శ, ఆవేశం లేని అనురాగం.

కలసిన ఆ చేతుల మీద పడుతున్న నీలిమ కన్నీటి ధార

'నీలూ చేతులు కలిపి విడి పొమ్మంటున్నావ్ మనసులు తెలిసిం తర్వాత మరచి పొమ్మంటున్నావు

' చక్రవర్తీ కట్టలు తెగింది ఆమె దుఃఖం

అలా ఎంత సేపు గడిచిందో వాళ్ళకు తెలీదు ముందుగా నీలిమే తేరుకుంది ప్రేమగా చక్రవర్తి తల నిమిరి కూర్చో పెట్టింది

' చక్రవర్తీ ఇంకెప్పుడూ ఈ ఇంటికి రాకు" నరాలు తెగిపోయాయి ఆమెకు ఆ మాటలు చెప్పటానికి

నీలూ "



'ఔను చక్రవర్తీ! ఎంత అనురాగం వున్నా ఇన్నాళ్ళూ అది మనసులోనే దాచుకున్నాం ఈ రోజు ఇద్దరం బయట పడ్డాం నువ్వు ఇంకా ఇంటికి వస్తూ వుంటే ఏ బలహీన క్షణంలో నేను నీ వెంట వచ్చేస్తానో నా వల్ల ఓ కాళ్ళు లేని వ్యక్తి ఏకాకిగా ఏడుస్తూ బ్రతకటం నేను భరించలేను అందుకే"

"ఆ శిక్ష నాకు వేస్తున్నావా నీలూ."

"నన్ను నేనే శిక్షించుకుంటున్నాను చక్రవర్తీ "

ఇద్దరూ మౌనంగా ఒకరినొకరు చూసుకున్నారు మరికొంత సమయం గడిచింది.

మెల్లగా లేచాడు చక్రవర్తి వెళ్ళటానికి

"కోపంగా వుందా నా మీద

"లేదు నీలూ బాధగా వుంది ఇక నిన్ను చూడలేనే అని "

కదిలాడు అతనికి దగ్గరిగా వచ్చింది నీలిమ. అతని చేతిని తన చేతిలోకి తీసుకుంది.

"ఈ బాధ ఇక్కడే వదిలెయ్యి చక్రవర్తీ నీ లక్ష్యం వేరు నీ గమ్యం వేరు ఇక నుంచి అక్షరాలు, ఆలోచనలు అన్నీ నువ్వే అయి కనిపించాలి నాకు "

అతని చేతిని నెమ్మదిగా పెదవులతో స్పృశించింది.

ఒక్క జ్ఞాపకం చాలు వంద సంవత్సరాలకి.

వెనక్కి తిరిగి తిరిగి చూస్తూ వెళ్ళిపోయాడు చక్రవర్తి అతను కనిపించేంత వరకు అలాగే చూస్తూ నిలబడింది నీలిమ.

రూముకు వచ్చి గుండె అవిసి పోయేలా ఏడ్చాడు చక్రవర్తి. శరీరంలోని నీరంతా కారిపోయేలా ఏడ్చాడు. జరిగినదంతా కల అయితే ఎంత బావుండు అనుకున్నాడు అంతా తానే అనుకున్న మనిషి హఠాత్తుగా తనకు కాకుండా పోయిందే అన్న బాధ భరించ లేకపోతున్నాడు. జీవితానికి తోడుగా నిలుస్తుందని, ఇన్నేళ్ళ ఒంటరితనాన్ని పోగొట్టి తన అక్షరాలకు భావమై, రాగానికి గీతమై నిలుస్తుందనుకున్న మనిషి ఒక్క రోజులో దూరం అవుతుందని ఊహించలేదు చక్రవర్తి

మనసును ముక్కలు ముక్కలు చేసినంత బాధ. నీలిమను చూడకుండా, ఆమె ఇంటికి వెళ్ళకుండా వుండగలడా అనుక్షణం ఆమె మాటలు, ఆమెతో గడిపిన సమయాలు జ్ఞాపకం వస్తుంటే నిగ్రహించుకోగలడా? లేదు సాధ్యం కాదు ఆ బలీయమైన ఆకర్షణ నుండి తాను తప్పించుకోలేడు అక్షరాలు దిద్దించిన గురువులా ఎన్ని నేర్పింది. ఎంత నేర్చుకున్నాడు ఆమె నుంచి

తనలోని సృజనాత్మకతకు ఊపిరై నిలిచిన ఆమెను, తలపుల తపనకు ఆకారమైన ఆమెను, నిరాసక్తంగా నిరాశలో తాను పడిపోతున్నపుడు వెన్ను తట్టి ధైర్యం చెప్పిన ఆమెను, తన మీద తనకు ఎంతో నమ్మకాన్ని పెంచిన ఆమెను, ఎంతో మానసిక బలాన్నిచ్చిన నీలిమను తాను మరచిపోగలడా?

తల పగిలి పోతూ వుంది చక్రవర్తికి అందరి మీద తెలియని కసి, కోపం కలుగుతోంది.

ఇంటికి కూడా రావద్దని ఎంత నిర్దయగా, ఎంత కఠినంగా చెప్పింది నీలిమ మళ్ళీ దుఃఖం తన్నుకు వచ్చింది చక్రవర్తికి ఏమీ చేయలేని అసహాయ స్థితి

తనిక ఆ ఊరిలో వుండలేను అనుకున్నాడు చక్రవర్తి అనుక్షణం ఆమె జ్ఞాపకాలు బాధ పెడుతూ వుంటే ఎలా ఉండగలడు. ఒకే ఊరిలో వుంటూ ఆమెను చూడకుండా ఎలా 'వెళ్ళిపోవాలి ఎక్కడికైనా' అనుకున్నాడు. కాని ఎక్కడికని, ఏ వూరని వెళ్ళటం ఎవరున్నారు తనకు

'ఎవరూలేని వ్యక్తికి ఏ వూరైతేనేం' అంత బాధలోనూ నవ్వు వచ్చింది తానిక ఎక్కడికి వెళ్ళినా ఒక్కటే తిరుపతి కానప్పుడు ఏ వూరైతేనేం. వెళ్ళిపోవాలి. దూరంగా వెళ్ళిపోవాలి ఆమె జ్ఞాపకాలు కూడ తనను చేరుకోనంత దూరం వెళ్ళిపోవాలి

ఆ బాధలో, ఆలోచనలో చీకటి పడటం కూడ గమనించలేదు చక్రవర్తి అలా ఎంత సేపు కూర్చున్నాడో అతనికే తెలీదు దుఃఖపు తీవ్రత తగ్గి మెల్ల మెల్లగా నిర్లిప్తత చోటు చేసుకోసాగింది చక్రవర్తిలో

తలుపుతీసిన చప్పుడుకు ఉలిక్కిపడ్డాడు చక్రవర్తి. ప్రభాకర్ లోపలికి అడుగు పెట్టాడు గదంతా చీకటి

"చీకట్లో కూర్చున్నావేం'

అప్పుడు గమనించాడు చక్రవర్తి చీకటిపడి చాలా సేపు అయిందని.

"వెలుగంటే భయమేసి.'

లైటువేసి చక్రవర్తికేసి చూశాడు ప్రభాకర్. మొహం ఉబ్బి కళ్ళు ఎర్రగా వున్నాయి తలంతా రేగి పోయివుంది.

"ఆరోగ్యం బాగలేదా"

"బావుంది కానీ" ఆగిపోయాడు చక్రవర్తి. తగ్గుతున్న దుఃఖం ప్రభాకర్‌ను చూడగానే మళ్ళీ సుళ్ళు తిరుగుతోంది. కారబోయే కన్నీటిని బలవంతంగా ఆపుకున్నాడు చక్రవర్తి.

ఏదో జరిగిందన్న విషయం గ్రహించాడు ప్రభాకర్, చక్రవర్తిని చూస్తూనే.

సిగరెట్టు వెలిగించాడు ప్రభాకర్. ఆ సిగరెట్టుపెట్టి చేతిలోకి తీసుకున్నాడు చక్రవర్తి

'నమ్మమంటారా' అన్న నీలిమ రూపం కళ్ళముందు కదిలింది

కసిగా వెలిగించాడు సిగరెట్

"ఆఫీసుకు రాలేదేం" చక్రవర్తిని మాటల్లోకి దించాలని అడిగాడు

"ఇక ఎన్నడూ రానేమో."

"ఎందుకు" సూటిగా చూస్తూ ఆందోళనగా అడిగాడు

చక్రవర్తి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి ప్రభాకర్ లేచి చక్రవర్తి ప్రక్కన కూర్చున్నాడు.

"ఏం జరిగింది చక్రవర్తీ" భుజం మీద చేయివేసి లాలనగా అడిగాడు

అంతవరకు బలవంతంగా అదిమి పెట్టిన దుఃఖాన్ని ఇక ఆపుకోలేకపోయాడు చక్రవర్తి. ప్రభాకర్ చేతుల్లో మొహం దాచుకుని వెక్కి వెక్కి ఏడ్చాడు లాలనగా అతని వీపు నిమిరాడు ప్రభాకర్

నీలిమకు తనకు పరిచయం అయిన దగ్గర నుండి ఆ రోజు వరకు జరిగిన అన్ని విషయాలు చెప్పాడు చక్రవర్తి మౌనంగా విన్నాడు ప్రభాకర్.

ఆనందాన్ని విషాదాన్ని ఏ మనిషీ దాచుకోలేడు ఒక్కడే అనుభవించలేడు ఆత్మీయులతో పంచుకోవాలన్న తపన వేధిస్తుంది అతన్ని అలా ఒక్కడే ఏకాంతంగా అనుభవించాల్సిన స్థితి ఏర్పడిన మనిషి తాత్వికుడైనా అవుతాడు లేదా ఏ విలువలూ పాటించని అరాచకవాది అయినా అవుతాడు అంతా విని నిట్టూర్చాడు ప్రభాకర్.

"లే లేచి మొహం కడుక్కో"

హృదయంలోని బాధ కాస్త తగ్గటంవల్ల లేచి మొహం కడుక్కుని వచ్చాడు చక్రవర్తి

"పద బయటికెళదాం" బలవంతంగా లేవదీశాడు చక్రవర్తిని.

బజారు వీధిలోకి వచ్చారు ఇద్దరూ ఓ టీ బంకు దగ్గర ఆపాడు ప్రభాకర్. "టీ" గ్లాసు చక్రవర్తికి అందించాడు

"వద్దు"

"ఏమిటిది చక్రవర్తీ తీసుకో ప్లీజ్."

టీ తాగి ఇద్దరూ యూనివర్శిటీ వైపు కదిలారు యూనివర్శిటీలోని విశాలమైన మైదానంలో కూర్చున్నారు అప్పటికే రాత్రి చాలా గడిచింది చల్లగా వీస్తున్న గాలి శబ్దం. గాలికి కదులుతున్న చెట్ల ఆకుల శబ్దం.

దూరంగా కొండమీద వెలుగుతున్న దీపాలను చూస్తూ సిగరెట్ వెలిగించుకున్నాడు చక్రవర్తి. చాలాసేపు ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు

"ఇక ఇక్కడ వుండలేను ప్రభాకర్, వెళ్ళిపోతాను ఎక్కడికైనా" నిశ్శబ్దాన్ని భగ్నం చేస్తూ చెప్పాడు చక్రవర్తి

"చిన్న పిల్లవాడిలా ఏమిటిది. అనుకున్నది జరిగినంత మాత్రాన మరీ అంత నిరాశపడితే ఎలా"

"నాకంతా శూన్యంగా అనిపిస్తుంది."

"చక్రవర్తీ పరిస్థితిని ధైర్యంగా ఎదుర్కోవాలి బాధ కలిగినప్పుడు తట్టుకుని నిలబడితేనే ఏదైనా సాధించగలిగేది "

"ఏమీ సాధించ లేనేమో అనిపిస్తుంది ప్రభాకర్" నిరాశగా అన్నాడు

"ఎందుకంత నిరాశ. మనం అనుకున్నట్లే జీవితం సాగితే అందులో కూడ ఏమీ వుండదు అయినా చక్రవర్తీ నువ్వేదో సాధిస్తావని మేమంతా నమ్ముతూ

## మాతృ ప్రేమ

మధురాతి మధురమ్ము
మాతృ ప్రేమమ్ము
మాతృ ప్రేమను మించు
మహిమలేదవని!

కన్న దాదిగ ఎంతో
కష్టించి పెంచు
కన్నులకు రెప్పవలె
కాచి రక్షించు!

మంచి చెడుగులు తెలిపి
మనిషిగా తీర్చు
పెంచి పెద్దను చేసి
ప్రేమించ నేర్పు!

త్యాగమయి మాత, అను
రాగమయి మాత
రూపు దాల్చిన ప్రేమ
ప్రాపు బిడ్డలకు!

–మేకా సుధాకరరావు

## ఆరోహణ

వుంటే ఇంత దీలా పడిపోతున్నావేం

జీవితంలో ప్రేమ ఒక భాగం అదే జీవితంకాదు" బోధిస్తున్న వాడిలా అన్నాడు ప్రభాకర్

"ఆమె ఇలా అంటుందని అనుకోలేదు"

ఆమెను గూర్చి పూర్తిగా తెలుసుకోకుండా ఆశలు పెంచుకోవటం నీ తప్పే "

'నిజమే ఆమె సామీప్యంలో నన్ను నేనే మరచిపోయాను"

"నీ ఊహలు ఆలోచనలు అన్నీ రచనల మీదే కేంద్రీకరించు చక్రవర్తీ ప్రతి అనుభవాన్ని వ్రాయటానికి ప్రయత్నించు చాలా సాధిస్తావు' భుజం తడుతూ అన్నాడు

ఇక నాకు మిగిలింది అదే. అక్షర శిల్పాలు చెక్కుకుంటూ, కన్నీటిని కవిత్వంగా వ్రాసుకుంటూ వెళ్ళిపోతాను"

ఎక్కడికని వెళతావు" ఎంత చెప్పినా వినటంలేదే అన్న బాధతో అడిగాడు ప్రభాకర్

"ఎక్కడికో ఇక్కడ మాత్రం వుండలేను ఇక్కడ వుండే కొద్దీ ఆమె జ్ఞాపకాలు నన్ను మరింత బాధపెడతాయి '

ఇక్కడనుంచి వెళ్ళిపోయినంత మాత్రాన మరచిపోగలవా'

ప్రభాకర్ కళ్ళల్లోకి చూశాడు చక్రవర్తి ఆ మాటలు అతని హృదయాన్ని బలంగా తాకాయి

"మరచిపోవటానికి అవకాశం దొరుకుతుంది '

ఏమీ మాట్లాడలేదు ప్రభాకర్ చక్రవర్తికి ఎలా నచ్చ చెప్పాలో అర్థంకాలేదతనికి

ఎక్కడికని వెళతావు"

"ఏమో నాకే తెలీదు"

నిట్టూర్చాడు ప్రభాకర్.

'మార్పువల్ల మంచే జరిగితే అంతకంటే ఏం కావాలి కాని బాగా ఆలోచించుకో చక్రవర్తీ

మధ్య రాత్రి దాటి పోవటంతో ఇద్దరూ లేచి గదికి వచ్చారు ప్రేమగా తన గదినంతా కలయ చూసుకున్నాడు చక్రవర్తి అక్కడే ఎన్నో రాత్రులు మేలుకుని ఎన్నో రచనలు చేశాడు అక్కడే ఎన్నో కలలు కన్నాడు, ఎన్నో ఊహలు అల్లుకున్నాడు

చక్రవర్తి దృష్టి బోధివృక్షం క్రింద కూర్చుని వున్న బుద్ధుని చిత్రం మీదపడింది వెంటనే ఆ చిత్రాన్ని వేసిన రవి గుర్తుకు వచ్చాడు జీవితం పట్ల ఎంత ధైర్యంగా నమ్మకంగా నడిచి వెళ్ళాడు రవి రవితో పాటు మద్రాసు గుర్తుకు వచ్చింది చక్రవర్తికి

మద్రాసు వెళ్తాను ప్రభాకర్ పరిష్కారం దొరికిన వాడిలా అన్నాడు

మద్రాసా' ఏం చేస్తావు అక్కడికెళ్ళి? ఎలా బ్రతకుతావు"

'ఆ మహానగరంలో నేనొక్కడినీ బ్రతకలేనా

బ్రతకలేవనికాదు దానికి ఓ మార్గం కావాలిగా'

ఆలోచనలో పడ్డాడు చక్రవర్తి 'భవిష్యత్తు పాడుచేసుకోకు' అన్న నీలిమ రూపం కళ్ళముందు

'పోనీ సినిమా రంగంలో ప్రయత్నించు అన్నాడు ప్రభాకర్

సినిమా రంగంలోనా' ఆశ్చర్యంగా అడిగాడు

ఔను ఏం

అందులో పైకి రావటం కష్టం అంటారే

'కష్టపడి పైకొస్తేనే ఆనందం పైగా ఆ రంగంలో వచ్చినంత కీర్తి, డబ్బు మరెక్కడా రావు

చూశావా మార్గం దొరుకుతోంది అన్నాడు ఆలోచిస్తూ చక్రవర్తి ప్రబాకర్ కూడా ఆలోచనలో పడ్డాడు

చక్రవర్తి కనుమరుగు కాగానే పుస్తకాల గదిలోకి వెళ్ళి వెక్కి వెక్కి ఏడ్చింది నీలిమ తప్పంతా తనదేనేమో' తానే చక్రవర్తికి ఆశలు కల్పించానేమో అనుకుంది చక్రవర్తి తనను ఇష్టపడుతున్నాడని తెలిసిన రోజునే నిజం చెప్పి వుంటే, అతని ఆశను ఆ రోజే కాదని వుంటే ఈ రోజు ఇంత బాధ వుండేదికాదు

గదిలోని పుస్తకాలన్నీ పరిశీలించింది 'చీకటి గదులు. పుస్తకం కనిపించింది చక్రవర్తి తెచ్చి ఇచ్చిన పుస్తకం అది ఆ పుస్తకాన్ని చేతో తడిమి నిట్టూర్చింది

తన భర్త పట్ల తనకు ఉన్నది ప్రేమా? లేక అసహాయస్థితిలో వున్నాడన్న జాలా? ప్రశ్నించుకుంది నీలిమ సమాధానం ఆమెకే తెలియటంలేదు భర్తలో వున్న మంచితనానికే కట్టుబడిందేమో అతని నుండి ఆ అనురాగం లేకపోతే చక్రవర్తిని అంగీకరించ గలిగేదేమో ఆమె మనసు ఆమెకే తెలియటంలేదు

చక్రవర్తి దగ్గరికి పరుగెత్తి వెళ్ళి పోవాలని వుంది దీనంగా పడివున్న భర్తను ఆదుకోవాలని వుంది ఈ ప్రపంచంలో ఏది నీతి, ఏది అవినీతి, ఏది న్యాయం, ఏది అన్యాయం సమాధానంలేని ప్రశ్నలు మనసుని చిత్రవధ చేస్తున్నాయి

చక్రవర్తి ఇక ఈ ఇంటికి రాడా రావాలని వుంది. వచ్చి మాట్లాడాలని వుంది అంత కఠినంగా తాను రావద్దని చెప్పింతర్వాత ఎలా వస్తాడు వస్తే తను నిగ్రహంగా వుండగలదా

నీలిమ కళ్ళు వర్షిస్తున్నాయి ఆమెకు తెలియకుండానే చక్రవర్తిని తాను శారీరకంగా వాంఛిస్తోందా? అలలా లేచిన ప్రశ్న కాదు కాదు కాదు ఖచ్చితంగా వచ్చింది సమాధానం హృదయపు అట్టడుగు పొరల్లోంచి శారీరకమైన కోరికే అయితే దానికి చక్రవర్తే కావాలనిలేదు పురుషుడైతే చాలు మనసుని స్పృశించాడు చక్రవర్తి సున్నితపు భావాల్ని, భావుకతను తట్టిలేపాడు చక్రవర్తి ఆ లాలనే ఆ సాన్నిహిత్యమే, ఆ స్నేహమే తాను కోరింది అంతే

సముద్రపు తుఫానులా అల్ల కల్లోల మౌతున్న మనసుతో కదిలింది నీలిమ

ఆ రాత్రి రెండు హృదయాలలో మౌన ప్రళయఘోష పరిస్థితుల ఝంఝా మారుతానికి అల్లల్లాడి పోయాయి రెండు జీవితపు చిగురుటాకులు అందీ అందని ఆశలు అల్లకల్లోలం చేస్తే, అంతులేని విషాద సాగరంలో దూర దూరంగా దరిలేని ఇద్దరు (ఇంకా ఉంది)



సీక్రెట్ ఏజెంట్
విక్రమ్
మోహన్ * దిలీప్ కదమ్
18




విక్రమ్ ఆ గదిలోకి పరుగెత్తుకుంటూ జనరేటర్ వద్దకి వెళ్లేసరికి ఒక కాపలాదారు దాన్ని అప్పుడే తిప్పబోతున్నాడు.




వెనుక నుంచి బలంగా పడిన దెబ్బకి వాడు వెల్లకిలా పడిపోయాడు.
31/18




విక్రమ్ జనరేటర్‌ల నించి ఫ్యూజ్ తీసేశాడు.




వెనక్కి తిరిగివస్తూ కొన్ని చేతి బాంబులు తీసుకున్నాడు.
ఇవి ఎందుకైనా పనికొస్తాయి.




లెఫ్టినెంట్ ఇలారా– నీ దుస్తులు చింపేసుకో.
అలాగే సర్!




సిద్ధంగా ఉన్నానండీ!
లెఫ్టినెంట్! నిజంగా నాకు చాలా విచారంగా ఉంది.




లెఫ్టినెంట్ స్పృహ తప్పి పడిపోయాక, విక్రమ్, ప్రొఫెసర్ ఇనుప కటకటాల ద్వారం దగ్గరికి చేరారు.
ఇక్కడే ఉండండి




కునికిపాట్లు పడుతున్న సైనికుడికి మారుమాట్లాడే అవకాశం దొరకలేదు.
C RANG REKHA FEATURES PVT. LTD/1984




ఒకసారి బైట పడగానే, వాళ్లు ప్రధాన ద్వారం వేపు కారును దూకించారు.
(ఇంకా ఉంది)

# ప్రశ్నవళి



-కె.రామలక్ష్మి

**ఎమ్. ఎస్. ఆర్. కోట.**

★ స్త్రీకి తాళి కట్టిన భర్త గొప్పా? మనసిచ్చి పుచ్చుకున్న వ్యక్తి గొప్పా!

● రెండూ ఒకరైతే- సవ్యంగా సాగుతుంది సంసారం

**టి. జి. కె. పొందూరు.**

★ జీవితంలో ఆడ స్నేహితులు మంచిదా? మగ స్నేహితులు మంచిదా?

● స్నేహానికి లింగ బేధం లేదు. మనస్తత్వానికి ఉందొచ్చు అంచేత 'అవసర స్నేహం' కానంత వరకు ఏదైనా మంచిదే.

★ మధుర స్వప్నం అంటే ఏమిటి?

● పెళ్ళికి ముందు అబ్బాయిలూ, అమ్మాయిలూ వూహించుకునే- ఊహలు, పగటి కలలు

**ఎన్ ఎస్. బి, కోటబొమ్మాళి.**

★ కొంతమంది పల్లెటూళ్ళు అంటే యిష్టపడరు మరి ఆ పల్లెటూరిలో పండే పంటలేకదా- యిష్ట పడేది?

● పల్లె జీవితం- ఊహించుకున్నట్టు వుండక- తికమక పడతారు కాని పల్లె రైతు మట్టిలో చేయి పెడితేనే- పట్నంలో వాళ్ళ నోట్లోకి చేయిపోయేదని- తెలియని వాళ్ళు- అరుదు

★ అంటరానితనం మహా పాపం అంటారు మరి యీ రిజర్వేషన్లు దేనికి?

● పాపం వేరు రాజకీయాలు వేరు

**హెచ్. ఆర్. ఆర్, విశాఖపట్నం.**

★ మనిషి తెలివి ఎలా బయటపడుతుంది?

● సర్వ సాధారణంగా అతని నోరే అతని తెలివిని బయట పడేస్తుంది!

**ఎస్. ఆర్. పిట్టలవేమవరం.**

★ పచ్చని ప్రకృతి మీద పాట రాయడానికి ఫైవ్‌స్టార్ హొటల్ ఎన్నుకుంటారెందుకు మన సినీ కవులు?

● నాకూ తెలియదయ్యా! దీన్లోని ఆంతర్యం ఎవరేనా సినీ జర్నలిస్టునడిగి చూడు- తెలుసుకు చెప్తారు!

★ క్షీణించి పోతున్న మానవత్వపు విలువలని పునరుద్ధరించడానికి నేటి యువకులు ఏం చెయ్యాలి!

● వాటిని తామనుసరించడం ఉత్తమ పద్ధతి అనుసరించమని ఉద్బోధించడం నాయకుల పద్ధతి

**ఎస్. కె. ఎమ్. చింతలపూడి.**

★ ఆరుద్రగారితో మీ వివాహం జరిగిందని విన్నాను ఇది ఎంత వరకు నిజమో తెలుపగలరు

● రిజిస్ట్రారు సాక్షిగా నిజం!

**ఎన్. వి. కె. ఆర్. విజయవాడ.**

★ కొందరు అందర్నీ ఆట పట్టిస్తారు కాని తమదాకా వచ్చేసరికి ఉడుక్కుంటారెందుకు?

● సహజం కదా? అందర్నీ ఫూల్ చేసే వాడిని నువ్వూ ఒకడివంటే ఉడుకుమోత్తనం రాదా మీరే చెప్పండి?!

**ఎస్. ఎస్. బొబ్బిలి**

★ సమాజాన్ని ముందుకు నడిపించడానికి కావలసిందేమిటి?

● దానిమీద గౌరవం! ఎవరికి వారు మన్నెవరు చూడవచ్చారులే! అనుకునే తత్వానికి స్వస్తి చెప్పడం

★ ప్రేమ వివాహాలు చేసుకున్న తల్లి తండ్రులే తమ పిల్లల ప్రేమ ఒప్పుకోరెందుకు?

● ఈ రోజుల్లో – ముందుప్రేమించేసి బేరానికి తల్లితండ్రులని ముందుకు తోస్తున్నారు అబ్బాయిలు – అందుకని

**ఎస్. ఎస్. పి. ప్రొద్దుటూరు**

★ మనిషి పుడుతూ ఏడుస్తాడెందుకు?

● ఏడవడం ప్రాణం వున్నట్టు నిదర్శన- పుట్టినప్పుడు!

★ ఒక అమ్మాయి అబ్బాయి ప్రేమించి పెళ్లి చేసుకున్నారు అనుకోండి వారి పిల్లలు ఏ కులంవాడిని ప్రేమించాలి?

● ఏం తల్లి తండ్రీ కులం గోత్రం చూసే ప్రేమించుకున్నారా?! అలాగే వాళ్ళూను!

**వి. జి. జగిత్యాల**

★ బూడిద పూసుకున్నంతమాత్రాన సన్యాసి అవుతాడా?

● అవడు సెంటు పూసుకున్నవాడల్లా- సంసారీ కాడు

**ఎన్ యు. పి. కపిళేశ్వరపురం**

★ ప్రేమ,మనసు, మమత వీటికి పూర్తి అర్థాలు నిర్వచనం తెలుపండి

● బ్రౌన్ తెలుగు నిఘంటువు చూసి ఇంగ్లీషు అర్థాలు – అవి పట్టుకుని శంకర్ నారాయణలో తెలుగు అర్థాలు రాసుకోండి అదే రిసెర్చి అంటే!!

**కె. బి. ఆర్ టాటానగరం**

★ మనసుకు శాంతి ఎలా లభిస్తుంది?

● 'నువ్వి అంటే నాకోటి' అనుకోకుండా వుండటం – ఒక్కటే దారి

**వి. వి. సికింద్రాబాదు**

★ చెప్పింది చెయ్య బుద్ధి కాదెందుకు?

● ఒక వయస్సులో – అంతే చేయకూడనిది చేస్తే – వినకూడనివి వింటాం అన్న జ్ఞానోదయం తరవాతే కల్గుతుంది

**కె. కె. ఆర్. కోట బొమ్మాళి**

★ నేను ప్రేమించి . పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాను మీ అభిప్రాయం?

● ప్రేమనీది పెళ్లి నీది – మధ్యన నా అభిప్రాయం దేనికి కనకరాజూ?!

★ నేటి సమాజంలో స్నేహానికి విలువా? ప్రేమకు విలువా?

● రెండిటికీ లేదు – అన్నిటి విలువా ఇప్పుడు డబ్బుదే

★ నేటి నిరుద్యోగులపై మీ అభిప్రాయం?

● అటు ప్రభుత్వం – ఇటు వ్యక్తులు ఏదో చేస్తారని కాకుండా – స్వంతంగా ఏదైనా చేయడానికి ప్రయత్నించడం ముఖ్యం ప్రభుత్వాలూ వ్యక్తులూ కూడా పబ్బం గడుపుకొని కాలం కరిగిస్తాయి గాని నిరుద్యోగ ఓటర్ల కోసం వాగ్దానాలే చేస్తాయి

**ఎన్ కె ఆర్. పర్లాకిమిడి**

★ మానవునిలో క్షమాగుణం ఎప్పుడు జనిస్తుంది!

● తాను హింసకు గురి అయినప్పుడు! □



# భారతి

సాహిత్యాభిమానులకు ★ చక్కటి అవకాశం!

## చందాదారుగా చేరండి!

## ఆదా చేయండి రు 11 దాకా!

ఏజంటు ద్వారా భారతి సంవత్సరం చందా రు. 48.

పోస్టు ద్వారా అయితే భారతి సంవత్సరం చందా రు. 51.

కాని మీరు రు 40 ముందుగా ఒకేసారి చెల్లిస్తే మీకు ఒక సంవత్సరం పాటు భారతి అందుతుంది!

★ అంటే రు. 11 దాకా ఆదా చేసుకో వచ్చునన్న మాట!

రు. 40 చందా మొత్తాన్ని "ఆంధ్రపత్రిక" (గాంధీనగర్, విజయవాడ)కి మని ఆర్డరు ద్వారాగాని, డిమాండు డ్రాఫ్టు ద్వారాగాని పంప ప్రార్థన. ఏజెంటుకి గాని ఇతరులకి గాని చెల్లించ వద్దని మనవి.

ఈ క్రింది కూపనుని నింపి డిమాండు డ్రాఫ్టుతో గాని, మనీ ఆర్డరుతో గాని జతపరచి పంపాలని మనవి.

★ మీరు ఉన్నచోట ఏజెంటు ఉంటే ఏజెంటు ద్వారా భారతి సరఫరా చెయ్యబడు తుంది.

★ ఏజంటు లేకపోతే భారతి మీకు పోస్టులో అందుతుంది!

★ చందా మొత్తాన్ని ఇతరులకి ఇవ్వరాదు! నేరుగా ఆంధ్రపత్రికకే చెల్లించాలి!




---

నేను "భారతి" మాస పత్రికకు చందాదారునిగా చేరదలుచు కున్నాను. చందా పైకము రు. 40 డి. డి./ ఎం. ఒ. ద్వారా పంపుతున్నాను.

పేరు : ______________________

చిరునామా : ______________________

______________________

చందాదారుని సంతకం

# "అవధూత"

## బులుసు వేంకటేశ్వర్లు

అగ్రహారంలో అడుగు పెట్టానంటే చాలు - ఎప్పుడెప్పుడు నరసింహశాస్త్రి గారి దర్శనం చేద్దామా! అని కొట్టుకుపోతుంది మనస్సు"

నేనూ అగ్రహారంలో పుట్టిన వాణ్ణే"

ప్రతి యేడూ వచ్చి నా పిత్రార్జితం భూమిఁ తాలూకు శిస్తు వసూలు చేసుకొని - నా అన్న వాళ్ళనందర్నీ పలకరించి పోతూ ఉంటాను'

మా పెద్దాడి ప్రేమ గొడవల వల్లా - నా శ్రీమతి అనారోగ్యం వల్లా - ఈ మధ్య మూడేళ్ళుగా అగ్రహారం రాలేకపోయాను'

బాబయ్యని శిస్తు వసూలు చేసి పంపించమని ఉత్తరాలు వ్రాసాను' పెద్దవాడై పోయాడాయన' రైతులో - ఆయనేం వేగగలడు??

చివరికి నేనే రావల్సి వచ్చింది"

అలా వీధిలో కెళ్ళొస్తా"

అగ్రహారం ఎంతో మారిపోతోంది'

మండువాలోగిళ్ళు, చిన్నబంగాళా పెంకుటిళ్ళుగా, బోడి డాబాలుగా మారిపోతున్నాయి'

పెచ్చులూడి పోయిన గోడలికి సిమ్మెంటు చేయించిన పెద్ద పెద్ద మచ్చలు వికృతంగా కన్పిస్తున్నాయి'

కొంచెం శిథిలమైపోయినా - మారనిది ఒక్క నరసింహశాస్త్రి గారి ఇల్లే" ఇంటి ముందు గిలక బావీ, విశాలమైన అరుగూను"

శాస్త్రిగారు నా చిన్నతనం రోజుల నాటికే దేశం పట్టనంత పండితుడని చెప్పుకుంటూ ఉండేవారు" ఆయన అర్క వ్యాకరణాల్లో నిధి'

శాస్త్రిగార్కి శంకరం ఒక్కడే సంతానం' వాడూ నేనూ హైస్కూల్ చదువు పూర్తి అయ్యే దాకా సహాధ్యాయులం'

శంకరం బుఱ్ఱ పాదరసం కన్నా చురుకైంది' వాడు ఎంత తెలివైన వాడంటే - మా క్లాసుకి వచ్చే టీచర్లు వాణ్ని దృష్టిలో పెట్టుకుని పాఠాలు ప్రిపేర్ అయి వచ్చేవారు"

శంకరం పుట్టిన నాల్గైదు రోజులికి శాస్త్రిగారు 'వందే మాతరం' అంటూ గర్జించారుట ఒకనాడు'

బుజం మీది కాశ్మీరు శాలువా తీసి కింద పడేసి - ఖద్దరు గుడ్డ పైమీదేసుకుని అగ్రహారం వచ్చిన స్వాతంత్ర్య ప్రచారక బృందంలో కలసి పోయారుట!!

ఆయన తెగింపుకి అగ్రహారం ఆశ్చర్యపోయింది'

ఆ వెళ్ళిన మనిషి నాలుగేళ్ల దాకా అయిపులేడు' ఆయన ధర్మపత్ని శాంతమ్మగారు చాలా కష్టపడి సంసారం లాక్కొచ్చిందట ఆ రోజుల్లో"

మహాభాష్యం పఠించిన శాస్త్రిగారు - కంచు కంఠంతో దేశభక్తి గీతాల్ని పాడుతుంటే ప్రజలు తన్మయులైపోయారుట' ఉద్రేకం చెందే వారుట"

'క్విట్ ఇండియా' మూమెంటులో ఆయన జైలు కెళ్ళారు!!

దేశంలో స్వాతంత్ర్య ఉదయారుణ రేఖలు విచ్చుకునే రోజుల్లో - శాస్త్రి గారు ఊళ్ళో అడుగు పెట్టారు"

గ్రామస్తులంతా శాస్త్రిగార్కి వీర చందనం అద్దారు' బ్రహ్మరథం పట్టారు"

దేశం స్వతంత్రమైంది"

ఊళ్ళో మిడిల్ స్కూల్ వెలిసింది"

గ్రామస్తులంతా ఓ రోజు శాస్త్రిగారి ముందు చేతులు కట్టుకుని నిలబడ్డారు' స్కూల్లో పండిత పదవి చేపట్టమని అర్థించారు"

విద్యా దానం చెయ్యమని నా ఇంటికి వచ్చిన వాడెవడికైనా - కులమత ప్రసక్తి లేకుండా, ఏదో భగవంతుడు నాకిచ్చిన జ్ఞానాన్ని వాడికి అందిస్తాను'అంతేకాని, 'భృతకోపాధ్యాయుని'లా జీవించలేను'క్షమించండి" ఇదీ శాస్త్రిగారి సమాధానం"

సరే, శంకరం నేనూ స్కూలు చదువు ప్రారంభించాం' శంకరం అన్ని క్లాసుల్లోనూ ఫస్టు వచ్చేవాడు'

నూటికి ఒక్క మార్కు తక్కువైతే తల్లడిల్లి పోయేవాడు' శ్రద్ధా శ్రద్ధకు తగిన పట్టుదలా ఆ పట్టుదలకు తగిన ఆరోగ్యం వాడి విద్యార్థి జీవితాన్ని ఉజ్వలం చేసాయి"

పిత్రార్జితమైన సంస్కృత జ్ఞానం వాడి సమగ్ర వ్యక్తిత్వానికి కాంతిరేఖ అయింది"

కాలేజీ చదువు పూర్తి చేసి ఉద్యోగం నిమిత్తం పొరుగు రాష్ట్రంలో స్థిరపడ్డాను నేను"

శంకరం, నేనూ ఆ తర్వాత కలుసుకున్నది చాలా తక్కువ సార్లు"

అగ్రహారం వచ్చినప్పుడు శాస్త్రిగారి ద్వారా వాడి విషయాలు తెలుసుకొంటూ ఉండేవాడిన్ని"

శంకరం ఢిల్లీలో పెద్ద ఉద్యోగంలో స్థిరపడ్డాడు!

వాడి ఫని అంగ రంగ వైభోగంగా ఉన్నదని తెలిసి సంతోషించాను! అన్నిటి కన్నా విచిత్రమైన శంకరం పెళ్ళి విషయం"

'రోజీ' అనే అమ్మాయిని వాడు ప్రేమించి పెళ్ళి చేసుకున్నాట్ట' ఆ పెళ్ళి విషయం శాస్త్రిగారికి కానీ శాంతమ్మ గారికి కానీ తెలియదు' ఓ రోజు ఆ అమ్మాయిని వెంట బెట్టుకుని మీ ఆశీస్సులు కావాలంటూ వచ్చారట్ట అగ్రహారం"

ఊరంతా విస్తుపోయింది"

పిడుగులు కురుస్తాయనుకున్న శాస్త్రిగారి కంఠం పీయూషం వర్షించింది"

శాస్త్రిగారు వాళ్ళిద్దర్నీ ఆశీర్వదించి పంపించారుట చిరునవ్వుతో"

శాంతమ్మగారు మాత్రం గోల పెట్టారట చాలా కాలం'

ఈ విషయం నిర్లిప్తంగా నాతో చెపుతూ శాస్త్రిగారు అన్నారు'

'సీతారావుఁడూ' కాలం మారిపోయింది' మా ఆచారాలూ కట్టుబాట్లూ మీ మీద రుద్దలేం' వాటిని మాతోనే అంతరింపజేసుకొని మా గౌరవం నిలబెట్టుకోవాల్సిన అవసరం ఉంది' ఏవంటావ్??'

నేనూ తలూపాను విస్మయంగా"

'కాలాయ తస్మైనమః' అన్నారు శాస్త్రిగారు చేతులు జోడిస్తూ'

ఆ నాడు నా కనిపించింది - శాస్త్రిగారు ఓ ఛాందస పండితుడు కాడు' ఆయన పుస్తకాలతో పాటు కాలాన్ని కూడా చదువుకొన్న వారు' ఆయన సంప్రదాయం పుట్టలో నివసిస్తున్న విప్లవాల మిన్నాగు"' అని'

దేశం బానిసత్వంలో మగ్గుతున్న వేళ 'నాకేం లెమ్మ'ని 'అ ఇ ఉ జో 'బులుక్ అంటూ కూర్చోలేదాయన!!

స్వాతంత్ర్య సమరంలోకి దూకి తన వంతు కర్తవ్యాన్ని అందించి. దేశమాత ఋణాన్ని తీర్చుకొన్న మనిషి ఆయన'

మరి ఇప్పుడో??

కొడుకు స్వాతంత్ర్యాన్ని మన్నించి దీవించిన మనీషి ఆయన"

ఆలోచనల్లో బడి నడుస్తున్నాను" ఎదురుగా శాస్త్రిగారి ఇల్లు"

అరుగు మీద పడక్కుర్చీలో కూర్చున్నారాయన"

నేను వెళ్ళి ఆయన పాదాలంటి బల్లపై కూర్చున్నాను"

"ఒరే! సీతారావుఁడువేనా?? కళ్ళకి చెయ్యి అడ్డం పెట్టుకుంటూ నాకేసి చూసి అన్నారాయన"

"అవునండి!

'ఎప్పుడొచ్చావ్?

"ఊళ్ళో కొచ్చి ఓ గంటైందండి' కులాసాగా ఉన్నారా!"

"ఆఁ కులాసాకేం? ఎల్లలూ అమ్మాయి బాగున్నారా? శిస్తు వసూలు అయ్యిందా?'

ఈ మధ్య రెండు మూడేళ్ళుగా రాలేకపోయాననీ, బాబయ్య శిస్తులు వసూలు చేయలేక పోయాడనీ - ఊళ్ళోకి రాగానే రైతుకి కబురు పెట్టి ఇలా వచ్చాననీ - చెప్పాను!!

శాస్త్రిగారు దీర్ఘంగా నిట్టూర్చారు"

"సరే, రా లోపలికి! కొంచెం అల్పాహారం తీసుకొందువు గాని...' అంటూ లేచా రాయన'

ఆయన మాటను కాదనలేక వెంట నడిచాను కానీ. బాబయ్య ఇంట్లో భోజనం చేసి గంట

కాలేదు''

శాంతమ్మగారు ఓ ప్లేట్‌లో గారెలూ - అరిసెలూ పెట్టి పట్టుకు వచ్చారు!! శాస్త్రిగారు గోడకు జార్లబడి కూర్చున్నారు''

చిన్నప్పుడు ఇంట్లో ఏం చేసుకున్నా శంకరంతో సమానంగా నాక్కూడా పెట్టేవారు శాంతమ్మగారు''

బాల్య స్మృతుల్ని జ్ఞప్తికి తెచ్చుకుంటూ గారె ముక్క విరిచి నోట్లో పెట్టుకున్నాను''

ఈ రోజు ఏవిటండి విశేషం?? ఎవరిదైనా సంశయంగా ఆగిపోయాను''

అవును' ఈ రోజు ఆబ్దీకం'' గంభీరంగా అన్నారు శాస్త్రిగారు'

పీట మీద నుంచి లేస్తూ అడిగాను "ఎవరి ఆబ్దీకం అండీ?'

'శంకరం పోయాడు' రెండేళ్లయింది''

నా చేతిలో గ్లాసు జారిపోయింది'' నిర్ఘాంత-పోయాను'' నోట మాట రావడం లేదు'' కాళ్ల కింద భూమి కదులుతున్నట్లుంది''

ఉచితానుచితాలు మరిచి - శాస్త్రిగారి బుజాలు పట్టుకుని కుదిపేసాను ఆవేశంతో''

శంకరం పోయాడా??

ఎప్పుడు?? ఈ ఘోరం ఎలా జరిగింది??

చెప్పండి'' ఎల్లా జరిగిందిది?? నా గొంతు రుద్ధమైపోయి మాటలు రాలేదు ఇంక''

శాస్త్రిగారిలో కదలిక లేదు' రాయిలా కూర్చుండి పోయారు'' ఆయన మొహంలో లీలగా కన్పిస్తున్న దైన్యాన్ని - తెచ్చిపెట్టుకున్న గాంభీర్యం నొక్కి పెడుతున్నట్లనిపించింది నాకు''

పరుగు లాంటి నడకతో బైటపడ్డాను'

ఉహుఁ' ఆ విధిని క్షమించలేను''

పండుటాకుల్లా ఉన్న శాస్త్రి గారికీ, శాంతమ్మ గారికీ భగవంతుడు చేసిన ఘోరానికి భగవంతుడే నా ఎదుటబడితేనా ?''

పది నిముషాల్లో బాబయ్య ఇంటి కొచ్చి పడ్డాను'

కుర్చీలో కూర్చుని ఏదో పత్రిక తిరగేస్తున్నాడు బాబయ్య''

బాబయ్యా''

నా కేక నా గుండెల్లోనే దాగిపోయి - లోపల దుఃఖాన్ని పైకి త్రోసింది'' ఏడుస్తూ బల్లపై కూలబడ్డాను''

శంకరంతో నాకున్న అనుబంధం - స్నేహం నిన్నమొన్నటివి కావు' వాడి స్మృతులన్నీ దుఃఖంగా మారి కట్టలు తెంచుకుని పైకురికాయ్''

ఏవిట్రా' ఏమైంది?? బాబయ్య నా భుజం తట్టుతూ ఓదార్పుగా అన్నాడు''

శంకరం చచ్చి పోయా ట్ట

ఆశ్చర్యం''

బాబయ్య మొహం చిరునవ్వుతో నిండిపోయింది''

ఒరే' అబ్బిగా' లే' బాధ పడకు'' శంకరం సుఖంగా ఉన్నాడు'' బతికున్నాడు''

బాబయ్య మాటలు నన్ను దిగ్భ్రాంతిలో ముంచేసాయ్''

శంకరం బతికున్నాడా??

కలా'' నిజమా??

నా కేం మాట్లాడాలో తోచటం లేదు''

మరి మరి శాస్త్రిగారు

చెపుతాను' నడు లోపలికి బాబయ్య నా చెయి పట్టుకుని లోపలికి నడిచాడు''

* * * *

సరిగ్గా రెండేళ్ల క్రితం ఇదే రోజు''

శాస్త్రిగారు గోదావరిలో స్నాన సంధ్యాదికాలు ముగించుకొని ఇంటికి తిరిగి వస్తున్నారు''

అదే సమయంలో కంకర దుమ్ము రేపుకుంటూ రెండు పోలీస్ వేన్‌లూ, రెండు జీపులూ వచ్చి శాస్త్రిగారింటి ముందు ఆగాయ్!!

అగ్రహారం జనం నిద్దర కళ్లతోనే బయల్దేరి శాస్త్రిగారింటికి రాసాగారు!!



శాస్త్రిగారు నిర్ఘాంతపోతూ వీధిలో నిలబడిపోయారు!

మీ పేరు నరసింహశాస్త్రి గారు కదూ?" ఇంగ్లీష్‌లో ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్"

శాస్త్రిగారు తలూపారు"

ఇంకొక ఆఫీసరు అందుకొన్నాడు!

మేము నేర పరిశోధన విభాగానికి చెందిన వాళ్ళం" ఢిల్లీ నుండి వచ్చాం" కొన్ని కారణాల వల్ల మీ ఇల్లు సోదా చేయవలసి వస్తోందని చెప్పడానికి విచారిస్తున్నాం"

అధికారం – సంస్కారం – కలగలసిన తీరులో చెప్పాడాయన" తన అనుచరుల కేసి తిరిగి చెయ్యి ఆడించాడు వెంటనే"

పోలిస్ ఆఫసర్లు బిలబిలా శాస్త్రి గారింట్లోకి ప్రవేశించారు"

పరుపులూ, దిండ్లూ, అల్మారాలు, పెట్లూ, మొదలుకొని వంటింట్లోని బోషాణం వరకూ ఇంట్లో ఏ వస్తువూ మిగల్చకుండా వెతికి బైటకి వచ్చారు వాళ్ళు"

ఆఫసర్ తన చేతికిచ్చిన కాగితంపై సంతకం పెట్టబోతూ అడిగారు శాస్త్రిగారు! నా ఇల్లు ఎందుకు సోదా చేసారో తెలుసుకోవచ్చా??

ఇన్‌స్పెక్టర్ ఇబ్బందిగా మొహం పెట్టాడు"

కొన్ని కారణాల వల్ల మేం ఇప్పుడేమీ చెప్పలేం" త్వరలో నే మీకు తెలియగలదని ఆశిస్తున్నాం"

క్షణాల్లో జీపులు అదృశ్యమైనాయ్"

శాస్త్రిగారు అరుగు మీద విగ్రహంలా కూర్చుండిపోయారు" ఊళ్ళో జనం రకరకాల వ్యాఖ్యానాలు చేసుకొంటూ ఎవరిళ్ళకి వాళ్ళు వెళ్ళిపోయారు!

ఆ రోజు మధ్యాహ్నానికి కానీ రాత్రికి కాని శాస్త్రిగారు కూర్చున్న చోటు నుంచి కదల్లేదు"

నిద్రాహారాలు లేవు! ఇంట్లో పొయ్యిలో పిల్లులు లేవలేదు"

తెల్లారింది" చేదు నిజం మోసుకొస్తూ ఊళ్ళోకి పేపర్ వచ్చి పడింది" ఊరంతా కలకలం"

పేపరు చదివిన శాస్త్రిగారి కళ్ళు నిప్పులు వర్షించాయ్"

శంకరం అరెస్టయ్యాడు"

అత్యున్నత ఉద్యోగంలో ఉన్న శంకరం, దేశ రహస్యాల్ని అమ్మి కోట్లు సంపాదిస్తున్నాడు"

పోలీసులు శంకరాన్ని అరెస్టు చేసి తీసుకు వెళుతున్న ఫోటో పేపర్లో పడింది"

కన్నతల్లిని అమ్ముతున్న కీచకులు

తాటికాయంత అక్షరాలతో వ్రాస్తూ శంకరం విదేశాలకు ఏజంటుగా మారి దేశ రహస్యాలను అమ్మి విలాస జీవితం గడుపుతున్నాడని ఈ పనిలో అతని భార్య మిక్కిలి సహకరించిందనీ విపులంగా వివరించింది" చివరగా అన్నింటి కన్నా విచిత్రం శంకరం ఒక స్వాతంత్ర్య యోధుని కడుపున పుట్టిన బిడ్డ" అంటూ వ్యాఖ్యానించింది ఆ దినపత్రిక"

శాస్త్రిగారు అలా పేపర్లోకి చూస్తూ ఉండిపోయారు చాలా సేపు! ఒక నిర్ణయానికి వచ్చిన వారులా ఇంట్లోకి నడిచారు"

## ఖాళీగ్లాసులు

నాటి కవులకు పరమార్థమే అర్థము
నేటి కవులకు అర్థమే పరమార్థము
నాడందరూ కాళీ దాసులు
నేడెందరో ఖాళీ గ్లాసులు

–మేరికపూడి సీతాపతిరావు

## "అవధూత

గదిలో బీరువా తలుపులు తెరిచి – శాలువా చేతిలోకి తీసుకున్నారు అది దేశ ప్రధాని తామ్రపత్రంతో గౌరవించి శాస్త్రిగారికి కప్పిన ఖద్దరు శాలువా"

శాలువా బుజాలపై కప్పుకుని – తామ్రపత్రం చేతుల్లోకి తీసుకుని బైటకు వచ్చి గోదావరి కేసి నడిచారు"

గోదావరి – ప్రశాంత గంభీరంగా సాగిపోతూ ఉంది"

గోదావరిలో మునిగి పైకి లేచిన శాస్త్రిగారి బుజాలపై శాలువా లేదు! చేతుల్లో తామ్రపత్రం లేదు"

నీళ్ళు గారుతున్న పంచెతో గోదావరి గట్టుపై కూర్చుని శాస్త్రిగారు మంత్రాలు ఏకరువు పెడుతున్నారు"

అవి అపరకర్మకు సంబంధించిన మంత్రాలు"

మండే గుండెల్లోంచి ఎగసి పడుతున్న వేదనా తప్త వీతిహోత్రి జ్వాలికలు"

సజీవుడైన కొడుకుని ఉద్దేశించి ఆయన జరుపుతున్న ఘోరాన్ని తెలుసుకొని అగ్రహారం నిర్ఘాంతపోయింది"

శాస్త్రిగారిని శాంతించమని వేడుకొంది"

బతిమాలింది" చివరకు బెదిరించింది"

నా కొడుకు నిన్ననే చచ్చిపోయాడు! మీ దృష్టిలో బ్రతికి ఉండడం అంటే ప్రాణంతో ఉండడం కావచ్చు! నేను చేస్తున్న పని తప్పు కాదనే విశ్వాసం నాకుంది" "ఇది శాస్త్రిగారిచ్చిన సమాధానం"

శాస్త్రిగారిని ఓ పిచ్చివాడుగా జమ కట్టింది ఊరంతా" చివరికి ఆయన్ని వెలివేసింది కూడా"

* * * *

ఆకాశంలో నక్షత్రాలు మినుకు మినుకు మంటూ వెలుగుతున్నాయ్ వాకిట్లో మంచం మీద పడి ఉన్నానే కానీ కంటికి నిద్ర లేదు"

అస్థిమితమైన మనస్సులో రేగిన తేనెటీగల్లాంటి ఆలోచనలు"

శాస్త్రిగారిని పిచ్చి వాడంటోంది లోకం!

నా కొడుకు బతికి లేడు! చచ్చిపోయాడు అంటారు శాస్త్రిగారు" ఆయన మనస్సు ఎంత గాయపడితే సజీవుడైన కొడుక్కి శ్రాద్ధకర్మ చేస్తున్నారు??

దేశభక్తులంటే ఈ నాడు వేదికల మీద ఉపన్యాసాలు ఇచ్చే వాళ్ళు – పదవుల కోసం పరితపించి పోయే వాళ్ళు జ్ఞప్తికి వస్తున్నారంటే – అది మన దురదృష్టం అనుకోవాలి"

కొన్ని చోట్ల స్వార్థానికి – స్వప్రయోజనానికి దేశభక్తి ఓ ముసుగు అయింది ఈ నాడు"

శాస్త్రిగారు నా మనస్సుకి ఓ సారి పిచ్చివాడిలా – మరో సారి తన కొడుకు నిజాయితీ మీద అంతులేని విశ్వాసం కలిగి భగ్నమైన ఆశలు కలవానిగా మరోసారి గుండెలు పట్టనంతటి దేశభక్తి కలవానిగా ఇంకా ఇంకా అనేకానేక కోణాల్లోంచి అనేక రూపాల్లో కన్పిస్తున్నారు"

కొడుకులు లంచాలు పుచ్చుకుంటుంటే మా వాడు రెండు చేతులా సంపాదిస్తున్నాడు మా వాడికి పైసంపాదన బాగానే ఉంటుంది" అని చెప్పుకుని మురిసిపోతున్న రోజుల్లో అవినీతి పరుడైన కొడుకును, మృత సమానునిగా గణించిన శాస్త్రిగార్ని అగ్రహారం ఏ నాటికైనా అర్థం చేసుకోగలదా??

ఏ మాతృదేశం కోసం లాఠీలకు శరీరాన్నంకితం చేసేడో ఏ దేశం కోసం ఏళ్ల తరబడి జైలు పాలయ్యాడో ఆ దేశానికి ఆ తల్లికి ద్రోహం చేసిన మనిషితో శాస్త్రిగారు ఇంకా ఏ సంబంధాన్ని ఉంచుకోగలడు?

శాస్త్రిగారి వంటి దేశభక్తుడు శంకరం చేసిన దేశద్రోహం వల్ల పుట్టిన అవమానానికీ దేశం అంతా వాణ్ని ద్రోహిగా వేలెత్తి చూపిస్తుంటే ఆ ద్రోహికి జన్మనిచ్చిన వాడిగా తన మనస్సులో ఏర్పడ్డ వెలితిని ఎవరు పూరించగలరు???

ఇంతకీ శంకరానికి ఏం తక్కువ??

దేశ రహస్యాల్ని అమ్ముకుతినే విషపు కూటికి వాడెందుకు ఆశ పడ్డాడు??

ప్రభుత్వం వాడి తెలివితేటల్ని ప్రోత్సహించింది"

చదువుకున్నంత కాలం స్కాలర్‌షిప్ ఇచ్చింది"

చదువయ్యాక పిల్చి ఉద్యోగం ఇచ్చింది"

ఇల్లూ కారూ సేవకులూ సకల సౌకర్యాలు అమర్చింది"

మరి మరి వాడి కేం తక్కువని తల్లి పాలు తాగి రొమ్ము గుద్దే నీచుడయ్యాడు??

తన కొడుకు ధనవంతుడు అయినా కాకపోయినా పర్వాలేదు! నీతివంతుడైతే చాలుననుకొన్న తండ్రి ఈ దేశ స్వాతంత్ర్య సమర యజ్ఞంలో తన శక్తిని ఓ సమిధగా వెలిగించిన మనిషి తన కొడుకు దేశం ముందు ఒక ద్రోహిగా డబ్బు కోసం తల్లినే. అమ్ముకొంటున్న నీచునిగా మారిన నాడు లోకం దృష్టిలో వాడు సజీవుడైనా తన దృష్టిలో వాడు 'మృతుడే' అన్న నిర్ణయానికి రావడంలో నాకు ఆశ్చర్యం అన్పించడం లేదు"

భగవంతునిలో ఆత్మను లయం చేసేసి జీవన్ముక్తి పొంది – కర్మవిపాకం అయ్యేదాకా శరీరాన్ని ధరించి తిరిగే వాళ్ళని అవధూతలు అంటారు!

దేశంతో అద్వైత భావం పెంచుకున్న శాస్త్రిగారు నా కంటికి అవధూతగా కన్పించసాగారు"

ఎవరైనా ఆయన్ని పిచ్చివాడిగా భావిస్తే బాధ పడను" అవధూతలు – అచ్చం పిచ్చివాళ్ళలాగానే వ్యవహరిస్తారని ఎక్కడో చదివిన గుర్తు"! □




## ఆ సున్నితమైన అనుభవం మిమ్మల్నొక్క నిట్టూర్పులో ఆఘమేఘాల మీదుంచుతుంది

పొగమంచుకన్నా పల్చన, ఎగిరే ఈకకన్నా తేలిక, అదే మీరు కోరే నిశ్చింత నిస్తుందిక. డ్యూరెక్స్ ఫెదర్ లైట్ అంతఃరరాష్ట్రీయ కాండోము లిప్పుడు ఇండియాలో లభిస్తున్నాయి.

ప్రపంచానికి తెలిసిన అతి తేలికైన, సున్నితమైన సంరక్షతను తెలిసికొవడానికి మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాము.

అతి పల్చనిది

**డ్యూరెక్స్ ఫెదర్‌లైట్**

ఇది జగమెరిగిన గొప్ప అనుభవం.

తయారి

MAA (S) LRDF 1A TEL 85



# అభినేత్రి భానుప్రియ సమాధానాలు

**ఎం. ఓథెల్ కుమార్, మ ంచిర్యాల**

మిమ్మల్ని పోలీసు ఆఫీసరుగా చూడాలని ఉంది నా కోరికతీరుస్తారా?

శ్రీ టి. యల్. వి. ప్రసాద్ గారి దర్శకత్వంలో, సత్యశక్తి వారి చిత్రంలో పోలీసాఫీసరుగా నటిస్తున్నా!

**ఎం శివాజీ, మోదుకూరు**

వరకట్న నిర్మూలన పై మీరు నటించిన 'అనాదిగా ఆడది" పాత్రవలె నిజ జీవితంలో నటిస్తే ఏమవుతుంది?

పోలీసులు పట్టుకుంటారు!

**నన్నపనేని రమాదేవి, పొన్నవరం**

అక్కయ్యా! నేటి సమాజంలో మన భారత స్త్రీక నిజమైన స్వాతంత్ర్యం ఎప్పుడు వస్తుందంటారు?

స్వతంత్రం నిజమైనప్పుడు!

**సి హెచ్. వరహాలు, వీరుగుంట పోస్ట్**

మీరు నాట్యం నేర్చుకున్నారా? ఎప్పుడు? మీరు ఎనిమా పరిశ్రమలోకి ఎందుకు వచ్చారు?

నేర్చుకున్నాను చిన్నప్పుడు. నేను సినీ పరిశ్రమలోకి నటించడానికి వచ్చాను వేరే కారణం లేదు

**బండారు సాయిసుధ, అనంతపురం**

మీరు నటించిన చిత్రాలలో మీకు నచ్చినది ఏది?

నేను నటించిన సినిమాలన్నీ నాకు నచ్చినవే!

మీరు గృహిణి అయ్యేదెప్పుడు?

పెళ్ళి – జరిగినప్పుడు.

మీ చెల్లాయి బవిష్యత్తు ?

మా చెల్లాయి భవిష్యత్తు భవిష్యత్తే నిర్ణయిస్తుంది.

**జె. వి. వి. ఎల్ సత్యనారాయణ, విజయవాడ**

బానుప్రియగారూ! మీరు నటించిన సినిమాను మరల మరల చూడాలనిపిస్తే ఎది ఎంచుకంటారు?

నా మీద అభిమానం!

**జె. కుమార్‌సింగ్, నెల్లూరు**

మీ గురించి మీ అభిప్రాయం ఏమిటి?

నా మీద నా అభిప్రాయమా! ఓ. కే!

**ఎల్. నాగమణి, చేబ్రోలు**

ఒక సినిమా హిట్ అవడానికి ముఖ్య కారకులు ఎవరు? ప్రేక్షకులా? దర్శకులా? నటీనటులా?

అందరూ!

> **ఉత్తమ ప్రశ్న**
>
> **వి సునీత, విశాఖపట్నం**
>
> కొత్త వింత– పాత రోత కాని, వింటే పాత పాటలే వినాలి మీ ఉద్దేశ్యం?
>
> ఒప్పుకుంటాను

**నల్లూరి లక్ష్మీనారాయణ, తాడిపూడి**

సినిమా నటీనటులకు డబ్బు ఉంటుంది కాని, మనశ్శాంతి ఉండదంటారు ఇది నిజమేనా?

అని ఎవరన్నారు? నిజం కాదు!

**ఎం. పి. సునీత, హైదరాబాద్**

నటిగా మీరు ఎం సాదించదలిచారు?

మంచి పేరు

సామాన్య స్త్రీగా జీవితంపై మీ అభిప్రాయమేమిటి?

సామాన్య స్త్రీలకు జీవితం మీద మంచి అభిప్రాయమే వుంటుంది!

**ఎం. ధనలక్ష్మి, విజయనగరం**

నేటి సినిమాలు ప్రజలకు లాభదాయకమా-కాదా?

లాభదాయకమే వినోదాత్మకంగా వుంటే.

ముఖ్యంగా విద్యార్థులకు ఎలా తోడ్పడుతుంది?

విద్యార్థులకు వాళ్ళు అర్థం చేసుకునే విధానాన్ని బట్టి.

**మాంతారి చైతన్యకుమార్, ఏలూరు–2**

భానుప్రియగారూ! మీ రెప్పుడు దర్శకురాలవుతారు?

ఇప్పట్లో కాదు!

**కె రవికుమార్, గంగావతి**

ప్రేమించి పెళ్ళి చేసుకోవడం మంచిదా? లేక పెళ్ళి చేసుకుని ప్రేమించడం మంచిదా?

అవి చేసుకున్న వాళ్ళని అడగడం మంచిది.

**అక్కిరెడ్డి శ్రీనివాసరెడ్డి, మధిర**

ఒక స్త్రీ పరాయి మగాడితో మాట్లాడితే చాలు – లేని పోని సంబంధం అంటకట్టే ఈ సమాజం ఎప్పుడు మారుతుంది?

మనుషు లందరూ మారినప్పుడు.

**పి చంద్రశేఖర్, గూడూరు**

స్త్రీ పుట్టిన తరువాత సుఖము అనుభవించకుండా చనిపోతే, అది జన్మ కాదంటాను మీరు ఏమి అంటారు?

ఏమీ అనను! □

---

కూపన్.

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక
## భానుప్రియ సమాధానాలు

ప్రశ్న : ____________________

____________________

____________________

పంపిన వారి పేరు ____________________

పూర్తి చిరునామా ____________________

____________________

# అభిమాన తారలపై అభిప్రాయం

తెలుగు చలన చిత్ర రంగంలోకి చిరుదివ్వెలా ప్రవేశించి అఖండ జ్యోతిలా వెలుగుతున్న నటుడు హీరో మా (మె) అభిమాన హీరో చిరంజీవి మాత్రమే స్వయంకృషితో అచంచల విశ్వాసముతో చిత్ర పరిశ్రమలో అగ్రస్థానానికి ఎదిగి, కేవలం మాస్ చిత్రాలకే అంకితం కాకుండా క్లాస్ చిత్రాలలో కూడా



నటించి తన చాతుర్యాన్ని తెలుగు ప్రేక్షకులకు కనులపండుగగా చూపించినాడు. రెండుసార్లు "ఫిలింఫేర్ అవార్డు" కూడా సంపాదించుకున్నాడు. శుభలేఖ, ఇంట్లో రామయ్య వీధిలో కృష్ణయ్య, మగ మహారాజు, విజేత, మగధీరుడు మొదలయిన చిత్రాలు ఆయన టాలెంట్‌ను నిరూపించిన చిత్రాలు. అలాంటి చిత్రాలలోనే నటించి ఆరుకోట్ల ఆంధ్రుల అభిమాన పాత్రుడవ్వాలని మా కోరిక.

-ఎం. బసవరాజు, కృపానందనగర్,
అనంతపూర్.

★ ★ ★

"మంగమ్మగారి మనవడు, ముద్దుల క్రిష్ణయ్య, అనసూయమ్మగారి అల్లుడు, అపూర్వ సహోదరులు"..... ఇలా చెప్పుకుంటూపోతే ఎన్నో - ప్రేక్షకులకు పూర్తి "రిలీఫ్" నిచ్చేవి. అందుకే నేను వాటి కథా నాయకుడు "బాలకృష్ణ" అంటే అభిమాన పడ్డాను. ఒక సంవత్సరంలో 'వరుసగా' "ఆరు" హిట్స్ యిచ్చిన "ఘనత" ఆ యువ కిశోరానికే దక్కుతుంది.



ఈ విక్టరి ఇలానే కొనసాగాలంటే ఆయన ఒకే మూస పాత్రల్లో కాకుండా, పూర్తి విభిన్నమైన సాహస పరమైన ఇతివృత్తపు పాత్రల్లోనే నటించాలని సలహా ఇస్తున్నాను స్త్రీలను అసభ్యపరిచే సన్నివేశాలలోనూ, సంభాషణల్లోనూ నటించవద్దని కోరుతున్నాను

-వై హరిబాబు, వెంగళరావునగర్,
కావలి

విజయశాంతి అంటే నాకెంతో ఇష్టం ఏ భావాన్నైనా కళ్లతోనే చూపించగల నటి విజయశాంతి ముఖ్యంగా కరుణ రసాన్ని ఒలికించడంలోను, కోపాన్ని వ్యక్తీకరించినపుడు ఆమె నటనా చాతుర్యం అమోఘం! చిలిపి పిల్లగా చలాకీగా కన్పించి నా మనసును ఆకట్టుకుంది. 'ప్రతిఘటన' లోని విజయశాంతి నాకు బాగా నచ్చింది. మహానటి



సావిత్రి తర్వాత నేను అభిమానించే తార విజయశాంతి- అందుక్కారణం ప్రతి పాత్రను ఆమె ఉన్నతంగా పోషించడమే!

–డి. రామారావు, హిందూపురం, పరిగి

★ ★ ★

నా అభిమాన నటి సుహాసిని. ఆవిడ నటించిన ముక్కుపుడక, స్వాతి, సిరివెన్నెల మొదలైన చిత్రాలు చూసిన తరువాత ఆమె అభిమానినయ్యాను. ఆవిడ



అమాయకపు పాత్రలకు జీవం పోస్తారు. కేవలం కథాబలం గల చిత్రాలలోనే నటించి ప్రతి సంవత్సరం సింధుభైరవి చిత్రంలో లాగ జాతీయ అవార్డులు పొందాలని నా ప్రగాఢ ఆకాంక్ష.

–వి. శైలజ, పాల్వంచ

★ ★ ★

ఆంధ్రుల అభిమాన నటుడు అక్కినేని నాగేశ్వర



రావుకి వారసుడిగా చిత్ర సీమలో అడుగు పెట్టిన నాగార్జున నా అభిమాన నటుడు విద్యాధికుడై, నటనలో పలువురు వద్ద శిక్షణ పొంది చిత్ర సీమలో దూకిన కొదమ సింహం నాగార్జున మొదటి చిత్రమైన విక్రమ్‌లో అతని నటన అపూర్వం నటనలో, నృత్యంలో ఎంతో అనుభవజ్ఞుడిలా నటించి ప్రేక్షకుల ప్రశంసలు పొందాడు వాచకంలో కొంత దోషం ఉన్నా, అది సరిదిద్దుకుంటే అతనిలో గొప్ప నటుడు పూర్తిగా కన్పించగలడు రాబోవు చిత్రాలలో మరింత నటన ప్రదర్శించి మావంటి అభిమానులను సంతృప్తి పరచాలని నాగార్జున గారికి నా విన్నపం

–వి. నాగేశ్వరరావు, అనకాపల్లి

★ ★ ★

నా అభిమాన నటుడు సూపర్‌స్టార్ కృష్ణగారు.



ఆయన అంటే నాకు చెప్పలేనంత అభిమానం అతన్ని నేను భగవంతుడితో సమానంగా చూస్తుంటాను ఎందుకంటే అతడు చేసిన సాహసాలు, రికార్డ్స్, సినీఫీల్డ్‌లో ఏ ఒక్క నటుడు చేయలేదు తెలుగులో కలర్, సినిమా స్కోప్, 70ఎం ఎం ప్రవేశపెట్టింది మా కృష్ణగారే ధైర్యం, సాహసం ఆయనకు వెన్నతో పెట్టిన విద్య రాబోవు జమదగ్ని, యమపాశం, సర్దార్ కృష్ణమనాయుడు, ప్రతాపరుద్రుడు చిత్రాలలో తన పాత్రకు ప్రాణం పోసి నటిస్తున్నారు తనకు తానే సాటి అని నిరూపించుకుంటారు మరెన్నో భారీ చిత్రాలు నిర్మించి ప్రపంచస్థాయికి ఎదిగిపోవాలని నా కోరిక

-యం. దేవకుమార్, దేవినగర్, బళ్లారి

★ ★ ★

"సితార చిత్రంలో ఆమె అపూర్వ నయనాభినయ కౌశలం చూసాక నేనామె అభిమానిగా మారాను అప్పటినుంచీ ఆమె చిత్రాలు అన్నీ చూస్తున్నాను ఆమె నటిస్తుంటే, కళ్లే ఆమె నటనకు అందం తెచ్చాయా అనిపిస్తుంది. ఆ ముగ్ధ మనోహర సౌందర్య రూపసి భానుప్రియ అంటే నాకెంతో



అభిమానం. "ఆలాపన" చిత్రంలో నాట్యకళకే అంకితమై పోయిన నర్తకిగా ఆమె నటన అపూర్వం స్వతంత్ర వ్యక్తిత్వం గల స్త్రీగా ఆమె నటిస్తే చూడాలని వుంది ఆమె నటనాకౌశలం కలకాలం కళకళలాడుతూ విలసిల్లాలని ఆశించేవారిలో నేనూ ఒకణ్ణి విభిన్న పాత్రలలో ప్రేక్షకులను మెప్పించిన ఆమె ఉజ్వల తారగా వెలుగొందుతుందని నా నమ్మకం

–ఎస్ సాయిప్రసాద్, విజయనగరం □



"భార్గవరాముడు"లో మందాకిని

## వెంకటేశ్ "అజేయుడు"

"జగ్గయ్య, అన్నపూర్ణ కన్న తల్లిదండ్రులు. సత్యనారాయణ, శారద పెంచిన తల్లిదండ్రులు. సత్యానంద్ మాటలు రాశారు. వేటూరి గీతాలకు చక్రవర్తి స్వరకర్త. భాస్కరరాజు శిల్పం, రఘు నృత్యాలు, రామ్ సూరి సంయుక్త దర్శకత్వం. దండమూడి కోటేశ్వరరావు ప్రొడక్షన్, విజయన్ సాహసాలతో జి. రామ్మోహనరావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు.

"ముద్దుల పాప"లో సదియా

# సినిమా విశేషాలు జి.వి.జి.

దర్శకత్వంలో హైదరాబాద్‌కు చెందిన ప్రముఖ పారిశ్రామిక వేత్త మహారత్నం గుప్తా నిర్మించే తొలి చిత్రంలో రాజేంద్ర ప్రసాద్, చంద్రమోహన్, రాజశేఖర్‌లు హీరోలు. జీవిత, అశ్విని, అనూరాధ, వై. విజయ, సుధాకర్, బాలాజీ, నూతన్ ప్రసాద్, రాళ్ళపల్లి తదితర నటవర్గం. వేటూరి, సీతారామ శాస్త్రి, రాజశ్రీ గీతాలకు కృష్ణ చక్ర స్వరకర్తలు. బషీర్ అహ్మద్ ఛాయ, బాబ్జీ శిల్పం, జి. చంద్రశేఖర రెడ్డి కూర్పుతో టి. కృష్ణ ప్రొడక్షన్ కంట్రోలర్.

## కె. ఎస్. ఆర్. దాస్, రమేష్ కాంబినేషన్‌లో సి. వి. ఎన్. ప్రొడక్షన్స్ చిత్రం

"మార్చిలో పూజ," అన్నారు సి. హెచ్. వి. నరసింహారెడ్డి. ఈయన "మొనగాడు" అనంతరం నిర్మించే చిత్రంలో రమేష్ హీరో, పరుచూరి సోదరులు స్క్రిప్ట్ రాస్తున్నారు. కె. ఎస్. ఆర్. దాస్ దర్శకుడు. దీనికి "జాన్ కి బాజీ" అనే హిందీ హిట్ చిత్రం మాతృక.

## తాతినేని ప్రసాద్ దర్శకత్వంలో "ధర్మపత్ని"

"ఒక చెల్లెలుగా, ఒక ఇల్లాలుగా, బాధ్యత గల ఒక పోలీసు అధికారిణిగా ఒక మహిళ ఎదుర్కొనే సమస్యలు. సంఘర్షణలు.... భర్త పరిశోధించిన కేసుకు కోర్టు తీర్పు చెప్పగా, ఆ కేసు దర్యాప్తును మళ్ళీ ఆమె ప్రారంభిస్తుంది. అనూహ్యమైన మలుపులున్న కథ. నవంబర్ 17 నుంచి 30 వరకు జరిగిన షెడ్యూల్‌లో టాకీ పార్టు పూర్తి చేశాం.. డిసెంబర్‌లో సాంగ్స్ పిక్చరైజేషన్,"అన్నారు తాతినేని ప్రసాద్. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంతో పాటు విలన్‌గా తొలిసారి నటిస్తున్న సత్యశక్తి పిక్చర్స్ వారి ఈ చిత్రంలో సుమన్, భానుప్రియ, రాజ్యలక్ష్మి, రాజేంద్ర ప్రసాద్, నూతన్ ప్రసాద్, అల్లు...

## దాసరి సారథ్యంలో "ఆడబొమ్మ"

"ఒక కేబరే డాన్సర్ యధార్థ గాథ. డిసెంబర్ నుంచి మన రాష్ట్రంలో ఒకే షెడ్యూల్లో మా గురువుగారు 'కళాప్రపూర్ణ' దాసరి గారి నేతృత్వంలో తయారౌతుంది," అన్నారు సత్యానాయుడు. ఈయన దాసరి వద్ద 17 చిత్రాలకు శిష్యరికం చేశారు.





బేబి షాలిని

వీరి మధ్య జరిగే సంఘర్షణలో నలిగిపోయే ఫాయర్‌గా వెంకటేశ్ అద్వితీయంగా నటిస్తున్నారు. డిసెంబర్ 1 నుండి 10 వరకు జరిగిన మూడవ షెడ్యూల్‌లో పాటలు పిక్చరైజ్ చేశాం. ఆఖరి షెడ్యూల్ జనవరి 1 నుండి 7 వరకు. అన్నారు శ్రీ పల్లవీ ఫిలిమ్స్ అధినేత అయిన ఛాయాగ్రాహక నిర్మాత ఎస్. వెంకటరత్నం. ఈ చిత్రంలో గుమ్మడి, సుధాకర్, వేలు, రాజా, జయభాస్కర్, శోభన, వరలక్ష్మి, శ్రీలక్ష్మి ఇతర నటవర్గం. భీశెట్టి కథకు

## 'ప్రెసిడెంటుగారి అబ్బాయి'

గ్రామీణ వాతావరణానికి చెందిన కథ ఆఖరి షెడ్యూల్ జనవరిలో అన్నారు తాతినేని రామారావు ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో అనుమోలు వెంకట సుబ్బారావు నిర్మిస్తున్న ప్రసాద్ ఆర్ట్స్ పిక్చర్స్ వారి పై చిత్రంలో బాలకృష్ణ సుహాసిని జగ్గయ్య, సత్యనారాయణ, రావ్‌వర్మ రాంజీ సుధాకర్ సాక్షి రంగారావు, ఈశ్వరరావు, రమణారెడ్డి, పి. ఎల్. నారాయణ, రాజ్యలక్ష్మి, వరలక్ష్మి పై విజయ, కథ మాటలు సమకూర్చిన పరుచూరి వెంకటేశ్వరరావు, గెస్ట్‌గా పరుచూరి గోపాలకృష్ణ నటిస్తున్నారు వేటూరి గీతాలకు చక్రవర్తి స్వరకర్త నందమూరి మోహనకృష్ణ ఛాయ బి చలం శిల్పం బి విశ్వం సంయుక్త దర్శకత్వం రఘు నృత్యం, జూడో రత్నం సాహసాలు కృష్ణస్వామి కూర్పు నిర్వహిస్తున్నారు

## "ఆస్తులు – అంతస్తులు"

ఐశ్వర్యవంతురాలైన యువతిని పేదింటి యువకుడు ప్రేమిస్తే ఎదురయ్యే సమస్యలు గల తమిళ చిత్రం ముదల్ వసంతం హిట్ అయింది దానికి తెలుగు సేత ఈ చిత్రం అన్నారు బి భాస్కరరావు ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో బి ఆర్ రెడ్డి నిర్మిస్తున్న పై చిత్రంలో రాజేంద్ర ప్రసాద్ చంద్రమోహన్ చరణ్‌రాజ్ కోట శ్రీనివాసరావు సారధి రాళ్ళపల్లి మాడా, రమ్య మహాలక్ష్మి శుభ మమత నటిస్తున్నారు కలైమణి కథకు ఆత్రేయ మాటలు పాటలు రాశారు ఇళయరాజా సంగీతం సత్తిబాబు ఛాయ బండారు సూర్యకుమార్ శిల్పం హార్స్‌మన్ బాబు సాహసాలు శివసుబ్రహ్మణ్యం నృత్యాలు ఇ ప్రకాష్ రెడ్డి సంయుక్త దర్శకత్వం కాశీ ఆత్మాచరణ్ కూర్పుతో నరేష్‌కుమార్ సురేష్ కుమార్ నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు డి మురళి ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ కె ఎస్ ప్రకాష్ ప్రొడక్షన్ కంట్రోలర్

## మహేష్ కుమార్‌ను డైరెక్టర్‌గా పరిచయం చేసే గంగోత్రి పిక్చర్స్ తొలి చిత్రం

వినోదాత్మక చిత్రం మార్చి ఏప్రిల్ నెలల్లో షూటింగ్ అన్నారు లోగడ ప్రముఖ దర్శకుల వద్ద సహాయ సహకార దర్శకుడుగా అనుభవం గడించిన మహేష్ కుమార్ ఈయన కథ స్క్రీన్‌ప్లే వగైరా తారాగణం అంజనేయ పుష్పానంద్ కథకు గణేష్‌పాత్రో సంభాషణలకర్త వేటూరి గీతాలకు చక్రవర్తి బాణీలు కూర్చారు నవకాంత్ ఛాయ, కళాదర్ శిల్పం గూనా నాగేంద్ర ప్రసాద్ సంయుక్త దర్శకత్వం, తాండవ కృష్ణ నిర్వహణతో సి ఆర్ ఆర్ ప్రసాద్ సి కె ఆర్ ప్రసాద్ నిర్మాతలు

## "అమెరికా అబ్బాయి"లో మాస్టర్ శ్రావణ్‌శంకర్

ఈయన దర్శకత్వంలో కేతినేని పిక్చర్స్ సమర్పించే పై చిత్రంలో సాగరిక సుధాకర్ హరిప్రసాద్ కోట శ్రీనివాసరావు వేలు త్యాగరాజు మమతతో పాటు ఇద్దరు నవ నాయికలు ఉంటారు

"దొంగోడొచ్చాడు"లో రాధ





"చిన్ని కృష్ణుడు"లో రమేష్, కుష్బూ



"ప్రెసిడెంటుగారి అబ్బాయి"లో బాలకృష్ణ, సుహాసిని

## రాఘవ దర్శకత్వంలో రాక్షస సంహారం

షూటింగ్ డిసెంబర్‌లో పూర్తవుతుంది అన్నారు డైరెక్టర్ రాఘవ ఈయన గతంలో ఎన్ టి రామారావు కె రాఘవేంద్రరావు తాతినేని రామారావు క్రాంతికుమార్‌ల వద్ద దర్శకత్వ శాఖలో విశేషానుభవం గడించి కన్నడంలో రెండు చిత్రాలను డైరెక్ట్ చేశారు కూడా ఈయన కథ స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో గాయత్రి ఆర్ట్ మూవీస్ అధినేత జి వి ఆర్ రాజు నిర్మిస్తున్న పై చిత్రంలో అర్జున్ కుష్బూ రంజని సంయుక్త వీరభద్రరావు కన్నడ ప్రభాకర్ ప్రభృత నటవర్గం పైడిపల్లి రవీంద్రబాబు మాటలు చక్రవర్తి స్వరకల్పనలో వేటూరి సీతారామశాస్త్రి గీతాలు రాశారు కబీర్‌లాల్ ఛాయ శివశంకర్ నృత్యాలు సాహుల్ సాహసాలు దిలీప్ సహకార దర్శకత్వం గౌతంరాజా కూర్పు నిర్వహిస్తున్నారు సంఘంలో పురానా మనిషిగా చలామణి అవుతూ తెర వెనుక శ్రీకృష్ణ లీలలు జరిపే ఒక దుష్టుడిని తుదముట్టించడం ఈ చిత్రం ఇతివృత్తం అన్నారు రాఘవ

## విజయ బాపినీడు దర్శకత్వంలో శ్రీనాద్ ఆర్ట్ ప్రొడక్షన్స్

డిసెంబర్ మూడవ వారం నుంచి రెండు షెడ్యూల్స్‌లో ఫిబ్రవరికి షూటింగ్ పూర్తవుతుంది అన్నారు విజయబాపినీడు ఈయన దర్శకత్వంలో ప్రముఖ పారిశ్రామికవేత్త అలపాటి రంగారావు "కాయ్ రాజా కాయ్ ప్రతీకారం, రాజ్‌కుమార్ దోస్తి దుష్మని అనంతరం సమర్పించే శ్రీనాద్ ఆర్ట్ ప్రొడక్షన్స్ చిత్రంలో చంద్రమోహన్ రాజేంద్ర ప్రసాద్ కోట శ్రీనివాసరావు నూతన్‌ప్రసాద్ వేలు కల్పన రేఖ వై విజయ అన్నపూర్ణ పాత్రదారులు కాశీ విశ్వనాద్ మాటలు వాసూరావు సంగీతం మహీదర్ ఛాయ ఏ చంద్రమోహన్ ప్రొడక్షన్‌తో ఎస్ ఏ శివలింగేశ్వరరావు ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ జె ఎం మోహన్ నిర్మాత

## సినిమా

ఓ, అన్నట్టు మీకు తెలుగు రాదు కదూ?



## రవిచంద్ర, రమేష్‌లతో రాఘవేంద్ర మూవీ క్రియేషన్స్ చిత్రం

కారవాన్ హిందీ చిత్రం ఆధారం ఏప్రిల్ నెలాఖరు నుంచి షూటింగ్ అన్నారు కె వి వి సత్యనారాయణ ఈయన "ఉమ్మడి మొగుడు అనంతరం నిర్మించే రాఘవేంద్ర మూవీక్రియేషన్స్ చిత్రంలో రమేష్ హీరో ఎస్ ఎస్ రవిచంద్ర దర్శకుడు

## ఎం నరసింహారావు సమర్పణలో శోభన్ బాబు మరో చిత్రం

మార్చి నుంచి షూటింగ్ అన్నారు "బావా మరదళ్ళు మహరాజా అనంతరం పున్నమి చంద్రుడు అందిస్తున్న ఎం నరసింహారావు ఈయన సమర్పణలో ఈయన మిత్రులు శాంతి చిత్ర అధినేతలు కె రత్నబాబు గణేష్‌బాబు నిర్మించే చిత్రంలో శోభన్‌బాబు హీరో కె మురళీమోహనరావు స్క్రీన్‌ప్లే దర్శకత్వ బాధ్యతలు వహిస్తారు



"సంకెళ్ళు"లో దగ్గుబాటి రాజా, రమ్య

## కె విశ్వనాథ్ దర్శకత్వంలో చిరంజీవి, విజయశాంతి

ఆర్థికంగా గాని మరేవిధంగానైనా గాని మనిషి ఎంత ఎదిగినా ఎంతటి కీర్తి ప్రతిష్టలు సంపాదించినా - తన స్థానాన్ని మరచిపోకుండా తన వారసులను కూడా అదే క్రమశిక్షణతో పెంచుకోవాలని ఆశించే వ్యక్తికి ఎదురయ్యే ఎదురుదెబ్బలు ...మస్యలు ప్రధాన ఇతివృత్తం అన్నారు కె విశ్వనాథ్ ఈయన కథ స్క్రీన్‌ప్లే సమకూర్చి దర్శకత్వం వహించే పూర్ణోదయా మూవి క్రియేషన్స్ వారి 8వ చిత్రంలో చిరంజీవి విజయశాంతి సుమలత రచయిత ఎం వి ఎస్ హరినాథరావు సర్వదమన్ బెనర్జీ మిశ్రో మల్లికార్జునరావు రావి కొండలరావు హేమ సుందర్ సంయుక్త ఆదిగా గల వారు పాల్గొంటున్నారు శాయినాథ్ సంభాషణల కర్త ఎ నారాయణరెడ్డి సీతారామశాస్త్రి గీతాలకు రమేష్ నాయుడు స్వరకర్త లోక్ సింగ్ ఛాయ అరుణ్‌కుమార్ శిల్పం నందూరి విజయ్ సహకార దర్శకత్వం ఎ రాజగోపాల్- వి జగన్మోహనరావు ప్రొడక్షన్ తార నృత్యాలు శివరాజా నిర్వహణతో తాడి రామకృష్ణ తాడి హరిబాబు తాడి బాబ్జీ సహ నిర్మాతలు మా డైరెక్టర్ గారి చిత్రంలో తొలిసారిగా విజయశాంతి రమేష్‌నాయుడు పని చేయడం

## సినిమా

విశేషం. రెండవ షెడ్యూల్ డిసెంబర్ 11 నుంచి 22 వరకు మైసూరులో జరిగింది. అక్కడే మూడవ షెడ్యూల్ కూడా జనవరి 6 నుంచి 20 వరకు జరుగుతుంది అన్నారు నిర్మాత ఏడిద నాగేశ్వర రావు

"కాబోయే అల్లుడు"లో కల్పన



## కె. రాఘవేంద్రరావు, వెంకటేశ్ కాంబినేషన్‌లో 'భారతంలో అర్జునుడు"

"డిసెంబర్‌లో రాజమండ్రి షెడ్యూల్ పూర్తి చేశాం చివరి షెడ్యూల్ జనవరిలో" అన్నారు కె రాఘవేంద్రరావు ఈయన దర్శకత్వంలో ఈయన తండ్రి కె ఎస్ ప్రకాశరావు నిర్మిస్తున్న ప్రకాశ్ స్టూడియోస్ వారి పై రాజకీయ సంబంధమైన చిత్రంలో వెంకటేశ్ సరసన కుష్బూ నాయిక రావు గోపాలరావు నూతన్‌ప్రసాద్ రంగనాథ్ చలపతి రావు ఎ ఎల్ నారాయణ అల్లు రామలింగయ్య చిట్టిబాబు సంయుక్త అరుణ తాతినేని రాజేశ్వరితో పాటు ఈ చిత్ర రచయితలు పరుచూరి వెంకటేశ్వరరావు ఇద్దరు భార్యలున్న ఉంగరాల రామప్పగా తమ్ముడు పరుచూరి గోపాలకృష్ణ మొటక బ్రహ్మచారి అయిన ఉంగరాల కిష్టప్పగా రెండు విశిష్టమైన పాత్రలను పోషిస్తున్నారు వేటూరి గీతాలు చక్రవర్తి సంగీతం కె ఎస్ ప్రకాష్ ఛాయ భాస్కరరాజు శిల్పం రఘు నృత్యాలు విజయన్ సాహసాలు వి ఎస్ రెడ్డి సంయుక్త దర్శకత్వం కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పు తెర వెనుక హంగులు

## మహేశ్వరి – పరమేశ్వరి త్రిమూర్తులు

ప్రముఖ పారిశ్రామికవేత్త కేంద్ర సెన్సార్ బోర్డు సభ్యులు కళాబంధు టి సుబ్బరామిరెడ్డి భారీ ఎత్తున సమర్పిస్తున్న త్రిమూర్తులు చిత్రం ప్రతి నెలా 15 రోజులపాటు షూటింగ్‌తో ఫిబ్రవరికి పూర్తవుతుంది ఫిబ్రవరి 20 నుంచి 28 వరకు హాంగ్‌కాంగ్‌లో మూడు పాటలు కొన్ని ఫైట్స్ పిక్చరైజ్ చేస్తాం పాటల మిక్సింగ్ ట్రాన్స్‌పోజింగ్ లండన్‌లో జరుగుతాయి ఆత్రేయ వేటూరి పాటలకు బప్పిలహరి సంగీతం ఎంతో గొప్పగా ఉంది



త్రిమూర్తులు ప్రారంభోత్సవం నాడు
శ్రీ టి సుబ్బరామిరెడ్డి, వెంకటేష్,
కుష్బూ, అశ్విని

అన్నారు సుబ్బరామిరెడ్డి మహేశ్వరి – పరమేశ్వరి ప్రొడక్షన్స్ పతాకంలో తయారవుతున్న ఈ ప్రతిష్టాత్మక చిత్రంలో వెంకటేశ్, అర్జున్ తులసీరాం శోభన కుష్బూ అశ్విని రావుగోపాలరావు సత్యనారాయణ నూతన్ ప్రసాద్ సుదాకర్ బాలాజీ నగేష్ రాళ్ళపల్లి వేలు మాడా సుమిత్ర పుష్పలత పాత్రదారులు సలీమ్ జవేద్ కథకు పరుచూరి సోదరులు సంబాషణలు రాశారు ఎస్ గోపాలరెడ్డి చాయ బాస్కరరాజు శిల్పం విజయన్ సాహసాలు రఘురాం నృత్యాలు నరసింహారావు కూర్పుతో పి శశిభూషణ్ నిర్మాత

# మృత్యువు చెరపజాలని మంద స్మిత స్మితా పాటిల్



ముందు టివి తెరమీది నుంచీ తర్వాత వెండి తెర నుంచీ లక్షలాది మందిని సమ్మోహ పరిచిన మంద స్మితవదనం. ఆ చిరునవ్వునే కాదు జీవాన్నే కోల్పోయింది వంపు తిరిగిన ఆ పెదాల మీద తొణికిసలాడే ఆనంద దరహాసం గంభీర జలధిలాంటి ఆ కళ్లలో గలగల లాడే సరస సంతోషమూ గుండెల్ని నీరు చేసే విషాదమూ ఇక కనిపించకుండా పోయాయి నటనే జీవితంగా బ్రతికి అద్భుత కళాకౌశలాన్ని అనన్య సాధ్యమైన భావస్ఫోరకమైన అభినయాన్నీ ప్రదర్శించిన వెండి తెర విదుషీమణి స్మితాపాటిల్ హృదయ స్పందన ఆగిపోయింది

మెదడులో రక్తస్రావం ఫలితంగా ఆరోగ్య పరిస్థితి విషమించి స్మితాపాటిల్ డిసెంబర్-13 అర్ధరాత్రి బొంబాయిలోని జస్లోక్ ఆస్పత్రిలో మరణించింది

బొంబాయి టి వి లో మరాఠీ వార్తలు చదువుతుండే స్మితాపాటిల్ ముఖంలో భావస్ఫోరక అభినయాన్ని అభినయంలో ఆమెకు గల సాలభ్యాన్ని గుర్తించిన శ్యాం బెనెగళ్ తన నిశాంత్ చిత్రంలో ఆమెకు నాయిక పాత్ర ఇవ్వడంతో ఆమె సినిమా జీవితం ప్రారంభమైంది 1974 లో నిశాంత్‌లో నటించిన నాటి నుంచి 1986 డిసెంబర్ 13న ఆఖరి శ్వాస విడిచేవరకు ఆమె 50 కన్నా ఎక్కువ కళాత్మక వ్యాపార చిత్రాలలో నటించింది నిశాంత్ తర్వాత ఆమెకు పేరు తెచ్చిన చిత్రాలు మంథన్ భూమిక' భూమిక చిత్రంలో నటనకు గాను ఆమె జాతీయ అవార్డును పొందింది మొత్తం మీద పది సంవత్సరాల సినిమా జీవితంలో ఆమె మూడు సార్లు జాతీయ ఉత్తమ నటి బహుమతిని పొందింది ఒక రాష్ట్ర అవార్డును కూడా ఆమెకు బహూకరించారు సినిమా రంగానికి ఆమె చేసిన విశిష్ట సేవలకు గుర్తింపుగా గత సంవత్సరం కేంద్ర ప్రభుత్వం ఆమెకు పద్మశ్రీ అవార్డును కూడా అందజేసింది

అమితాబ్ బచ్చన్ సరసన పార్ముల మూస చిత్రాలలోనూ కొత్త నటులతో కళాత్మక చిత్రాలలోనూ కూడా ఆమె చాలా సులభమైన అసాధారణమైన నటనకు కనబరిచింది గోవింద్ నిహలాని తీసిన 'ఆక్రోశ్' ముజఫర్ అలీ తీసిన గమన్ సయీద్‌మీర్జా తీసిన అల్బర్ట్ పింటో కో గుస్సా క్యోం ఆతాహై సత్యజిత్‌రే తీసిన సద్గతి మృణాల్‌సేన్ తీసిన అకాలేర్ సంధానే జి అరవిందన్ తీసిన చిదంబరం వంటి సమాంతర ఆఫ్‌బీట్ చిత్రాలలో కష్టసాధ్యమైన సన్నివేశాలలో అతి సున్నితమైన మానవ సంబంధాలను చిత్రీకరించడంలో స్మితా పాటిల్ కనబరచిన ప్రజ్ఞ అనితర సాధ్యమనే చెప్పాలి ఇలా కళాత్మక చిత్రాల పాత్రలనే సులభంగా నిర్వహించ గలిగిన స్మిత మూస చిత్రాలలో అవలీలగా నటించడం ఆశ్చర్యకరమేమీ కాదు అందువల్లనే 1980 తర్వాత ఆమెకు అంతకంతకూ ఎక్కువగా వ్యాపార చిత్రాలలో నాయిక పాత్రలు వచ్చాయి భీగీ పల్‌కే వాద్‌సా బద్‌లేకి ఆగ్ 'శక్తి' నమక్ హలాల్ వంటి చిత్రాలు ఆమెకు ఏ పాత్రనైనా పోషించ గల నేర్పుందని అద్భుతంగా ఋజువు చేశాయి

మహారాష్ట్ర మంత్రి వర్గంలో మాజీ మంత్రి అయిన శివాజీరావు పాటిల్‌కు ఆమె 1956లో జన్మించింది గత సంవత్సరం హిందీ నటుడు రాజ్‌బబ్బర్‌ను పెళ్లి చేసుకున్న స్మిత 17 రోజుల క్రితం ఒక శిశువుకు జన్మనిచ్చింది ప్రసవానంతరం క్షీణించిన ఆరోగ్య పరిస్థితి మరింత విషమించి మరణం సంభవించింది

మృత్యువు ఆమె మరిన్ని చిత్రాలలో నటించకుండా నిరోధించ గలదేమోగాని ఇప్పటికే ఆమె సాధించిన విజయాల్ని తొలగించజాలదు ఇప్పటికే ఆమె భారత కళారంగానికి అందించిన విలువైన కానుకల్ని ఎవరూ మాయం చెయ్యలేరు సుప్రసిద్ధ దర్శకుడు కోస్టా గావ్రాస్ ప్రత్యేకంగా అభిమానించి పారిస్‌లో స్మితాపాటిల్ చిత్రాల ప్రదర్శనను ఏర్పాటు చేశాడంటే ఆ గౌరవం ఇప్పటికి భారతీయ సినిమా కళాకారులలో సత్యజిత్‌రేకు తప్ప మరెవరికీ దక్కలేదంటే స్మితాపాటిల్ సాధించిన కీర్తి పర్వతం ముందు మృత్యువు ఒక గులక రాయిలా వెలవెలా బోతున్నది

స్మితాపాటిల్ మరణానికి రాష్ట్రపతి, ప్రధాన మంత్రితో సహా పలువురు ప్రముఖులు సంతాపం ప్రకటించారు ఆమె మరణం సినీ ప్రపంచంలో ఒక తీరని లోటని రాష్ట్రపతి తమ సంతాప సందేశంలో అన్నారు అన్ని రాష్ట్రాల ముఖ్య మంత్రులు స్మితాపాటిల్ మరణం పట్ల విచారాన్ని వ్యక్తం చేశారు ఆమె అంత్య క్రియల సందర్భంగా స్మశాన వాటికకు భారతీయ జనతాపార్టీ నాయకుడు శ్రీ ఎల్ కె అద్వానీ జనతాపార్టీ నాయకుడు శ్రీ మధు దండావతే మహారాష్ట్ర కాంగ్రెస్ (ఐ) అధ్యక్షురాలు శ్రీమతి ప్రభారావులతో పాటు అనేక మంది రాజకీయ ప్రముఖులు సినీరంగ ప్రముఖులు హాజరయి దివంగత నటికి జోహార్లర్పించారు అంత్య క్రియలకు హాజరయిన సినీరంగ ప్రముఖులలో శ్రీయుతులు ప్రాణ్, శశికపూర్ రాజేష్‌ఖన్నా నసీరుద్దీన్‌షా ఓంపురి సారిక అరుణా ఇరానీ మీనాక్షి శేషాద్రి రేఖ శ్యాం బెనగల్ రామానందసాగర్ మహేష్‌భట్ జబ్బార్‌పటేల్ గోవింద్ నిహలాని ఉన్నారు స్మితాపాటిల్ సహ నటీమణులు షబనా అజ్మీ, హేమమాలిని జయప్రద, స్మితాపాటిల్ తల్లి భర్త రాజ్ బబ్బర్ విషణ్ణవదనాలతో కనిపించారు

–(ఒ వి)

# ప్రజాసేవ చేస్తావా....?

"ఐలూరి"



ఓ రోజున ఉదయం ఆరు గంటలయి ఉంటుంది. లేద్దాం లేద్దాం అనుకుంటూ బద్ధకంగా ముసుగు బిగించాను బుడమేరు కట్టతెగివచ్చిన వరదనీరు ఇంటి చుట్టూ నిలిచి చీదరగా ఉంది ఇంతలో

'అక్కయ్యా" అనే పిలుపు వినబడింది

మా ఆవిడ ఎక్కడో దొడ్లో నీళ్లల్లో డెట్టాల్ కలిపి పిల్లలకి స్నానాలు చేయిస్తోంది పిలుపు వినబడలేదు

'అక్కయ్యా మళ్ళీ పిలుపు ఈ సారి ఈ పిలుపు చాలా దగ్గరగా వినబడింది అప్పటిగ్గానీ నా మత్తు వదలలేదు. ఆ వచ్చింది మా బావమరిది విద్యాసాగర్ అని నాకు అర్థం అయింది మా మామగారు తన కొడుకుని అపర సరస్వతిని చేద్దాం అని అనుకుని ఆ పేరు పెట్టారు కానీ బస్తీ షోకులతో జులాయిగా తయారయి, అయన్ను అశోపహతుడిగా తయారు చేసాడు.

పొద్దున్నే దిగబడ్డాడేంటా అనుకుంటూ తెల్లవారినా కుడుతున్న దోమను చంపుదామని పక్కకి ఒత్తిగిల్లాను.

"బావా లేచావా" అంటూ సరాసరి నన్నే పలకరించాడు తలవైపునున్న కుర్చీలో కూర్చుని.

ఇక తప్పదనుకుని అప్పుడే మెలకువ వచ్చిన వాడిలాగా.

ఎప్పుడొచ్చావోయ్ సాగరూ" అంటూ ఆవలించాను.

ఇంతలో మా ఆవిడ చంటివాడిని ఒక చేత్తో రెండో అమ్మాయిని మరొక చేత్తో పుచ్చుకుని బరబరా మధ్య గదిలోకి వచ్చింది. ఎదురుగా తమ్ముణ్ణి చూసిన ఆనందంతో ఆవిడ ముఖం ఎగిరిపోయిన ఇంటికప్పుమీది రేకు అంతయింది

"ఏరా ఎంతసేపయింది వచ్చి అంది పిల్లల్ని బరాబరా తుడుస్తూ

'ఇప్పుడే వచ్చా నక్కయ్యా' అన్నాడు వినయంగా అతగాడి వినయం నాకు ఆశ్చర్యాన్ని మా ఆవిడకి ముచ్చటనీ కలిగించింది

'ఇంటి దగ్గిర అందరూ కులాసానా అనడిగింది వాళ్ళక్కయ్య

"తెలియదక్కయ్యా నేను మద్రాసు నుండి వస్తున్నా' అన్నాడు నావంకే చూస్తూ

నేను మా ఆవిడవంక చూసి చిన్నగా నవ్వుదామని అనుకున్నాను కానీ నవ్వు రాలేదు

"అయితే నీకు సినిమా ఛాన్సులు రాలేదన్నమాట అన్నాను కాస్తంత ధైర్యం కూడదీసుకుని

"వచ్చాయి కానీ . " ఆగిపోయాడు మధ్యలో.

"కానీ ఏమిటి అని రెట్టించింది మా ఆవిడ ఇంటి పట్టున ఉండకుండా తిరుగుతున్న తమ్ముడిమీద కాస్త చిరాకు కూడా కలిగిందావిడకి.

"వరదలొచ్చాయిగా అందుకని ." ఆగిపోయాడు నావంక చూసి

"ఊ అందుకని . ' రెట్టించక తప్పలేదు నాకు

"వరద బాధితులకు సాయపడదామని వచ్చాను అన్నాడు ఒక్కగుక్కలో తలొంచుకుని

మా ఆవిడ తమ్ముణ్ణి నిలువుగుడ్లేసుకు చూస్తూండి పోయింది. నాక్కూడా మాట వెంటనే పెగిలి రాలేదు

మా గ్రామంలో "ఉత్తమ జులాయి వెధవ" పోటీలు పెడితే దానిలో మా సాగరే మొదటి బహుమతి కొట్టేస్తాడు. తరువాత జిల్లాస్థాయి పోటీ పెట్టినా రాష్ట్రస్థాయి, జాతీయ అంతర్జాతీయ స్థాయిలో కూడా మావాడు. ఉత్తమ జులాయి వెధవగా ప్రథమస్థానం కొట్టేస్తాడు. అటువంటివాడు వరద బాధితులకు సహాయం చేస్తానంటుంటే ఎవరికి మాత్రం మరోవిధంగా అనిపిస్తుంది

డబ్బులు చేజిక్కాయంటే మద్రాసు పారిపోయే మావాడు ఇలా అంటుంటే నాకు ఎందుకో మొదటిసారిగా గమ్మత్తయిన భయం వేసింది. ఎందుకనో అసంకల్పితంగా పక్కనే ఉన్న ఇనప బీరువా వంక చూసాను తాళం చెవులగుత్తి తలుపుకి వేళ్ళాడుతోంది మా ఆవిడ వంక చూసాను ఆమె కూడా కొంచెం భయపడుతున్నట్టు అనిపించింది అప్పుడు తాపీగా మా బావమరిదివైపు చూసాను. నావంకచూసి ఫెళ్ళున నవ్వాడు.

'అక్కయ్యా మీ భయం నా కర్థం అయింది ఇంతవరకూ మా ఇంట్లో డబ్బులు నేను పట్టుకెళ్లానేగానీ ఎవరింటిలోనూ ఒక పైసా కూడా తీసుకోలేదు కనీసం అప్పుగానైనా సరే' అన్నాడు టక టకా

నిజమే అనిపించింది నాకు అయినా అంత ధాటీగా ఎలా చెప్పగలిగాడు అనిపించింది నాకు




ఆధునిక విమర్శకులు కొందరు రామాయణాన్ని విమర్శిస్తూ దండకారణ్యంలో నివసిస్తున్న రాక్షసులనబడే వారు ఆ అరణ్య నివాసులనీ, వారక్కడ పొలాలు దున్నుకుంటూ జీవించే వారనీ- వారిని శ్రీరాముడు హింసించడం సముచితంగా ఉన్నట్లు తోచదనీ అభిప్రాయ పడుతున్నట్లు తోస్తున్నది. మునులు కూడా తపస్సు చేసుకుంటూ వనంలో నివసించే వారు. ప్రశాంత జీవులయిన ఆ మహనీయులు ఒకరి జోలికి పోకుండా తమకు లభించిన ఫల మూలాదులను తిని జీవించేవారు. నిరాపేక్షులయిన ఆ మహర్షులు అతిథి పూజలు మానేవారుకారు. ఆతిథ్య భ్యాతులను ఆదరించి గౌరవించడం ఉత్తమ ధర్మంగా వారు భావించేవారు. తమ ఆశ్రమాలకు చుట్టుప్రక్కల ఉన్న నేలల్లో నెవ్వరి ధాన్యాన్ని పండించి, ఆ ధాన్యాన్ని అతిథుల కోసం భద్రపరచే వారు.

ఈ మునులపై పైన చెప్పిన ఆటవిక రాక్షసులకు ద్వేషం. వీరి తపస్సులవల్లా వీరు చేసే యాగాలవల్లా తమకు ఉపద్రవం కలుగు తుందనే భయంతో అవి జరగకుండా ఉండుటకు శాయ శక్తులా ప్రయత్నించేవారు. మునులను హింసిస్తే, వారు ఆ ప్రాంతాలు విడిచి పోగలరనీ, వారి భూములు తాము స్వాధీనం చేసుకోవచ్చుననీ కూడా వారు అనుకునేవారని కూడా ఊహించ వచ్చును. వీరి బాధలు పడలేని మునులు శ్రీరామునితో మొరపెట్టగా అతడు వారిని శిక్షించడం, సంహరించడం జరిగేది. తపో వృత్తి నున్న ఆ మహనీయుడు కారణం లేకుండా అరణ్య వాసులయిన రాక్షసులను హింసించినట్లు భావించడం పొరపాటు. వారు, తాము చేసిన హింసకు ప్రతిహింస అనుభవించేవారు.

మంచితనం కాని, చెడ్డతనం కాని మనిషిని బట్టి ఉంటుంది కాని, జాతిని బట్టి ఉండదు. రాక్షసులన్నంత మాత్రాన వారంతా క్రూర స్వభావులని చెప్పలేము. విభీషణుని వంటి ఉత్తములు వారిలో లేకపోలేదు. అశోకవనంలో జానకీదేవికి కాపుదలగా ఉన్న రాక్షస స్త్రీలలో త్రిజట వంటి ఉత్తమ వనితలూ ఉండేవారు. రావణుడు సీతను అపహరించి లంకను తీసుకొని రావడం కొందరికి ఎంత మాత్రం ఇష్టం లేదు. కాని, చండశాసనుడైన తమ ప్రభువునకు భయపడి ఏమీ అనలేక పోయారు.

రావణ కుంభకర్ణాదులు, మారీచుడు మున్నగు వారు, తామొనరించిన అన్యాయాలకు తగిన ప్రతిఫలం అనుభవించారు. అపకారానికి వెంటనే కాక పోయినా మరొకప్పుడయినా తగిన ప్రతిఫలం ఉంటుంది. దీనిని ఎవ్వరూ కాదనలేరు.

రామరావణ యుద్ధం కేవలం వ్యక్తులకు సంబంధించినది మాత్రమే అని అనుకోకూడదు. శ్రీరామచంద్రుని విజయం అధర్మం పయి ధర్మం సాధించిన విజయమే అని భావించవలసి ఉన్నది.

బులుసు వేంకటరమణయ్య

వీడు జులాయి వెధవయినా దేశాలు తిరిగి ఏదో కొంత జ్ఞానాన్ని సంపాదించాడు అని సరిపెట్టుకున్నాను.

"అయితే మంచిదే అలాగే చెయ్యి అన్నాను "దానికి నువు కొద్దిగా సాయం చెయ్యాలి వచ్చే ఎన్నికల్లో నేనుగాని గెలిస్తే నీ సాయం ఊరికే మర్చిపోను" అన్నాడు.

నాకు వాడి మాటలు వినగానే భూన భోంతరాళాలు ఏకం అయినట్లుగా అనిపించింది. వరదలు, బాధితులు, సహాయం, ఎన్నికలు, జులాయి వెధవ గెలవడం, కృతజ్ఞత ఇలా రకరకాల మాటలు నా చెవుల్లో గింగురుమంటున్నాయి.

ఎందుకో ఒక్కసారిగా నాకు ఆఫీసు, అందులో పని గుర్తొచ్చి తక్షణకర్తవ్యం బోధపడిలేస్తూ....

"అలాగే నీకు తోచినట్లు చెయ్యి ఇందులో నేను చెయగలిగింది ఏముంది" అన్నాను.

మా ఆవిడ తమ్ముడి మాటలకి దిమ్మరపోయి అసంకల్పితంగానే పిల్లల్ని స్కూలుకు తయారు చేస్తోంది.

"గోదావరీ స్టోర్స్ ప్రొప్రయిటర్ నీ ఫ్రండ్‌గదా ఆయనతో ఒక్క ముక్క చెబితేచాలు. మిగిలిన



పనంతా నేను చేసుకుంటాను."

"ఏం చెప్పమంటావు" అన్నాను నిండా మునిడిగాననిపించి.

"వరదబాధితులకు ఇవ్వడానికగాను కొన్ని సరకులు మాక్కావలసినవి ఇస్తే వాటిని మళ్లీ పావు గంటలో తిరిగి ఇచ్చేస్తాం ఈ సాయం చేస్తే చాలు."

"వాళ్లకి పేం చేసినవి తిరిగి పావుగంటలో ఎలా ఇస్తావు? అసలు పావుగంటలో వాటిని కొట్టోంచి తేవడమే కుదరదుగదా" అంది మా ఆవిడ ఎక్కడ కొంప ముంచుతాడోనని భయం భయంగా.

నాకూ అనుమానం వేసింది.

అప్పుడు మా వెర్రి ముఖాలు చూసి మా బావమరిది గీతోపదేశం చేసాడు.

"ఏమీలేదు బావా ఆ సామానంతా అంటే దుప్పట్లు, ధోవతులు, పాలడబ్బాలు, చీరలు, బియ్యం అన్నీ పేర్చి నా నాయకత్వంలో పంచిపెడుతున్నట్లుగా ఓ ఫోటో దిగుతాను. నా వెనకాల ఓ పదిమంది కుర్రాళ్లు నా ఫ్రెండ్స్ ఉన్నార్లే వారిలో కొందరు బాధితులు లాగా చీరలు, ధోవతులు, బియ్యం అందుకుంటారు నాలుగైదు ఫోటోలు దిగుదాం. తరువాత సరకులు మీ ఫ్రండ్‌కి అప్పజెప్పేసి ఫోటోలు తీసుకుని, వాటిని అన్ని పేపర్లలోనూ ప్రముఖంగా వేయిస్తాను.

అప్పుడు వాటిని మా పార్టీ నాయకునికి చూపించి నేను ఇంత సేవ చేసాను. ఇంత ఖర్చు చేసాను, నా వెనక ఇంతమంది ఉన్నారు కనుక నాకు పార్టీ టికెట్టు వచ్చే ఎన్నికల్లో ఇవ్వాలని గట్టిగా అడుగుతాను. దానికి మా వాళ్లందరూ సిఫార్సు చేస్తారు' అని ముగించాడు.

మా బావమరిది వాగ్ధాటికి, తెలివికి కంగారుపడి కొబ్బరినూనె సీసా కాస్తా నేలమీద దభీమని వదిలేసింది మా ఆవిడ.

మా బావమరిది నన్ను చూసి అదో రకంగా నవ్వాడు. నాకు రాజకీయ నాయకుడి నవ్వుతప్ప రక రకాల వృత్తులవారి నవ్వు తెలుసు. ఈ నవ్వు నాకు కొత్తగా ఉంది.

అప్పుడే ఎన్నికల్లో గెలిచి మా బావమరిది మంత్రి పదవి కూడా చేపట్టినట్లనిపించింది. □

# అందాలు చిందే ఫ్రెస్కా.
# సుగంధాలు చిమ్మే ఫ్రెస్కా.

Fresca

గోద్రెజ్ సమర్పణ—

అద్భుతమైన లగ్జరీ సబ్బు.

ఫ్రెస్కా విలాసవంతమైన, విలువైన సుగంధ పరిమళ భరితమైన సబ్బు

ఎంతో నురుగు—పాల మీగడ తరగలా త్వరగా తరగనిది, అరగనిది ఫ్రెస్కా

లగ్జరీ సబ్బు. మీకు సచ్చే, మిమ్మల్ని ఆశ్చర్య పరిచే తక్కువ ధరలో




## గోద్రెజ్ వారి 3 రూపాయల* అద్భుతం




(గత సంచిక తరువాయి)

వీణ ముందు నుండి లేచి మంచంపై పడుకుంది. కళ్ళు మూసుకున్నా, చేతిలో మాత్రం అతడి పాటే మార్మోగుతోంది.

ఆహ్లాదకరంగా అతడుపాడే హిందోళ రాగంలోని కీర్తన గుర్తొచ్చింది.

"మనసులోని మర్మమును తెలుసుకో." అబ్బ! ఎంతబాగా పాడతాడు.

తల్లివచ్చి భోజనానికి పిలిచింది. భోజనం ముందు కూర్చున్న ఆమెకి అర్థాంతరంగా వెళ్ళిన అతడు మళ్ళీ గుర్తుకు వచ్చాడు. విసురుగా నడుస్తున్న అతడి రూపం కనులకు కట్టినట్లయింది. దానికితోడు తల్లి-

"ఏమిటోనే కల్యాణీ! కూర్మయ్య ఈ రోజు భోజనం చేయకుండా వెళ్ళిపోయాడు. నాకు కడుపునిండినట్లు లేదు."

అప్రయత్నంగా చెయ్యి కడుక్కొని లేచింది కల్యాణి. ఆ రాత్రంతా కలతనిద్రే. ఆ నిద్రలో చెదురు మదురుగా కలలు.

"మీ ఇంటికెప్పుడూ రాను కల్యాణీ," అని అతడు బెదిరిస్తున్నట్లున్న అతడి ముఖమే. అలా అలా ఎప్పటికో నిద్ర పోయిన కల్యాణికి తెల్లవారుఝామున ఎప్పట్లా మెళకువ రాలేదు.

తెల్లారిన తర్వాత తండ్రి అడిగారు.

"ఏమ్మా! ఆరోగ్యం బాగులేదా? రాత్రి సగం భోజనంలోనే లేచిపోయావు. తెల్లవారు ఝామున వినే నీ వీణానాదం చెవులకు సోకలేదు."

నిశ్శబ్దంగా తలూపి అక్కడ్నుంచి వెళ్ళిపోయింది. మర్నాడూ కూర్మయ్య రాలేదు. ఇంక రాడేమోనన్న దిగులుతో నీరసంగా ఇంట్లో ఇటూ అటూ తిరిగింది.

మూడవరోజు స్నానం చేసి తలదువ్వుకుంటున్న కల్యాణికి బండి చప్పుడు వినిపించింది. తల విరబోసుకునే వీధిలోకి పరుగెత్తింది. సరిగ్గా అతడూ అప్పుడే బండి దిగుతున్నాడు. తలెత్తిన అతడి చూపుల్లో ఆమె చూపులు చిక్కుకుపోయినాయి.

కళ్ళలో ఒక్కసారిగా కన్నీరు గిర్రున తిరిగింది. అది అతడికి కన్పించకుండా ముఖం పక్కకు తిప్పుకొంది.

వంట ఇంట్లోంచి వచ్చిన మంగ-

"ఏం బాబూ! ఆరోగ్యం బాగుండలేదుట. నాకు చెప్పావు కావేం? నువ్వు రాకపోతే ఇల్లెంతగా చిన్నబోయిందో," అని పలుకరించింది.

ఇద్దరూ ఒకరితో ఒకరు మాట్లాడకుండానే కూర్చున్నారు. నిశ్శబ్దానికి అంతరాయం కలిగిస్తూ ముందుగా కల్యాణే వీణ చేతిలోకి తీసుకుంది.

అతడు మాట్లాడలేదు. ఆమె అలా వాయించి వాయించి ఒక్కసారి ఆగింది. అతడి ముఖంలోకి సూటిగా చూసింది. మళ్ళీ తలదించుకొంది.

"కోపమొచ్చిందా కల్యాణీ! నేనొట్టి పిచ్చి వెధవని. ఇంకెప్పుడూ ఇలా చేయను. నిన్ను అనవసరంగా అన్నానని ఈ రెండు రోజులూ ఎంతో బాధపడ్డాను. నీకెలా ముఖం చూపించడం అని అనుకున్నాను" ఎప్పుడూ అంతగా కదిలి కదిలి మాట్లాడలేదతడు.

మాట్లాడకుండా మోహన రాగాన్ని వాయించింది. ఆహ్లాదంగా, హాయిగా విన్పిస్తున్న ఆ రాగాన్ని వింటూ, ఎక్కడే సంగతులు పడ్డాయో గమనించాడు. రాగం వాయించిన తర్వాత కల్యాణి అడిగింది.

"ననుపాలింపగ నడిచి వచ్చితివో, వాయించనా? ఎవరూరా నినూ వినా వాయించనా?"

"నువ్వు మోహనలో ఏది వాయించినా, ఎన్ని వాయించినా, వినడానికి సిద్ధంగా ఉన్నాను. ఈ రోజు నువ్వు వాయించు. నేను శ్రోతగా మాత్రం ఉంటాను."

అతడు వెళ్ళడానికి సిద్ధమవుతుంటే సింహాచలం వచ్చింది. వస్తూనే పెద్దగా తిట్టింది.

"ఎట్రా కురుమయ్యా అలా సేసినావు. ఎవురైనా అట్టానడిసిపోతారా? మేమేం పరాయోళ్ళమా? మా ఇంటికి రాకపోతివి?"

"ఏటవ్వా నాకు ఆరోగ్గెం బాగుండలేదా, ఎవరు సెప్పారు?" ఆశ్చర్యంగా అడిగాడు.

"సాల్లే! నువ్వు దాస్తే దాగదు. ముఖం మాదు ఎట్టా పీక్కు పోయిందో? ఉండు అమ్మగారు పిలత్తా ఉన్నారు" అని లోనికి వెళ్ళింది.

"నా తిక్క కోపం కప్పిపెట్టడానికి నువ్వలా చెప్పావా కల్యాణీ? కల్యాణి వైపు తిరిగి అన్నాడు.

"మరేం చెప్పను. మీకు తెలియదు. ఎందుకు మీకు కోపం వచ్చిందో

జరిగిన కథ -6: వీణపట్ల అమిత ఆసక్తి గల కళ్యాణికి గురువు గారు జబ్బు పడడంతో ఆయన చెప్పిన మీదట కూర్మయ్య కొత్తగా పాఠాలు చెప్పడానికి వస్తుంటాడు. ఆయన ప్రవర్తనలోనూ, అలవాట్ల లోనూ ఏమాత్రం సంస్కారం లేదని కళ్యాణి భావిస్తుంది. మంగకు ఆయన పట్ల గౌరవం కలుగుతుంది. ఆయన జయదేవుని అష్టపదులు, క్షేత్రయ్య పదాలు కళ్యాణికి నేర్పుతాడు. ఆయన కళాప్రజ్ఞ పట్ల కళ్యాణికి గౌరవం కలుగుతుంది. పని మనిషి సింహాచలానికి ఆయన బంధువేనని తెలుస్తుంది. విజయనగరంలో కళ్యాణితో కలిసి కూర్మయ్య కచేరీ చేస్తాడు. కళ్యాణికి వివాహం జరిగితే ఆమె కళా తృష్ణ ఆగిపోవలసిందే గదా అని కూర్మయ్యకు విచారం పట్టుకుంటుంది.

నాకంతుబట్టలేదు. అయినా మీ వాలకం చూస్తే నిజంగా జ్వరం వచ్చినట్టుంది. అలా పీక్కుపోయిందేం మీ ముఖం."

"నాకోపం సంగతి నాకే తెలియని మాట నిజం. నీకు ముఖం చూపలేక, నిన్ను చూడకుండా ఉండలేక నరకం అనుభవించాను. ఈ రోజు నిన్ను చూడగానే తెలిసింది, నిజంగా నేను నిన్ను విడిచి బ్రతకలేను కల్యాణీ."

అతడి మాటలు విని శరీరమంతా కంపించగా ఒక్క ఉదుటున లోపలికి వెళ్ళిపోయింది.

మర్నాడు అతడు వచ్చిన వరకూ ఆమెకా ఉలికిపాటు తప్పలేదు. "నువ్వు లేనిదే నేను బ్రతకలేను." ఈ మాట తను నిజంగా విన్నదా? లేక వట్టి ఊహ మాత్రమేనా? అన్న సంశయం కలిగింది.

"అతను కోపం వచ్చినా దాచుకోలేడు. అపేక్ష వచ్చినా ఆగలేడు. ఇది స్పష్టంగా తెలుసు." అని గొణుక్కుంది.

"ఇంకా నయం. తనతోటే అది చెప్పాడు. ఎవరికీ విషయం తెలిసినా హర్షించరు సరికదా, అతన్ని తేలికగా వదలరు. ఇప్పుడెంతో ఆప్యాయతను కురిపించే తన తల్లి, ఇది తెలిశాక ఎంత చీదరించుకుంటుందో, గురువుగారి మాటపైన నమ్మకంతో ఏమాత్రం అనుమానం పెట్టుకోని తన తండ్రి ఎంత ఏవగించుకుంటాడో! "ఏరా కురుమయ్యా", అని ఆత్మీయంగా పిలిచే అతడి అప్పగారు కూడా వ్యతిరేకంగా మారవచ్చు.

ఇది అబద్ధమైతే! ఎదురుగా కనిపించే పచ్చి నిజాన్ని తను అబద్ధమని ఎలా నమ్మించగలదు? అతడు వచ్చినది మొదలు తన సంగీతంతో ఇంకో ఆలోచన లేకుండా చేశాడు. ఇప్పుడు తన పిచ్చి అభిమానంతో ఏం చేస్తాడో అంతుబట్టడంలేదు.

ఇన్నాళ్ళూ తనకెంతో విజ్ఞానాన్ని బోధించారు తమ ప్రయివేటు మాష్టారు. ఇన్నాళ్ళు సంగీతం నేర్పిన గురువుకంటే తనెందుకతడికి చనువివ్వాలి. మొదటి తప్పు తనది.

అలా ఎంతగా ఆలోచించినా, ఎంతగా నేరం తనపైన వేసుకుందామన్నా జరిగినది బాగా తెలుసు కల్యాణికి. కపటం ఎరుగని అతడు తన మనసులోని మాటను నిర్మొహమాటంగా వ్యక్తపరిచాడు.

ఇంతకూ రేపట్నుంచి పాఠం ఎలా జరుగుతుంది. నువ్వులేందే బ్రతకలేనని స్పష్టంగా చెప్పిన మనిషి ఎదుట నిత్యం మసలాలి. మసలినట్లయితే రెచ్చగొట్టినట్లేనా? "ఇదెంత మాత్రం మంచి పనికాదు!" అని ఆమె అంతరాత్మ హెచ్చరిస్తోంది.

"ఈ విషయం నా ఒక్కర్తెకే తప్ప ఇంకెవ్వరికీ తెలియదు. ఇంతటి ఆరాటంలో, మూడు రోజుల తర్వాత తన కోసం కొట్టుకు పోయిన అతడి ముఖం



ఆంధ్రపత్రిక పాఠకులకి చక్కటి అవకాశం!



# కళ్యాణవేదిక
## ఉచిత సమాచారం



### వధూవరుల సమాచారము ఉచితంగా ప్రతి బుధవారం ప్రకటిస్తాము. సమాచారం పంపేవారు ఈ దిగువ నిబంధనలు పాటించాలి.

- ★ వధువు / వరునికి సంబంధించిన వివరాలు సమగ్రంగా, అచ్చులో 150 అక్షరాలకు మించనట్లుగా తెలుగులోనే స్పష్టంగా వ్రాసి పంపాలి.
- ★ వధువు / వరుని తల్లిదండ్రులు, సంరక్షకులు తాము ఇచ్చే సమాచారము వాస్తవమని, ఎవరిని కించపర్చే విషయము అందులో లేదని హామీ ఇవ్వాలి.
- ★ సమాచారం పంపేవారి పేర్లు వగైరా రహస్యంగానే ఉంచబడతాయి. ప్రతి ప్రకటనకు ఒక బాక్సు నెంబరు కేటాయించి, వచ్చిన జవాబులు ఉచితంగానే వాటికి సంబంధించిన వారికి నెలరోజులలోపు పంపడం జరుగుతుంది.
- ★ ఈ శీర్షికను కుల మత వర్గ భేదాలు లేకుండా అందరూ ఉపయోగించుకోవచ్చును.
- ★ అందిన సమాచారము ప్రతి బుధవారం అవి అందిన వరుస క్రమంలో ప్రకటించబడుతుంది. వీటిని తిప్పి పంపే ప్రసక్తి లేదు. కాపున స్వంత అడ్రసు గల కవర్లు, లేదా స్టాంపులు జతపర్చకూడదు.
- ★ ప్రకటనకు ఏదైన అనర్హమైనదిగా తోచినపుడు దానిని వెయ్యకుండా ఆపు చేసే హక్కు పత్రికకు వుంటుంది.
- ★ ఇతర విధములైన ఉత్తరప్రత్యుత్తరములకు అవకాశం లేదు. ఫోటోలు పంపకూడదు.
- ★ సమాచారము పంపేవారు ఈ దిగువ కూపను పూర్తిచేసి, స్థానిక ఏజెంటుచే సంతకం చేయించి పంపాలి. కూపను జతపర్చనియెడల పరిశీలించబడవు.
- ★ కళ్యాణవేదిక శీర్షికద్వారా సంబంధం కుదిరి వివాహం జరిగిన వధూవరుల ఫోటోలు ఉచితంగా ఆంధ్రపత్రికలో ప్రకటించగలము. ఏ తేదీన ప్రకటన వెడినది తెలియచేస్తూ ఫోటోలు జతపర్చి "కళ్యాణ వేదిక ఫోటో ప్రచురణార్థం" అని వ్రాసి పంపవలెను.

### కళ్యాణవేదిక ఉచిత సమాచార కూపను

పేరు... ... ... ... ... ... ... ... ...

చిరునామా ... ... ... ... ... ... ... ...

... ... ... ... ... ...పిన్‌కోడ్... .... ...

స్థానిక ఆంధ్రపత్రిక ఏజెంటు సంతకం.........................

## రసరాగ వాహిని

నాకే తెలియని తృప్తినిచ్చింది." అని తెలియని ఉత్తేజంతో వీణముందు చతికిల పడింది.

మోహనరాగంలో తానం వాయించింది. వీణలో అందంగా పలికే తానం వాయించిన తర్వాత మనసుకేదో హాయిగా అన్పించింది. స్నానం చేసి దేముడికి మనసారా నమస్కరించింది. తన విద్యకు ఎటువంటి ఆటంకం కలుగజేయవద్దని ప్రార్థించింది.

మర్నాడు అతడు రాగానే ఏ భావం ముఖంలో కన్పడనీయకుండా ప్రశాంతంగా వీణముందు కూర్చుంది. అతడు కూడా గురువు బాధ్యతతోనే పలికాడు.

"కల్యాణీ! ఈ గొడవలో పడి నీకు పాఠం చెప్పలేదు. ఈ రోజు కొత్త పాఠం చెప్తాను. ఏ రాగం నేర్చుకుంటావు."

"కాఫీరాగం నేర్చుకోవాలనుంది." ముక్తసరిగా చెప్పింది.

"ఏ కీర్తన?" తిరిగి ప్రశ్నించాడు.

"ముందు ఆలాపన చేయండి. రాగస్వరూపం అర్థం చేసుకుంటాను." నీవల్ల గుణవేషమేమి." కీర్తన బాగుంటుంది."

"అలాగే కల్యాణీ!" అని ఆలాపన అందుకున్నాడు. ఆ రోజంతా అలా అలా నెమ్మదిగా అతన్ని ఆ ప్రపంచంలోనే ఉంచింది.

ఇలా కొద్ది రోజులు అలా జరిగింది. పాఠం పూర్తయేసరికి మాట్లాడడానికి అవకాశం ఇచ్చేదికాదు. ఈ దోబూచులాట ఎన్నాళ్ళో జరుగలేదు. పాఠం అవగానే లేస్తున్న కల్యాణిని ప్రశ్నార్థకంగా చూశాడు.

అయినా నిశ్చలంగా లోపలికి నడిచింది.

"అమ్మాయిగారూ! అదెందుకో పిలుస్తున్నాడు"! ఆమెవెంటే లోనికి వచ్చిన సింహాచలం అంది.

"ఎందుకో అడుగు" అంది మొండిగా.

"మీరే అడగండి. ఆడితో కష్టం సుఖం మాటాడితే గంటలు గడుస్తాయి. నాకు బోల్డు పనుంది."

ఇంక వెళ్ళక తప్పలేదు కల్యాణికి.

తల వొంచుకొని అతడి ఎదుట నిలబడింది.

"కల్యాణీ! నా ముఖం చూడటానికి ఇష్టంలేదా?"

అతడి ప్రశ్నకు తలెత్తి అతడి ముఖంలోకి తేరిపార చూసింది. ఇంకేం మాట్లాడలేకపోయింది.

"నేను నీవైపు కన్నెత్తి చూడటానికి కూడా అర్హతలేని వాడినని తెలుసు కల్యాణీ! నా ప్రాణంలాంటి నీ దగ్గర నాకు దాపరికంలేదు. నన్ను నీకు పాఠం చెప్పడానికి రానీయి కల్యాణీ! ఆ విధంగానైనా నీ దగ్గర ఉండవచ్చు."

తనదీ అదే కోరిక. పైకి చెప్పే ధైర్యంలేదు. అతడు చెప్పాడు. అదేతేడా.

"ఏం కల్యాణీ! మాట్లాడవేం? ఈ సారి మనకి విశాఖపట్నంలోనూ, బొబ్బిలిలోనూ కచేరీలొచ్చాయి. నువ్వు ఇవేం మనసులో పెట్టుకోక సాధన చేయి."

అలాగేనని తలూపి లోపలికి వెళ్ళిపోయింది.

కల్యాణికి యుక్త వయస్సు వచ్చింది. ఇంక పెళ్ళి ఆపడం ఎంతమాత్రం మంచిదికాదని బంధువర్గంలో నివారు వత్తిడి చేస్తున్నారు.

మంగక్కూడా ఇంక ఆపడం ఎందుకో నచ్చలేదు. కనీసం కల్యాణి కడుపున మగపిల్లాడు పుట్టినా పెంచుకోవాలని ఆమె అభిప్రాయం.

కల్యాణికైతే విసుగెత్తింది. తనకి జ్ఞానం వచ్చిన దగ్గర్నుంచి ఇదే గొడవ. కూర్మయ్య ఆలోచనలలో పడి పట్టించుకోడం కూడా మానేసింది. ఆమెకు ముందు తామిద్దరూ చేయబోయే కచేరీలు కళ్ళముందున్నాయి.

తనీసారి వెళ్ళకపోతే అతడు ఎత్తుకునైనా తీసుకెళ్తేటట్టున్నాడు. వినడు. నాకు నీ అంత పాండిత్యంలేదని మొత్తుకున్నా అతడి ధోరణి మారదు. తను అతడి ఎదురుగా ఉండాలి. అంతే! తండ్రి కూడా అంగీకరించాడు.

ముఖ్యకారణం - ఈసారి ప్రయాణంలో ఆమెకు సంబంధం ఖాయం

చేయాలి—ముందే ఉత్తరం వ్రాసారు.

కచేరీలు జయప్రదంగా జరిగాయి. సంబంధాలు మాత్రం కుదరలేదు. అందుకే బంధువులింట్లో ఇంకో పదిరోజులుండడానికి నిశ్చయించారు. ఎలాగైనా ఈ సంవత్సరం వివాహం చేస్తారని ఇంట్లోవారి చర్చల్తో పోల్చాడు కూర్మయ్య. అతడు కూడా తన స్నేహితుడింట్లో ఉండిపోయాడు.

కనీసం ఆమెకి సంగీతం చెప్తూనన్నా ఆమెను చూడవచ్చననుకున్నాడు. ఆ ఆశ ఎంత అడియాసో తెలిసింది. ఏ నాటికైనా తను ఆమెను విడిచి ఉండక తప్పదా?

ఆ ఊహే భరించలేని తను తట్టుకోగలడా? తనవైపు చూస్తూ కళ్యాణి ప్రకటించే భావం తనకి తెలియదా? ఆమెని తన స్వంతం చేసుకోకుండా తను ఉండలేడు. తన గుండెలో ఆమె రూపు ఏనాడో ప్రతిష్ఠింపబడింది. తన హృదయంలో నుండి ఆమెను కదిలించడం ఎవరితరమూ కాదని తనకు స్పష్టంగా తెలుసు. ఆమె ఎంత సౌజన్యమూర్తో తనకు తెలుసు.

ఏనాడూ ఒక్క పరుషవాక్యం కూడా ఆమె నోటినుండి వినిఎరుగడు

ముఖ్యంగా ఎంత సోకితేనే కందిపోయేంత సున్నితమైనది కళ్యాణి. ముఖం జిడ్డోడుతూ పనికే ఆమెను పరిమితం చేయకూడదు. కళ్యాణి తనది. ఎలాగైనా ఆమెను ఇంకొకరికి స్వంతం కానీయకూడదు.

అందుకనే తన స్నేహితుడింటనే ఆమె ఉన్నన్నాళ్ళూ ఉండదలచుకొన్నాడు.







తన స్నేహితుడితో చెప్పాడు. అతడు వెంటనే తిట్లకు లంకించుకున్నాడు.

"ఏరా! నీకు మతిపోయిందా? ఆమె అంతెక్కడ? నీ అంతెక్కడ!"

"చాల్లే! డబ్బుంటే సరిపోదు. ఆమె విద్య రాణించాలంటే నేను తప్ప ఇంకెవ్వరూ ప్రోత్సహించరు."

తన ధోరణిని అతడెంత మాత్రం విడువలేదు.

"మరి ఏం తింటారు? ఎక్కడుంటారు?" వ్యంగ్యంగా అడిగాడు స్నేహితుడు.

"ఏరా! నేను నమ్మిన ఈకళ; నేను ఉపాసించిన ఈ కళ నాకింత తిండి పెట్టదా? పోనీ ఈ కళామతల్లి ఈ బిడ్డను నిర్లక్ష్యం చేసినా, శ్రమజీవుల కుటుంబంలోంచి వచ్చాను. ఈ నేలతల్లి ఈ పొట్ట పోసుకోగానికి ఇన్ని గంజినీళ్ళు త్రాగే భాగ్యం కలుగ జేస్తుందిలే!"

"బావుందిరా, చాలా బాగుంది. నువ్వంటే కష్టజీవివి. కష్టపడగలవు. గంజినీళ్ళు త్రాగైనా సరిపెట్టుకోగలవు. ఆమె మాటేంటి. నువ్విచ్చే ప్రేమతోనే కడుపు నింపుకుంటుందా?"

మళ్ళీ అదే వంగ్యం స్నేహితుడి గొంతులో. కూర్మయ్యకి ఉడుకుమోత్తనం వచ్చింది. ఉద్రేకం పట్టలేక పోయాడు.

"ఒరే నీకంత లోకువగా ఉందంటే నేనసలు చెప్పక పోదును. ఒక కళాకారిణిని వారు భరిస్తారంటే నాకు నమ్మకంలేదు. కళ్యాణి నాదికాసప్పుడు నేను తట్టుకోలేనురా..."

ఇంకా ఇంకా అతడు ఉద్రేకపడకుండానే అతను ఆపాడు.

"ఊరికే అన్నానురా! నీకంత ప్రాణ సమానమైన అమ్మాయిని వదులుకోవద్దులే.... ఒక మగాడిగా నేను మాత్రం నీ పిరికితనాన్ని సమర్థించను. ఆడదానికి నీడ ఇచ్చే వ్యక్తిత్వం ఉండాలికాని, ఇలా ప్రాణం తీసుకుంటాననడం ఏంబాగుంతలేదు."

"నీకేం తెలుసురా! నీకూ ఇటువంటి పరిస్థితే ఎదురైతే తెలుస్తుంది."

"సరేలేరా! మన స్నేహితుడు మద్రాసులో ఫిల్మ్ కంపెనీలో స్థిరపడ్డాడుకదా! ఏదైనా అవకాశం ఇస్తాడేమో ఉత్తరం వ్రాయి" అని ఓదార్చాడు.

"భగవంతుడా! మమ్మల్నిద్దర్నీ విడదియ్యకు. ఆమెకే సంబంధం కుదరనీయకు." అని మొక్కుకున్నాడు.

ఆ ఊపులోనే సినిమాల్లో పని చేస్తున్న మిత్రుడికి ఉత్తరం వ్రాశాడు. అతడికి తెలియకుండానే కళ్యాణి ఉంటున్న బంధువుల ఇంటికెళ్ళాడు.

"కళ్యాణి మేడ మిదుందండీ! వాళ్ళమ్మగారు ఒంట్లో నలతగా ఉందని ఆస్పత్రికి వెళ్ళారు." అన్నారు బంధువుల తాలూకు మనిషి.

గదిలోకి అడుగు పెడుతుండగానే మల్లెల వాసన గుప్పుమని సోకింది. ఎటువంటి వారినైనా మత్తెక్కించే ఆ వాసన ఉద్రేక స్వభావులకు సోకితే ఇంకేమన్నా ఉందా... వెనుక నుండి తెల్లని పట్టు చీరలో కళ్యాణి నిండుగా కన్పించింది. బాల్యంవీడిన యవ్వనం చీరలో నిండుగా కన్పించింది. వెనుకనుండి ఆమె కళ్ళు మూసాడు. చేతికి తడిగా తగిలింది. ఆమెని తనవైపు తిప్పుకొని,

"ఎందుకా కన్నీరు! ఒంటరిగా ఇద్దరమే ఉన్నప్పుడు నీ కెన్నో చెప్పాలనుంది. నిండు యవ్వనం చీరలోంచి కన్పిస్తుంటే మాటలేం చెప్పాలనిలేదు."

విశాలమైన వక్షస్థలానికి ఆమెను అదుముకొన్నాడు. అతని బలిష్టమైన చేతిలో ఉక్కిరి బిక్కిరిగా ఉంది. ఏమిటో భయంగా, కొత్తగా ఉన్నా, ఆ గాఢ పరిష్వంగాన్ని వదలలేక పోయింది. అతని కరస్పర్శ జన్మ జన్మల నుండి ఎరిగినదిగా ఉంది.

"కళ్యాణీ నేను మొరటువాడ్నని ఇష్టపడవనుకున్నాను. నువ్వుకూడా ఈ ఎడబాటు భరించలేకుండా ఉన్నావుకదూ?"

ఆమె ముఖాన్ని తనవైపు తిప్పుకొని, ఆమె మెడ వంపులో తన ముఖాన్ని దాచుకొని, ఆమెను చుట్టేశాడు.

"ఇప్పుడే పెళ్ళిచూపులు జరిగాయి."

ఎలాగో నోరు పెగల్చుకుని అన్నదామె.

ఆమెను మరింతగా అదుముకున్నాడు. ఆమె ముఖమంతా ముద్దులతో ముంచెత్తాడు.

"నువ్వు, ఇంకొకరిని చేసుకుంటావా కళ్యాణీ. నిన్ను ఇంకొకరితో కలలో కూడా ఊహించుకోలేను. నేను నా స్నేహితుడి దగ్గరకు వెళ్తాను. సంగీత రంగంలో దొరకక పోతే, ఏ చిన్న ఉద్యోగమైనా చేస్తాను. నీ కిష్టమేనా కళ్యాణీ?"




**డి. ఆర్. – పిఠాపురం**

నా గొంతు సరిగ్గా రాదు. బొంగురుగా వుంటుంది. ఇ. ఎన్. టి. డాక్టర్‌కి చూపిస్తే పరీక్షించి స్వరపేటిక పూడుకు పోయింది అని చెప్పారు. మందులు వాడినా ఫలితం కన్పించ లేదు. దీనికి ఆపరేషన్ అవుసరమా? మైనర్ ఆపరేషనా? మేజర్ ఆపరేషనా? ఖర్చు ఎంతవుతుంది తెలుప ప్రార్థన.

**ఇ.ఎన్.టి. వైద్యులు ఏమీ చెయ్యలేము అని చెప్పిన తర్వాత మిగతా వారు ఏమి చెయ్యగలరు? నిర్ధారణ కొరకు పెద్ద పట్టణాలలోని మెడికల్ కాలేజీలలో చూపించండి.**

**జి. వి. – మార్కాపూర్**

హిప్నాటిజంతో నత్తిని లేకుండా చేయవచ్చు నని కొన్ని వ్యాపార ప్రకటనలలో చదివాను. ఇది సాధ్యమా. స్పీచ్ తేరపిస్టుల వల్ల ఎక్కువ లాభమా? మైసూరు హాస్పటల్‌లో మీకు తెలిసిన వారున్నారా?

**★ హిప్నాటిజం గురించి నాకు తెలియదు. స్పీచ్ తేరపిస్టుల వల్ల చాలా మటుకు లాభం ఉంటుంది. మైసూరులోని ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ స్పీచ్ అండ్ హియరింగ్‌లో డైరక్టరుని కలవండి. ఎవరి రికమెండేషనూ అక్కరలేదు. అంతగా అవసరం అయితే ఆంధ్రపత్రికలో చదివాము అని చెప్పండి. అక్కడ నాకెవ్వరూ ప్రత్యేకంగా తెలిసిన వారు లేరు.**

**కె. – ఖమ్మం**

నా వయస్సు 40 సం. లు. మాది మేనరికం. ముగ్గురు పిల్లలు. ఈ మధ్య నా భార్య కేన్సర్ వల్ల చనిపోయింది. నా అత్తవారు, తల్లిదండ్రులు నా మరదల్ని ఇచ్చి చెయ్యాలని బలవంతం చేస్తున్నారు.

నాకూ ఒక తోడు కావాలి. సవతితల్లి పోరువల్ల పిల్లల జీవితం అంధకారం అవుతుందని – గొడ్రాలిని చేసుకోవాలని నా జీవితాశయం. అందువల్ల నేను నా మరదల్ని చేసుకోవాలా? లేక బయటి సంబంధం చేసుకోవాలా? గొడ్రాలని ఎలా తెలుసుకోవటం?

**★ ఇతరులను గొడ్రాలుగా చెయ్యాలనుకోక పోతే మీరే వేసెక్టమీ ఆపరేషన్ చేయించుకోవచ్చుగా!**

**ఎ. పి. డి. – ఆరుమూరు**

నాకు తరచు నోటిపూత వస్తుంది. ఇది నాకు చిన్న తనము నుండి వస్తున్నది. నాలుకపైన, చివర్ల, పెదవుల మీద, చిగుళ్ల మీద తెల్లని మచ్చలు ఏర్పడతాయి.

**★ వెంట వెంటనే వచ్చే నోటిపూతకు కారణం ఫలానా అని ప్రస్తుతం తేల్చి చెప్పటం కష్టం. బి. కాంప్లెక్స్ విటమిన్ లోపం వల్లగాని, మానసిక ఆందోళన వలన గాని ఇలా జరుగ వచ్చునని అంచనా. ఈలక్షణం వున్నవారు లోనికి బి. కాంప్లెక్స్ మాత్రలతో పాటుగా, ఆ పూతపూసిన చోట ఒక శాతం సిల్వర్ నైట్రేట్ ద్రవాన్ని పై పూతగా అద్ది వెంటనే ఉప్పు కలిపిన నీటితో పుక్కిలించి ఉమ్మివేయాలి. రోజుకి రెండు సార్లు వంతున వరుసగా మూడు రోజులు ఇలా చేయాలి.** □

## రసరాగ వాహిని

ఆమెను ఊపిరి తిప్పుకోనీయకుండా చెప్పుకు పోతున్నాడు.

కల్యాణి విరక్తిగా, దిగులుగా నవ్వింది.

"లేదండీ! అవన్నీ జరగనివి. అందుకే నేను మీకు మాట్లాడడానికి అవకాశం ఇవ్వలేదు. నేను దూరంగా జరిగేకొద్దీ మన సంబంధం మరింత దగ్గరైంది. ఇంకా దగ్గరవడం మంచిదికాదు."

కల్యాణిని వదిలి ఆమెవైపు సూటిగా చూస్తూ.

"ఏమిటి నీ ఉద్దేశ్యం? నేను నిన్ను మోసం చేస్తాననుకున్నావా కల్యాణీ? పెళ్లయిన వరకూ దూరంగా ఉండలేననుకున్నావా? నువ్వీ సంబంధానికి అంగీకరించకు. నువ్వు నాకే స్వంతం. ఇంకెవరు నిన్ను తాకినా నేను బ్రతకను. తెలుసా?"

ఇంతలో ఎవరివో అడుగుల చప్పుడు వినిపించాయి. వారి సంభాషణకు అంతరాయం కలిగింది. అతడు మరునాడు కూడా వచ్చాడు. కల్యాణి తల్లికి ఏవో మందులు, ఇంజక్షన్లు వాడాలి ఇంకో వారం రోజులుండాలన్నారు. ఆమె ఆస్పత్రికి వెళ్లింది. ముందు రోజులాగే కల్యాణి ఒక్కతే ఉంది. బంధువులది పెద్ద కుటుంబం. కళ్యాణి నడవడి వారికి ఎటువంటి అనుమానం రానీయలేదు.

ఇద్దరూ సంగీతం గురించి మాట్లాడుకొని, సాధన చేస్తారనే వారి అభిప్రాయం.

"కల్యాణీ! నిన్నటితోనే నువ్వు నాదానివని తెలిసింది. ఇంక నువ్వూ నేనూ వేరు ఎన్నటికీకాము."

"వద్దు! వద్దు! దయచేసి ఆ ప్రసక్తి వద్దు." అనాలనుకున్న ఆమె మాటలు నోటి చివరి వరకూ రాలేదు. మనిషి మాత్రం ఒదిగి అతడి ఒడిలో తలదాచుకున్నది.

"నీ కుటుంబపు కట్టుబాట్లు నాకు తెలుసు కల్యాణీ! అయినా నా మనసు నువ్వే కావాలంది. నన్ను నేను అదుపుచేసుకోలేను."

"నీ మనసు నీ అదుపులో ఉండకపోయినా నాకేం నష్టం లేదు"

ఒక్కో మాట నెమ్మదిగా అంది.

"అయితే కేవలం నా బలవంతమేనా? నీకు నేనంటే ఇష్టంలేదా?"

"నిన్ను చూడగానే నా ముఖంలో విరిసిన ఆనందం, నీ ఒడిలో కరిగిన ఈ క్షణం శాశ్వతం కావాలని నాకూ ఉన్నది. అయినా జరగని పని." అనుకుంది.

"ఏం కల్యాణీ! మాట్లాడవు. నేనంతగా నీకోసం కొట్టుకు పోతుంటే నీకు లోకువగా ఉందా?" అన్నాడు.

దాచినా దాగని అతడి ఉద్రేకం ఆమెను నిలవనీయలేదు. నిస్సహాయత అశ్రురూపంలో ఉరికింది. అతడు ముందుకు జరిగి-

'ఏం కల్యాణీ! ఎందుకు ఆ విచారం. నీలోని అణువణువూ నా కోసం. నాలో లీనమవడానికి ఎంతగా ఉరకలు వేస్తుందో నాకు తెలియదనుకున్నావా?" అన్నాడు ఆమె గడ్డం పట్టుకుని లాలనగా ఆమెకేసి చూస్తూ.

ఆమె మాట్లాడలేదు. ఒక్కక్షణం జారినా ఇంకెన్నడూ అతడ్ని చూడలేనేమో అన్నంత ఆరాటంగా గుడ్లప్పగించి ఉండిపోయింది.

"కల్యాణీ! ఏమైంది కల్యాణీ! ఎందుకలా స్తబ్దంగా ఉన్నావు? ఇలారా" మళ్లీ అతడు తన ఎదపైకి లాక్కున్నాడు.

"ఇతడి బాహువుల్లో తనకి కంచుకోటలో ఉన్నంత సురక్షితంగా ఉన్నది. పాలు నీళ్లలాగా తనూ అతడూ కలిసి పోగలరు. ఈ క్షణం ఇలాగే శాశ్వతంగా ఉంటే ఎంత బాగుండును."

"కల్యాణీ! నీకేం భయంలేదు. నిన్ను నేను విడిచిపెట్టను. నువ్వు నీ వీణను నేను బ్రతికున్నంత వరకూ విడవనక్కర్లేదు. నా మాట నమ్ము. ఎందుకంత దిగులు. నేనెక్కడికి పోతాను. నీకంటి పాపల్లో గూడుకట్టుకొనే ఉంటాను." అని ఎన్నో విధాల ఆమెను లాలించి వెళ్లాడు.

(ఇంకా ఉంది)



- జన్యు నిర్మాణం
(డి.ఎన్.ఎ. గొలుసు నమూనా!)

# వంశ పారంపర్యంగా సంక్రమిస్తున్న వ్యాధులను జన్యు చికిత్స అడ్డుకొంటుందా?

జన్యు చికిత్సని గురించి నేడు ప్రపంచ వ్యాప్తంగా ఎంతో మంది చర్చిస్తున్నారు. ఊహాతీతంగా జన్యుచికిత్స విధానంలో మార్పులు వస్తున్నప్పటికీ సందేహాలు కూడా పెరిగిపోతున్నాయి. వంశ పారంపర్యంగా వచ్చే కొన్ని వికృత వ్యాధులని జన్యుచికిత్స ద్వారా నయం చేయవచ్చునని శాస్త్రజ్ఞులు ప్రకటించడం ఆశాజనకంగానే తోస్తుంది కాని – మానవ జీవకణంలోని క్రోమోజోమ్‌లో లక్షకు పైబడి జన్యువులు ఉంటాయని, వాటిలో ఏ జన్యువు లోపిస్తే ఎలాంటి రుగ్మత వస్తుందో అన్నది ఇంకా సందేహంలోనే ఉందని, ఇప్పటి వరకు కేవలం మూడు వేల జన్యువుల వరకు మాత్రమే అవి లోపిస్తే ఎలాంటి విపరీతాలు కలుగుతాయన్న అంశం అరకొరగానే తెలిసిందని – అనుకుంటే మాత్రం ఎంతో ఆందోళన కలుగుతుంది. అసలు జన్యువుని ఎలా నిర్దేశించాలి, ఎలా వెలికి తీయాలి, ఏ విధంగా దేహకణంలోకి ప్రవేశ పెట్టాలి – అన్న విషయాలన్నీ సందిగ్ధంగానే ఉన్నాయి.

అసలు జన్యువు అంటే ఏమిటి? అని ఎవరైనా ప్రశ్నిస్తే స్పష్టంగా సమాధానం చెప్పగల పరిస్థితి శాస్త్ర వ్యవస్థలో ఉందా అనేది అనుమానాస్పదమే. క్రోమోజోములపై పూసల మాదిరి ఉండే క్రోమోమియర్‌లని ఒకప్పుడు జన్యువులను కొన్నారు. ఆటు తరువాత జన్యు పదార్థాలుగా కేంద్ర కామ్లాలను గుర్తించారు. ఈ ఆమ్లాలలో – డీ ఆక్సీరైబో న్యూక్లియిక్ ఆమ్లం, కానివ్వండి. రైబో న్యూక్లియిక్ ఆమ్లం కానివ్వండి – ఉండే విశిష్ట నిర్మాణాలే వంశపారంపర్య లక్షణాలను ప్రతిబింబించే బ్లూప్రింట్‌లన్న భావం బలపడింది. ఈ విశిష్ట నిర్మాణాలు అందరిలో ఒకే విధంగా ఉండే అవకాశమే లేదు. నత్రజని క్షారాల అమరికలు భిన్నభిన్నంగా ఉండడమే దీనికి కారణం. డీ ఆక్సీరైబో న్యూక్లియిక్ ఆమ్లం (డి. ఎన్. ఎ.) రసాయనిక సంఘటనం తెలిసినా, ఆ అణువులోని పరమాణువుల ప్రాదేశిక అమరికలు తెలిసినా వ్యక్తి వ్యక్తిలో ఆ అణువు ప్రదర్శిస్తున్న వైవిధ్యానికి పరిమితి తెలియడం లేదు. ఆ అణువు సూక్ష్మ నిర్మాణాలు తెలుసుకున్నా స్థూల శరీర ధర్మాల ననుసరించి మారిపోయే దాని నడవడికి సంబంధించి ఇంతవరకూ స్పష్టమైన సమాధానం దొరకడం లేదు.

మరి జన్యువంటే ఏమిటి? అనేది సందేహంగానే ఉండిపోతుంది. ఎంతో నిడివి ఉండే డి. ఎన్. ఏ. అణువును కొన్ని భాగాలుగా విభజించుకొంటే (దీనినే రెల్ప్ పద్ధతి అని అంటున్నారు!) ఒక్కొక్క భాగాన్ని ఒక్కొక్క జన్యువు అని అనుకోవచ్చు. విభజించే పద్ధతి డి. ఎన్. ఏ. అణువును సాధ్యమైనన్ని సమభాగాలు చేయడం అనే ఆలోచన మీద ఆధారపడి ఉంటుంది. ఇది సరైన పద్ధతి కాదు కాని ప్రస్తుతానికి ఈ పద్ధతే అర్థవంతంగా ఉన్నట్లు తోస్తుంది. జన్యువుని స్ఫుటంగా వేరు చేయగలిగితే "అద్భుతాన్ని సాధించినట్లే" అని కాలిఫోర్నియాకి చెందిన బయోటిక్నాలజీ నిపుణుడు జాన్ బాక్‌స్టర్ అనడం ఎంతైనా సమంజసం.

జన్యువు విషయంలో స్పష్టమైన అవగాహన లేకపోవచ్చును కాని జన్యు చికిత్స విషయంలో మాత్రం పొరపాటు పడే అవకాశం లేదు. జన్యువుని నిర్ణయించుకోవడానికే ఎంతో శ్రమపడాలి. పరిమిత నత్రజని క్షారాలను ప్రమాణాలుగా కలిగి ఉన్న డి. ఎన్. ఏ. భాగాన్ని పూర్తి జన్యువుగా స్వీకరించాక జన్యుచికిత్స నెరపడం పెద్ద కష్టం కాదు. అయితే ఈ చికిత్స వల్ల చెడు పరిణామాలు కలుగకుండా తగిన జాగ్రత్తలను తీసుకోవలసిన అవసరం జన్యుశాస్త్రవేత్తల మీద ఎంతైనా ఉన్నదనే అంశాన్ని మాత్రం విస్మరించడానికి వీలులేదు.

వంశ పారంపర్యంగా వచ్చే రకరకాల జబ్బులని నయం చేయడానికి జన్యు చికిత్సని మించింది లేదని కేంబ్రిడ్జిలోని "వైట్ హెడ్ ఇన్‌స్టిట్యూట్ ఫర్ బయో మెడికల్ రిసర్చ్"కి చెందిన జన్యు శాస్త్ర నిపుణుడు ఇహార్ లెమిన్‌కా ప్రకటించడంలో ఆశ్చర్యం ఏమి లేదు. రక్త లేమి, మధుమేహం వంటి సర్వసాధారణమైన వ్యాధులు, కాన్సర్‌లలో కొన్ని రకాల వాటిని జన్యుచికిత్స నయం చేయగలదు. ఈ వ్యాధులే కాక కొన్ని ప్రత్యేకమైన ఎంజైమ్‌లు లోపించడం వల్ల కలిగే వ్యాధులు కూడా జన్యుచికిత్స ద్వారా నివారించబడే అవకాశం ఉంది.

లెయిస్ – నైహాన్ వికృత వ్యాధి ఒకటి. ఈ వ్యాధిగ్రస్తులు తమ వేళ్ళనీ, చేతులనీ, భుజాలనీ, కాళ్ళనీ, వేటిని పడితే వాటిని – అందుబాటులో ఉన్న వాటిని – కరకరమని నమిలి వేస్తారు. అందుకే ఈ వ్యాధిగ్రస్తుల పళ్ళని పూర్తిగా పీకి వేయడం

జన్యు చికిత్స ద్వారా సూడో రాబిస్ వాక్సిన్ తయారుచేసి పంది పిల్లలకు వేస్తున్న దృశ్యం



# జన్యు చికిత్స

జరుగుతుంది. ఈ వ్యాధి సోకిన వాళ్ళు 20 సంవత్సరాలకి మించి బ్రతకరు. ఈ విచిత్రమైన వ్యాధి సోకడానికి కారణం కేవలం ఒక ఎంజైమ్ లోపించడమే అని వింటుంటే ఆశ్చర్యంగా ఉంటుంది కాని, అది వాస్తవం! హైపోక్సాంథిన్ గుయనిన్ ఫాస్ఫొ రైబొసిల్ ట్రాన్స్ ఫెరజ్ అనే ఎంజైమ్‌ను తయారు చేసే జన్యువు దెబ్బతినడం వల్ల యూరిక్ ఆమ్లపు నిలువలు ఊపిరితిత్తులలో, కీళ్ళసంధులలో పేరుకొనిపోయి ఈ విపరీతమైన వ్యాధికి దారి తీస్తుంది. ఏ జన్యువు అయితే దెబ్బతిందో ఆ జన్యువుని వ్యాధిగ్రస్తునికి అందజేస్తే కావలసిన ఎంజైమ్ తయారవుతుంది. యూరిక్ ఆమ్లపు నిలువల ప్రసక్తి సమసిపోతుంది. ఫలితంగా వ్యాధి నయమైపోతుంది. ఆలోచన వరకు అద్భుతంగానే తోస్తోంది. ఆచరణ ఎలాగ అన్నదే ముందున్న ప్రధానమైన సమస్య! జన్యుచికిత్స పేరుతో వ్యాధిగ్రస్తులపై ప్రయోగాలు నెరపడం నేరమవుతుందని వాషింగ్‌టన్‌లో ఉన్న "కెన్నెడి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎతిక్స్" నిపుణులు అంటూనే ఉన్నారు. బాబూన్ కోతి గుండెను బేబీ ఫీకి మార్పిడి చేసినట్లు జన్యువులని మార్పిడీ చేయడానికి వీలు లేదని గట్టిగానే చెబుతున్నారు. ఈ విషయాలని అటుంచి జన్యుచికిత్స ఎంత వరకు ప్రమాణీకరించ బడిందన్న అంశాన్ని ఆలోచించడం సబబుగా ఉంటుంది.

జన్యువుని వెలికి తీయడం గుండెనో, కాలేయాన్నో వెలికి తీసినంత సులభం కాదు. మొక్కలకి అంట్లు కట్టినంత తేలిక కాదు. ఎంతో క్లిష్టతతో కూడుకొన్న అంశం. జన్యువును స్వీకరించడానికి ప్లాస్మిడ్ కాని, వైరస్ కాని ఏదో ఒకటి అవసరం. వైరస్‌ని ఎన్నుకొనేటప్పుడు దాని నించి మనిషికి ప్రమాదం కలుగకుండా చూడాలి. వైరస్‌లోని జన్యు పదార్థాన్ని పూర్తిగా తొలగించి – మనిషికి సంబంధించిన ఎముక మూలుగులోని ఏదైనా ఒక ఆరోగ్యకరమైన కణంలోని జన్యువుని ఆ వైరస్‌కి తరలించి – మొదట జన్యువుల సంఖ్యను పెంచుకోవాలి. ఇలా పెంచుకొన్న జన్యువులను వ్యాధిగ్రస్తుల ఎముక మూలుగులోని అనారోగ్య కణాలకు చేరవేయాలి. ఈ చేరవేయడంలో వైరస్ ఉపకరిస్తుంది. అయితే ఈ వైరస్ వల్ల అపకారం ఏమి ఉండదు. ఎందుకంటే దానికి సంబధించిన స్వంత జన్యు పదార్థాన్ని తయారు చేసుకొనే శక్తిని అది కోలుపోయి ఉంటుంది కాబట్టి! క్రొత్తగా జన్యువు చేరడం వల్ల అనారోగ్య కణం ఆరోగ్య కణంగా రూపొంది వ్యాధి నయమయ్యే అవకాశాన్ని కల్పిస్తుంది. వైరస్‌ని జన్యువుల సంఖ్యను పెంచుకోవడానికి మాత్రమే ఉపయోగించడం గమనించవలసిన అంశం!

ఇది జన్యుచికిత్సకి సంబంధించిన పరికల్పన. అన్నీ ప్రయోగాల స్థాయిలోనే ఉన్నాయి. వైట్ హెడ్ ఇన్‌స్టిట్యూట్ నిపుణుడు రిచర్డ్ ముల్లిగన్ చుంచెలుకలలో జన్యుచికిత్సని విజయవంతం చేసాడు. అలాగే శాన్‌డిగోకి చెందిన జన్యుశాస్త్రవేత్త డబ్ల్యు. ఫ్రెంచ్ ఆండర్‌సన్ జన్యుచికిత్సని రీసెస్ తెగ కోతులలో తృప్తికరంగానే నిర్వహించాడు. ఇదే పద్ధతిని మనుషులకి కూడా ఉపయోగించాలి. పరిశోధనలు కొనసాగుతునే ఉన్నాయి. ఇలా చేయడం వల్ల విపరీత మనస్తత్వం కల భావితరం రూపొందే అవకాశం ఉందని కొందరు అంటున్నారు. అయితే జరుగుతున్న చికిత్సలు దేహ కణాలకి సంబంధించినవే కాని సెక్స్ కణాలకి సంబంధించినవి కావు కనుక అలాంటి భయం అనవసరం. పైగా జన్యు వ్యవస్థ మొత్తం మారడం లేదు. దేహకణంలోని లక్ష జన్యువులలో ఒక్క జన్యువు మాత్రమే సరిజేయబడుతోంది. కాబట్టి భావితరాన్ని ఊహించుకొని ఆందోళన చెందడం అసందర్భమైన విషయంగానే తోస్తుంది. మొత్తం మీద జన్యుచికిత్స అనుకొన్న విధంగా ఆచరణలోకి రాగలిగితే ఎన్నో శతాబ్దాలుగా మనలని వేధిస్తున్న వంశ పారంపర్య వ్యాధులకి గట్టి దెబ్బ తగులుతుందని ఆశించడంలో పొరపాటేమి ఉండబోదు.

–డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు



## కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య **చిన్నదిగా, క్లుప్తంగా** వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ **మీదే** పేరూ, వూరూ అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామాగల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పి పంపడం జరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నిగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది. పరిశీలనకు ఐదారు వారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు – బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

## సబర్మతిలో బాంబు !

అహమ్మదాబాదు స్టేషనులో ఆగిన సబర్మతి ఎక్స్‌ప్రెస్ రైల్లోని వో బోగీలోని పాయఖానాలో వో బాంబు కనుగొన్నారట పోలీసులు లేవెటరి శుభ్రపరచడానికి వెళ్ళిన వ్యక్తి అది చూసి, భోగీలో వారిని హెచ్చరించి అనక రైల్వే అధికారులకు తెలియ జేశాడట

## ప్రతిఘటన !

మధుర మీనాక్షిపురంలో తంగరాజు అనే అతను 1983లో సత్య అనే ఆమెను వివాహం చేసుకున్నాడట ఆనాటినుంచీ పెళ్ళిలో ఆమె తండ్రి యిచ్చిన కట్నం చాలదనీ, యింకా తెమ్మని రోజూ అతనూ, అతని తల్లీ, అప్పగారూ ఆ సత్యను వేధించుకు తినసారంభిస్తే ఆమె ప్రతిఘటించి పోలీసు రిపోర్టిచ్చిందట

## ఆకాశవాణీ అసందర్భ ప్రకటనలు !

తిరుచందూర్ మురుగన్ "సూర సంహారం" వుత్సవాలలో ఆ కోవెలలో జరిగే పూజా విశేషాలను తిరునల్వేలి ఆకాశవాణీ తన శ్రోతలకు వినిపిస్తూ మధ్య మధ్యలో తలనొప్పా- డిం డిం డింగ్- దగ్గూ, ఆయాసమా... డిం డిం డింగ్- అంటూ ప్రకటనలు తడవ తడవగా వేసిందట భక్తులందరూ భగవంతుడైన సుబ్రహ్మణ్యేశ్వరుణ్ణి మనసారా దర్శనం చేసుకుంటున్నారు అని చెప్తూ తకాలున అత్యంత రుచికరమైన కోడి బిరియాని కావాలంటే ఫలానా హోటలుకు విచ్చేయండి అని శలవిచ్చిందట ఈ అసందర్భపు వ్యాపార ప్రకటనల మీద భక్తులు




కినుక వహించి సూరసంహారపు దినాన కటిక ఉపవాసముండి, భగవన్నామస్మరణ చేసుకునే సమయంలో కోడి బిరియానీ వ్యాపార ప్రకటనను ఆలయపు వేడుకల ప్రకటనల్లో కలపడం దారుణమనీ, ఆకాశవాణి క్షమాపణ కోరాలనీ అన్నారట- నాచురల్లీ

## సర్పంచ్ హత్య

రైల్వే కోడూరుకు చెందిన సెట్టిగుంట గ్రామ సర్పంచ్ సుబ్రహ్మణ్యం అనే ఆయనను ఎవరో కత్తితో పొడిచి చంపి, పారిపోయారట.

## ప్రియుడ్ని పోలీసులకి అప్పగించిన ప్రేయసి!

శ్రీవిల్లిపుత్తూరు మాగైచేరి అనే గ్రామానికి చెందిన 26 ఏళ్ళ సవుక పాండియన్ తనకు పెళ్ళయిన విషయం రహస్యంగా వుంచి అదే వూరుకు చెందిన 18 ఏళ్ళ షణ్ముకత్తాయ్ అనే అమ్మాయిని ప్రేమించి, ప్రేమింప చేసుకుని, అనక వో మెట్టు పైకెళ్ళి కామించి, కామింప చేసుకుని, ఆమెను ఆవేశపరచి, ఉద్రేకపరచి, తన కామవాంఛ తీర్చుకున్నాడట. దీనిఫలితంగా ఆమె గర్భవతి అయ్యేసరికి ఆమెతో అసలు విషయం చెప్పేశాడట. ఆమె అబలగా వూరోక్క శ్రీవిల్లిపుత్తూరు పోలీసులకు రిపోర్టు చేసి అతన్ని ఖైదు చేయించిందట.

## సిగరెట్ల దొంగ రవాణా!

విదేశాల నుంచి మన దేశానికి దొంగతనంగా రవాణా అయ్యే వస్తువులలో అతి ముఖ్యమయినది సిగరెట్టుట. ఏటికి సుమారు 300 లక్షల సిగరెట్లు ఎంచక్కా దొంగ దారులగుండా మన దేశానికి చేరుతున్నాయట. లండన్ "డ్యూటీ ఫ్రీ" (విమానాశ్రయంలో) వెలలో మారల్‌బరో అనే అతి గొప్ప సిగరెట్లు 200 సిగరెట్లు 130 రూపాయల వెలట! అంత తక్కువా!

## అఘాయిత్యపు మొగుడు

సాత్తూరు కేమేట్టుపట్టి అనే గ్రామానికి చెందిన తంగవేలు అనే వో కామరాజు ఒకామెను ప్రేమించి ఆమెను ఇంటికి తెచ్చాడట. ఎవరీమె అని భార్య అడిగితే ఆమెను తాను పెళ్ళి చేసుకోబోతున్నట్టు ప్రకటించి, మీ ఇద్దరూ కలిసి అన్యోన్యంగా యిక నుంచి కాపురం చేయాలి. మన ముగ్గురం మొగుడూ పెళ్ళాలం అని శలవిచ్చాడట. దానికామె ముడియాదు అని ప్రతిఘటించేసరికి కోపంతో తంగవేలు తన ముగ్గురు పిల్లలలో చేతికందిన యిద్దరు పిల్లలకు విషమిచ్చి చంపేశాడట.

## ఎవడి వెర్రి వాడికానందం!

ఆస్ట్రియా ప్రభుత్వం అలనాటి నియంత హిట్లరు వుపయోగించిన టీ సెట్టును వేలాం వేస్తే ఆ వేలం వెర్రిలో ఒహాయన దానిని 18 కోట్ల 20 లక్షల రూపాయలు (మన లెక్కలో) యిచ్చి పాడి, సొంతం చేసుకున్నాడట- ఆహా! ఆ కుబేరరావెవరో కదా!

## స్వీడన్‌లో వాత్సాయనులు!

మనిషికి అన్ని వుత్సాహాలకన్నా కామోత్సాహము చాలా ముఖ్యమని, దీనివల్ల శరీరంలో వుత్తేజం పుడుతుందని, కామం తీరాక శరీరానికి విపరీతమైన తృప్తి, హాయి వసు ందని, కనుక మనిషికి ఏ వయస్సులో నయినా సెక్సు చాలా ముఖ్యమని స్వీడను విజ్ఞానులు ప్రకటించారట. పైగా ముసలి వారైనకొద్దీ- కామోత్సాహం వృద్ధి చేసుకుంటూ వుంటే వారి శరీర ఆరోగ్యం, ఉత్సాహంతో పాటు జ్ఞాపకశక్తి కూడా ఎంచక్కా పెరుగుతుందని వారు శలవిచ్చారట.

## ఏ. సి. చొక్కాలు !

అమెరికా విజ్ఞానశాస్త్రం ఓ కొత్త రకం ఓవర్‌కోటు కనిపెట్టిందట. విపరీతమైన ఎండలో




చమటలు కక్కే సమయంలో ఈ కోటు తొడుక్కుని ఎండలోకి వెళ్తే ఎంచక్కా శరీరానికిది చల్లదనాన్ని యిస్తుందట. అదే మాదిరి ఎముకలను కొరుక్కుతినే చలిలో యీకోటు వేసుకుంటే ఎంచక్కా వెచ్చగా వుంటుందట. ఇది ఎయిర్ కండిషన్ షర్టట- అహా! □



# నాగరికత నవ్వింది

సి.వి. సర్వేశ్వర శర్మ

ఆదివారం, సెలవు రోజు

అయినా బిజీగా ఉన్నాడు ఆఫీసర్ జె ఆర్ వు

శ్రీమతి గాలు త్వరత్వరగా వంట పూర్తి చేస్తోంది

'నువ్వు త్వరగా తెమలాలి తొమ్మిదింటికి బేదితో వస్తామని చెప్పాను" జె ఆర్ వు చెపుతున్నాడు

"తయారయి పోతున్నానంది" ఆమె సమాదానం చెప్పింది

'ఎన్నో రోజులు జీవితంలో దొర్లి పోయాయి కాని ఈ ఆదివారం రోజు తన జీవితంలో ఒక కొత్త రోజు తన కొత్త జీవితానికి నాంది కాబోతున్న రోజు జె ఆర్. వు అనుకుంటున్నాడు.

తలుపు తీసుకుని బయటకు వచ్చాడు వాతావరణం చాలా ఆహ్లాదకరంగా ఉంది. రాత్రి కురిసిన వాన చినుకులు చెట్లు ఆకుల మీద ఉన్నాయి వాటి మీద ఎండపడి అవి మెరుస్తున్నాయి ఎక్కువగా వాన పడినట్లు లేదు

ఎదురుగా ఇంటి ముందు పియట్ కారు ఆగిఉంది ఈ కారును జె ఆర్. వు చాలా రోజుల నుండి చూస్తున్నాడు ఎదుటి ఇల్లు చాలా బాగా కట్టారు కట్టడానికి ఎంత ఖర్చయి ఉంటుందో తెలీదు గాని అందులో ఒక కుటుంబం మాత్రమే ఉండడానికి వీలవుతుంది

ఆ ఇంటి కాంపౌండు గోడకు నేమ్ ప్లేటు ఉంది యధాలాపంగా దానిని చూశాడు మామూలే చాలా రోజులుగా చూస్తున్నదే

కె పి యూ అండ్ జూలీ తల తిప్పి తన ఇంటికేసి చూశాడు ఆ నేమ్ ప్లేటుకు తీసిపోని విధంగా మరో నేమ్ ప్లేట్

జె ఆర్ వు అండ్ గాలు" తృప్తిగా నవ్వుకున్నాడు చూస్తూండగానే ఎదుటి ఇంటి లోంచి జూలీ బయటకు వచ్చేస్తోంది ఆమెను చూశాడు

సన్నగా, నాజూగ్గా, చలాకీగా ఉంటుంది. ఆమె కట్టుకున్న చీర ఆమె కన్నా ఒయ్యారంగా వంటి మీద డ్యాన్సు చేస్తున్నట్లు కన్పిస్తోంది. చిలక ఆకు పచ్చ రంగు షిఫాన్ చీర. స్లీవ్‌లెస్ జాకెట్టు. చీర రంగుతో జాకెట్టు రంగు మ్యాచ్ అవుతోంది

పెదవులకు లిప్‌స్టిక్ కొట్టొచ్చినట్లు కన్పిస్తోంది కళ్లకి ఫొటో సెన్సిటివ్ గ్లాసులు చెంగ్గున వచ్చి కార్లో స్టీరింగ్ ముందు కూర్చుంది హారన్ కొట్టింది

టై సర్దుకుంటూ కె పి యూ వచ్చి కార్లో కూర్చున్నాడు ఆమె కారు స్టార్టు చేసింది ఇద్దరూ కార్లో వెళ్లి పోయారు అయినా మామూలుగానే సముద్రంలో కెరటాలు ఒడ్డుకు వస్తున్నవి మెరుస్తూ కన్పిస్తున్నాయి

జె ఆర్ వు మనసు కదిపి కుదిపి వేస్తున్న సంఘటన ఇదే వారిద్దరకూ ఇతరులతో సంబంధం లేదు వారి ప్రపంచం వేరు. అందాల భరిణి ఆమె. ఎన్నో జన్మల పుణ్యఫలం వారి జీవితం.

మూడు సంవత్సరాల క్రితం ఎమ్. యస్ సి లో సీటు వచ్చి విశాఖ జేరాడు చినవాల్తేరులో ఒక గదిలో ఉండి చదువు సాగించాడు రెండు సంవత్సరాల్లో విజయవంతంగా చదువు పూర్తి చేసుకోవడం జరిగింది

అదృష్టం కలసి వచ్చి విశాఖలోనే ఒక మంచి కంపెనీలో ఆఫీసరు ఉద్యోగం వచ్చింది పెద్దగా శ్రమపడ నవసరం లేకుండానే చిన వాల్తేరులో తనుండేగదితో బాటు మరొక గది కలిపి దానిని ఫ్యామిలీ పోర్షన్‌గా తనకు ఇచ్చేశారు

రెండు సంవత్సరాల కాలంలో జూలీ చాలా పెద్ద ఎత్తున జె ఆర్ వులో సంచలనం ఆమెకు తెలీకుండా సృష్టించింది

ఉద్యోగంలో జేరిన జె ఆర్ వు జూలీలా ఉండే అమ్మాయిని పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకున్నాడు ఇంటి దగ్గర నుండి ఉత్తరం వచ్చింది. పల్లెటూరులో ఉన్న తల్లిదండ్రుల దగ్గరకు వెళ్లాడు

"నీకు పెళ్లి చేద్దామను కుంటున్నాం' తండ్రి చెప్పాడు

సిగ్గుతో "అప్పుడేపెళ్లి ఏమిటి?' అన్నాడు.

"మేము ముసలి వాళ్లం అయిపోతున్నాం. మాకున్న ఆదారం నువ్వే ఓపిక ఉన్నన్నాళ్ళు ఇక్కడ ఉండి తర్వాత నీ దగ్గరకు వచ్చేస్తాం తల్లి చెప్పింది

మీ ఇష్టం అన్నాడు

మన దూరపు బంధువుల పిల్ల ఉంది పెళ్లికూతురు చాలా బాగుంటుంది అమ్మాయిని చూద్దామా? తల్లి అడిగింది

నెత్తిమీద పిడుగుపడింది

నేను పట్నంలో చదువుకున్న అమ్మాయిని పెళ్లి చేసుకుందామనుకుంటున్నాను' చెప్పాడు.

కొడుకు నిర్ణయం విన్న తల్లి కళ్ల వెంట నీళ్లు పెట్టుకుంది.

"చూడు! బాబు! మా ఇద్దరికి చదువు సంధ్యలు లేవు ఆ మాటకొస్తే ఈ ఊళ్లో పెద్ద చదువు చదివిన వాళ్లెవరూ లేరు నీ అదృష్టం బాగుంది చదువు వస్తోంది గదా అని మాకు ఉన్న ఆస్తి అమ్మేసి చదువు చెప్పించాం తండ్రి చెబుతున్నాడు

కొడుకు వింటున్నాడు

తల్లి అందుకుంది.

నువ్విప్పుడు పట్నం పిల్ల చదువుకున్న పిల్ల అంటే మా ముసిలాళ్లిద్దర్ని అది చూస్తుందా? మేము దిక్కులేని చావు చావల్సిందేనా? ఇదేమన్నా నీకు న్యాయంగా ఉందా?"

కొత్త సమస్య ఎదురయింది రాబోయే భార్య గురించి తల్లిదండ్రులకు ఏమి హామీ తను ఇవ్వగలడు?

కొన్ని రోజులు గడిచాయి. మనసులో సంఘర్షణ తండ్రి మళ్లీ ఉత్తరం రాశాడు

పెళ్ళికూతురు తల్లిదండ్రులు తొందర పడుతున్నారు తోటి ఆఫీసరు బేదితో తన సమస్య చెప్పాడు. బేది సమస్యను సులువుగా పరిష్కరించాడు.

"సులువుగా నీకు కావలసినట్లు ఆమెను మొదట్లో మార్చుకో. నీ జీవితం సుఖంగా సాగిపోతుంది" బేది సలహా.

జె. ఆర్. వు. నిర్ణయానికి వచ్చాడు.

"అమ్మా! పెళ్లికూతురు నాకు నచ్చితే ఒప్పుకుంటాను. నచ్చకపోతే నన్ను ఒత్తిడి చేయకండి" మొదట్లో చెప్పాడు.

పెళ్లి చూపులు తతంగం పూర్తి అయ్యింది.

ఆమెను చూశాడు. పల్లెటూరి అందం. ఒకటికి పదిసార్లు చూశాడు. అమితానంద పడ్డాడు. ఆమె తన కోసం పుట్టింది. మనసు ఉప్పొంగి పోయింది.

పెళ్లికి అంగీకరించాడు. అయితే ఒక షరతు. వేష భాషలందు తను చెప్పినట్లు ఆమె నడుచుకోవాలి. ఎవరూ అభ్యంతరం చెప్పలేదు.

మూడు రాత్రుళ్లు పెళ్లి కూతురుతో పెళ్లి సరదా పూర్తయింది. సంసారంలో ఈదడానికి ముహూర్తం పెట్టారు.

ఇంటి దగ్గర అరుగు మీద కూర్చున్నాడు.

చిన్న స్కూలు పంతులుగారు చూడ్డానికి వచ్చారు.

"జోగులుగారు! మీ వైవాహిక జీవితం మూడు పూవులు- ఆరుకాయల్లా ఉండాలని కోరుకుంటున్నాను" పంతులుగారు అన్నారు.

ఆశ్చర్యపోయాడు. పరిచయం లేని ఒక వ్యక్తి తనను జోగులు అని పిలుస్తాడా? కోపంతో ఆయన కేసి చూశాడు. పెళ్ళి కూతురు ప్రక్కనే ఉంది. సభ్యతగా ఉండదని మౌనంగా ఉండిపోయాడు.

నలుగురు ఆడవాళ్లు హడావుడిగా వారిద్దరిని చుట్టు ముట్టారు. పేర్లు చెప్పమని గోల చెయ్యడం ప్రారంభించారు. పెళ్లి కొడుకుని అడగడానికి వాళ్లెవరూ సాహసించలేక పోతున్నారు.

పెళ్లి కూతురు లోకువ. ఆమెను ఒత్తిడి చేశారు. విధిలేక ఆమె చెప్పింది. "జోగులు బావగారు నేను వచ్చాం" అంది.

జె. ఆర్. వు మరొక షాక్ తిన్నాడు. కొత్త పెళ్లాం మీద కేకలు వేస్తే ఏం బాగుంటుంది. అతని చూపుల్లో కోపాన్ని గుర్తించిన ఆడంగు లందరూ అక్కడ నుండి వెళ్ళిపోయారు.

చినవాల్తేరులో కాపరం ప్రారంభమయింది.

పెళ్ళికూతురుతో తన ఆశయాలు చెప్పాడు. అన్నింటికి తలూపింది. ఆమెపేరు గాలి తలుపులు. పేరు అతనికి నచ్చలేదు. 'నీ పేరు మార్చేస్తాను' అన్నాడు ఆమె మౌనంగా ఉండిపోయింది.

'నీకు కొత్త పేరు పెడతాను'

'మా అమ్మ నాన్నలు పిల్లలు పుట్టి చచ్చి-పోతూంటే నాకు ఆ పేరు పెట్టారు' భయపడుతూ ఆమె చెప్పింది.

ఏం మాట్లాడాలో అతనికి పాలుపోలేదు. ఆలోచించి చివరకు ఒక నిర్ణయానికి వచ్చాడు. ఆమె పేరులో మొదటి చివరి అక్షరాలు జతపరచి ఆమెకు 'గాలు' నామకరణం చేశాడు. 'గాలు' పేరు బలే కుదిరింది. 'జూలీ' పేరు మాదిరి ఉంది అతను సంతోషించాడు.



గాలు పెద్దగా చదువుకోలేదు కొంచెం ఇంగ్లీషు వచ్చు భర్త ఆఫీసుకు వెళ్ళినప్పుడు పుస్తకాలు సర్దింది పాత పుస్తకం దొరికింది దానిమీద భర్త పూర్తి పేరు ఉంది

'జోగారావు' ఆమెకు అర్థం అయ్యింది

జె ఆర్ వు అంటే జోగారావు ఇంటి దగ్గర ముద్దుగా అతన్ని జోగులు అని పిలుస్తారు తల్లిదండ్రులు

మనల్ని ఇతరులు చూడాలి మనం వారిని గమనించినట్టు కనబడకూడదు' జె ఆర్ వు చెప్పాడు గాలుకు 'ఎందుచేత?' మొదటిసారిగా ఆమె నోరు తెరిచి అడిగింది

'సు అర్థంకాదు చెప్పినట్టు ప్రవర్తించు' కోపంతో అన్నాడు గాలు ముస్తాబయి భర్తకోసం ఎదురు చూసేది

ఆమె అందం అతన్ని ఎన్నో ఊహాలోకాల్లోకి తీసుకుపోయేది జూలీలా తనగాలు కారు నడపాలి తనగాలును చూసి జూలీ అసూయపడాలి జె ఆర్ వు కోరిక తీరాలి. తీవ్రంగా ఆలోచించాడు తన పరిస్థితికి కారుకాదుగదా కనీసం స్కూటరుకొనే తాహతులేదు కావలసిన డబ్బు సంపాదించే సరికి తన సరదాలు మరుగున పడతాయి

ఎలా? తన కోరిక తీరాలి

గాలు అచ్చం జూలీలా డ్రస్ చేసుకుని తనతో బయట తిరిగితే కొంతవరకూ తన సరదా తీరుతుంది గాలుతో చెప్పాడు

ఆమె అంగీకరించింది.

ఎక్కడకు వెళ్ళాలి మాటల్లో చెప్పాడు

'నువ్వు స్లీవ్‌లెస్ జాకెట్టు వేసుకోవాలి'

'అంటే'

'అదే చేతుల్లేని జాకెట్టు వేసుకోవాలి

'నాకు లేవు' ఆమె చెప్పింది

సులువుగా తీరే సరదా ఆమెకు వెంటనే కుట్టించాడు

ఆదివారం ఆమెతో బేదీ ఇంటికి ప్రయాణం తన కోరిక తీరబోతున్న ఆదివారం

# నాగరికత నవ్వింది

గాలు తయారయ్యింది ఉదయం బస్సులు అంత రద్దీగాలేవు ఇంటి నుండి బస్సుస్టాప్ వరకూ నడిచి వెళ్ళారు

జె ఆర్ వు ఇతరులు తమను చూస్తున్నారో లేదో ఒక కంట కనిపెడుతున్నాడు చాలా తృప్తిగా ఉంది

గాలు సిగ్గుతో అడుగులు వేస్తోంది చీర్పైటతో శుభ్రంగా భుజాలు కప్పుకుంది ఆమెకేసి జె ఆర్ వు చురచుర చూశాడు

'ఫ్రీగా ఉండు' చెప్పాడు

ఆమెకు అర్థం కాలేదు

స్లీవ్‌లెస్ వేసుకున్నది పమిటతో కప్పుకునేందుకా? మనసులో అతనికి చెప్పలేనంత కోపంగా ఉంది సభ్యతగా ఉండదని కోపం అణుచుకున్నాడు

చుట్టూ దగ్గరలో ఎవరూ లేరని నిర్ధారణ చేసుకుని 'చలేస్తోందా? పమిట అలా కప్పుకున్నావు' అడిగాడు

'లేదు' ఆమె చెప్పింది.

ఎదురుగా బస్సు వస్తోంది అనాలోచితంగా ఆపాడు ఖాళీగా ఉంది బస్సు ఆగింది ఇద్దరూ బస్సు ఎక్కారు.

బేదీ ఇంటికి దగ్గర కాలక్షేపం చేశారు

ఆదివారం సగం అయిపోయింది

ఇంటికి తిరుగు ప్రయాణం ఎక్కిన బస్సు కె జి హెచ్ వరకూ మాత్రమే వస్తుంది

కె జి హెచ్ దగ్గర ఇద్దరూ దిగారు

'కె జి హెచ్ వెనకాల మా ఫ్రెండ్ ఉన్నాడు అతన్ని కలసివస్తాను నువ్వు బస్సు రాగానే ఎక్కి చినవాల్తేరు వెళ్ళు' భార్యకు చెప్పి జె ఆర్ వు ఫ్రెండ్ ఇంటికి వెళ్ళాడు

బస్సు వచ్చింది ఆగింది చాలా రష్‌గా ఉంది బస్సు ఎక్కుదామని ఇనుపకడ్డీ పట్టుకునేందుకు ఆమె చెయ్యి ఎత్తింది ఎందుకో ఆమెకు సిగ్గనిపించింది గమ్మున చెయ్యి దింపేసుకుని పమిటతో భుజాలు కనబడకుండా పూర్తిగా కప్పేసుకుంది

అరగంట గడిచింది జె ఆర్ వు.బస్సుస్టాప్ దగ్గర ఉన్న భార్యను చూసి ఆశ్చర్యపోయాడు

'బస్సు చాలా రష్‌గా ఉంది' ఆమె చెప్పింది

'మనకోసం ఖాళీగా ఉంటాయా? అలాగే బస్సు ఎక్కాలి' కొంచెం విసుగ్గా అన్నాడు

ఆమె చిన్న బుచ్చుకుంది

బస్సు వచ్చింది ఆమె స్త్రీలు ప్రవేశించే డోర్‌వద్ద, అతడు పురుషులు ప్రవేశించే డోర్‌వద్ద జేరారు ఆమె బస్సు ఎక్కుతోందో లేదో అతను చూస్తూ బస్సు ఫుట్‌బోర్డు మీద కాలుపెట్టి చేత్తో ఇనుపకడ్డీని పట్టుకున్నాడు

ఆమె ఫుట్‌బోర్డుమీద కాలుపెట్టింది భర్త భయం ధైర్యంచేసి చెయ్యి పైకెత్తి డోర్ దగ్గర ఇనుపకడ్డీ పట్టుకుంది ఆమె భుజాలు జె ఆర్ వుకు కన్పించాయి

ఆమె సిగ్గుతో చెయ్యివదలింది కండక్టరు అలవాటు ప్రకారం 'రైటు' చెప్పాడు

భార్య పరిస్థితి గుర్తించిన జె ఆర్ వు.అప్రయత్నంగా చేతులు వదలాడు

ఒక కాలు మాత్రం ఫుట్‌బోర్డుమీద ఉండడంవల్ల ఇద్దరూ నేల మీద పడిపోయారు

అదొక ఆకస్మిక పరిణామం బస్సు ఆగింది

పడిపోయిన దంపతులను చూసి బస్సులోని కొందరు నాగరికులు ఫక్కున నవ్వారు

ఎవరి హడావిడి వారిది బస్సు పోనిమ్మన్నారు బస్సు కదిలింది

అసహాయస్థితిలో అయోమయంగా పడిఉన్న జె ఆర్ వు.అనాలోచితంగా ఆలోచనలో పడ్డాడు

గాలు తన భార్య అనురాగంతో అప్యాయతతో జీవితాంతం కాపాడుకోవాల్సిన అర్ధాంగి

తను ఏం చేశాడు?

ఆమె అభీష్టం లేదా? తనెందుకు ఆమెను అంతగా శాసించాడు

నాగరికత ముసుగులో తన ఆలోచన మొద్దుబారిపోయిందా?

అందుకే తమని చూచి నాగరికత నవ్వింది

మొదటిసారిగా జోగులుకు సిగ్గేసింది

గాలి తలుపులు దగ్గరకు మెల్లిగా వెళ్ళాడు

ఆప్యాయంగా ఆమెకు చెయ్యి అందించాడు

జోగులు కళ్ళల్లో భావాలు గాలి తలుపులు చదవాలని ప్రయత్నించటంలేదు

మెల్లిగా అన్నాడు

'నిన్ను ఇంకెప్పుడూ శాసించను మనం మనకు వీలైన విధంగా జీవితం గడుపుదాము

ఆమె అతనికేసి ఆశ్చర్యంగా నమ్మలేనట్టు చూస్తోంది

'నా కారణంగా నువ్వు అవమానం పాలయ్యావు కదూ!' అన్నాడు బాధగా

'ఇంటికి వెళ్ళిన తరువాత మీరు మారినందుకు బహుమానం ఇస్తాను' అనుకుంది ఆమె మనసులో □



# మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం



## ఘనపదార్థాలను తొలిసారిగా రుచి చూపిస్తూ

సుమారు 4వ నెల నుంచి మీ పాపాయికి పాలతోపాటు ఘనపదార్థాలూ కావాలి. దీన్ని సెరిలాక్ కానుకతో ప్రారంభించేందుకు ఇదే సరైన సమయం.

**పోషకాహార లాభం :**

సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు-ప్రొటీన్లు, కార్బొహైడ్రేట్లు, క్రొవ్వుపదార్థం, విటమిన్లు, ఖనిజాలు అన్నీ ఉన్నాయి. మీ పాపాయికి ప్రత్యేక అవసరాలకు తగినట్టుగా సరైన పాళ్ళలో అన్నీ సమతూకంలో ఉన్నాయి.

**రుచి లాభం :**

సెరిలాక్ మంచి పోషక పరార్థాలకు, మంచి రుచిని కలిపింది. పాపాయిలకు సెరిలాక్ రుచి భలే ఇష్టం.

**సమయం ఆదా లాభం :**

సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ పంచదార ఉన్నాయి. దాన్ని వెచ్చటి నీటిలో కలిపితే చాలు. క్షణంలో ఆహారం తయారు.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకు తయారుచేయడంలో పరిశుభ్రతను పాటించేందుకూ డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.

ఉచిత సెరిలాక్ పుస్తకం కోసం వ్రాయండి.
సెరిలాక్
పోస్టుబాక్సు నం: 3.
న్యూఢిల్లీ-110 008.






Nestlé.

SAA/FSL/379(R)/TEL

## సెరిలాక్ రక్షణ: పోషకాహారంలో పరిపూర్ణం-ఎంతో రుచికరం

# సీరియల్
# ఒకటి ఒకటే మూడు
## తేజోవతి



(గత సంచిక తరువాయి)

ఆ తెర్వాత ఏం జరిగిందో తెలియదు సీతకు. మెలుకువ వచ్చేసరికి గదిలో డబుల్‌కాట్ బెడ్‌మీద పడుకుని వుంది.

డాక్టరు గారు ప్రేమగా తల నిమురుతూ, "సీతా ఎలా వుంది వొంట్లో?" అన్నారు.

కళ్ళు విప్పార్చి భయంగా చూసింది సీత...

"నిన్ను అనవసరంగా భయపెట్టాను కదూ... కోపంలో వొళ్ళు తెలియలేదు సీతా... బాగా దెబ్బ తగిలిందా?..." వాచిన చెంపల మీద జాలువారుతున్న కన్నీటిని సుతారంగా బొటన వేలుతో తుడుస్తూ,

"లే... యీ కాసిని పాలు తాగు... కొంచెం నీరసం తగ్గుతుంది." అంటూ నెమ్మదిగా పట్టుకుని లేవదీశారు.

సీతకు వొళ్ళంతా నొప్పులుగా వుంది... అయినా చివాలున మంచం దిగబోతుంటే,

"వద్దు సీతా... లేవద్దు... నీకు బాగా రెస్టు కావాలి... పాలు తాగు." భుజాలుపట్టి మంచం మీద కూర్చోపెట్టి పాలు తాగించారు.

ఇందాకటి భర్త రౌద్ర రూపానికి యిప్పటి యీ ప్రేమమూర్తికి పోలికే లేదు. ఆయన లాలనతో కట్టు తెగిన ప్రవాహంలా దుఃఖం పొర్లుకొచ్చింది.

"నేను... నేను క్రింది కెళ్ళిపోతాను." అన్నది నెమ్మదిగా...

"లేదు... నువ్విక్కడే పడుకుంటున్నావ్..."

"కాదండీ... మీతో చాలా చెప్పాలి... దయచేసి నన్ను వెళ్ళనివ్వండి."

"సీతా నువ్విప్పుడు ఏమీ చెప్పడానికి లేదు... మాట్లాడకుండా పడుకో... నీకు బాగా విశ్రాంతి కావాలి.... ఇదుగో యీ మాత్ర వేసుకో."

"ఏమండీ..."

"సీతా... నాకు మళ్ళీ కోపం తెప్పించకు... భర్త మాట భార్య వినడం ధర్మం...." అంటూనే బలవంతాన పడుకోబెట్టి దుప్పటి కప్పి లైటు ఆర్పేశారు...

మరి కొద్ది సేపటిలోనే సీత మళ్ళీ నిద్రలోకి జారుకుంది. మళ్ళీ మెలుకువ వచ్చేసరికి కిటికీలో నుండి ఎండ పడుతోంది మీద....

చప్పున లేచింది... ఆయన యిచ్చిన మందో, తీసుకున్న విశ్రాంతో ఒళ్ళు తేలికగా వుంది... గంట చూస్తే తొమ్మిది కావస్తోంది...

అయ్యో ఆయనకు టిఫినూ, కాఫీ ఏమీ చూడకుండా ఎంత మొద్దు నిద్రపోయింది!... ఆయన టిఫిను తినకుండానే నర్సింగ్‌హోమ్‌కు వెళ్ళి పొయ్యారేమోనని హడావుడిగా మంచం దిగి వస్తుంటే తలుపు దగ్గర ఎదురైంది పని మనిషి కొండమ్మ...

"అమ్మా... లేచారా.... అక్కడ మొహం కడుక్కోండి... నేను కాఫీ టిఫినూ పట్టుకొస్తాను." అన్నది...

"ఎందుకు కొండమ్మా.... నాకు తేలిగ్గానే వుంది. కింది కొస్తానులే." అన్నది.

ఆ అమ్మాయికి యిన్నాళ్ళుగా లేని యీ మర్యాదలు కొత్తగా వున్నాయి.

"మిమ్మల్ని లేవనివ్వద్దని.... తిరగనివ్వద్దని.... కింది కసలు రానివ్వద్దనీ అయ్యగారు మరీమరీ చెప్పెళ్ళారు... ఆయన చెప్పినట్టు వినకపోతే ఆయన క్కోపం వస్తుంది... మీరిక్కడే పళ్ళు తోముకోండి."

సీత బాత్‌రూమ్‌లోకి వెళ్ళి మొహం కడుక్కుని వచ్చేసరికి వేడి వేడి కాఫీ, ప్లేటులో వుప్మా పెట్టుకొచ్చింది కొండమ్మ...

"డాక్టరుగారు కాఫీ, టిఫిను తీసుకుని వెళ్ళారా కొండమ్మా..."

"ఆఁ... డాక్టరుగారు తినే వెళ్ళారమ్మ గారూ.... పెద్దమ్మగారే కాఫీ కూడా ముట్టుకో లేదు. అగ్గి బుగ్గయి పోతున్నారు పలకరిస్తే...."

"అత్తయ్యగారు ఏం తీసుకోలేదా?!... ఎందుకని కొండమ్మా?..."

"ఎందుకేంటి! రాత్రీ పొద్దునా కూడా అమ్మగారూ, డాక్టరు బాబుగారు పెద్ద పెద్దగా కేక లేసుకున్నారుగా.... అయ్యగారు అంత కోపంగా కేకలెయ్యడం నేజూడలేదమ్మా. ఆయన గారు శాంతమూర్తి.... యిన్నేళ్ళుగా యీళ్ళింట్లో వుంటున్నాను... ఒకర్ని ఒక్క రోజు పన్నెత్తు మాట అనలేదాయన. అళ్ళ తమ్ముళ్ళూ చెల్లెళ్ళూ అళ్ళ దబాయింపులు, రుసరుసలు, కోపాలూ పడలేంగానీ ఆయన మహా నెమ్మది..."

సీత గబుక్కున తింటున్న టిఫిను ప్లేటు క్రిందపెట్టి, "అయితే నే వెళ్ళి ఆవిడకు క్షమ చెబుతాను కొండమ్మా... ఆవిడ కాళ్ళమీద పడి...."

"అమ్మా... మీ కావిడ సంగతులు తెలియవు... మహా తగని మనిషి.... ఎంతకైనా తెగిస్తుంది... ఆవిడతో పడలేక కదూ... పాపం ఆ శారదమ్మగారు నిద్దరమాత్తర్లు మింగి చచ్చిపోయింది. లేకుంటే బంగారం లాంటి పిల్ల...."

జరిగిన కథ –7: ప్రసాద్‌తో కట్నం విషయం మాట్లాడడానికి వెళ్ళి భంగపడి తిరుగు ప్రయాణంలో కృష్ణవేణమ్మ గారి కారు కింద పడి ఆమె ఆదరణను చూరగొంటుంది సీత. తన కోడలిగా ఇంట్లోనే సీతకు స్థానం కల్పిస్తుంది కృష్ణవేణమ్మ. కాని శ్యామసుందర్ నుంచి ఏమీ ఆశించ గూడదని షరతు పెడుతుంది. కృష్ణవేణమ్మ గారు పొరుగూరు కెళ్ళిన సందర్భంలో సీత భర్త ఆదరణను అనుభవిస్తుంది. అత్త చెప్పిన షరతుకు, భర్త ప్రవర్తనకు మధ్య తేడాను సీత అర్థం చేసుకోలేక పోతుంది. సీతను తన ఇంట్లో పనిమనిషిలా కృష్ణవేణమ్మ చూస్తున్నదని శ్యామసుందర్‌కి అర్థమవుతుంది.

"శారదమ్మ గారెవరు కొండమ్మా!?" ఆశ్చర్యంగా అడిగింది.

"డాక్టరుగారి మొదటి భార్యమ్మా... చక్కని చుక్క... పెద్ద సదువులు కూడా సదువుకుంది... సక్కగా పాట పాడేది... ఎంత మంచి మనిషో...."

సీతకు యింతదాకా అత్తగారు కానీ భర్తగానీ ఆ మొదటి భార్యను గురించి వివరాలు చెప్పనే లేదు... అందుకే కుతూహలంగా అడిగింది.

"ఆవిడ ఆత్మహత్య చేసుకున్నదా?! ఎందుకూ?"

"మరేనమ్మా... నిద్రమాత్తర్లు మింగింది.... ఎందుకేంటి... ఆ అమ్మగార్ని మరీ పూచిక పుల్లకు కాకుండా చూసేది పెద్దమ్మ గారు... గొప్పింట పుట్టిన పిల్ల.... గారాబంగా పెరిగింది. ఆ యమ్మగార్ని సూసి కళ్ళల్లో నిప్పులు పోసుకుంటుండేదీవిడ..."

"కొండమ్మా!" గట్టిగా అన్నది సీత... పనిమనిషి అలా అత్తగార్ని పట్టుకు అనడం బాధగా అనిపించింది సీతకు.

"అవునమ్మా... మీకేం తెలుసు... ఆ యమ్మను యింత పిల్లగా నున్నప్పటి నుండీ పెంచాను నేను. నా కడుపులో మండిపోతుందమ్మగారూ....

అసలు యీళ్ళకు యిశ్వాసం వుందా? డాక్టరుగారు యింత స్థితికి రావటానికి కారణం పెద్దయ్యగారు కాదూ... ఆ పెద్దయ్యగారు దేముడమ్మా... నిజంగా దేముడు..."

సీత కోప్పడినా వినిపించుకునే స్థితి దాటి పోయింది కొండమ్మ.... ఇన్నాళ్ళూ దాచుకున్న బాధను వెళ్ళగక్కుతోంది.... సీతకు ఆసక్తి పెరిగింది. అందుకే అడిగింది-

"పెద్దయ్యగారెవరు కొండమ్మా?"

"శారదమ్మగారి నాన్నగారు."

"నువ్వాళ్ళింట్లో పని చేశావా?"

"అవును... అళ్ళింటో నే వుండేదాన్ని.... శారదమ్మ గారి పెళ్ళయి, అళ్ళ అన్నలిద్దరూ అదేందో ఫారిన్ ఏందో అక్కడి కెళ్ళిపొయ్యారు... పెద్దయ్యగారు గుండెపోటొచ్చి చచ్చిపొయ్యాక యిక్కడి కొచ్చా....

అసలు పెద్దయ్యగారి దగ్గరేగా శాంబాబు గారున్నది. ఆయనకాడ పని నేర్చుకుంటుండేవాడు... ఆయనది పెద్ద మనసు... కూతుర్నిచ్చి పెళ్ళి చేశారు.... ఆయన పొయ్యాక ఆయన ఆసుపత్తిరి అవీ యీ డాక్టరు గారు కిచ్చేసినారు అన్నదమ్ములు... అళ్ళు ఫారిను ఏందో అక్కడుంటారంట...."



# ఒకటి ఒకటి మూడు

సీత ఆశ్చర్యంగా వింటోంది... అంత చక్కటి పిల్ల, వుత్తమురాలూ అయిన పిల్ల పేరు భర్త ఒక్కసారి కూడా తన దగ్గర ఎత్తక పోవడం, తను బాధపడుతుందనా.. లేక... ఆలోచిస్తూనే అడిగింది..

"డాక్టరుగారు ... ఆవిడను యిష్టపడే చేసుకున్నారా కొండమ్మా?"

"ఇష్టం లేకేం.. పెద్దయ్యగారు శారదమ్మ గారికి పెద్ద సంబంధం తెచ్చారు... ఆయన కూడా శారదమ్మగారి అన్నలతో బాటు ఫారినులో వుండేటాయన.. కానీ శారదమ్మ గారు యిష్టపడలేదు.. శాంబాబు గారిని చేసుకుంటానన్నది...

ఈ అయ్యగారు కూడా చేసుకుంటానన్నారు...

పెళ్ళయ్యాక కూడా ఆళ్ళిద్దరూ సిలకా గోరింకల్లా వుండేటోళ్ళు.. అందుకే యీ పెద్దమ్మ గారికి మంట..."

కొండమ్మ దగ్గరగా జరిగి చాలా చిన్నగా చెప్పింది..

"ఆయమ్మను ఏం కాల్చుకు తిన్నదనీ.. పాపం అంతకీ పెత్తనమంతా యీమెకే వదిలేసింది కూడా...

శారదమ్మగారు ఎక్కడి కన్నా వెళ్ళాలని కారు తెమ్మంటే అంత దాకా మాట్లాడకుండా వున్న మనిషి అప్పుడే నాక్కారు కావాలని పేచీ పెట్టి తన స్నేహితురాళ్ళ దగ్గర ముచ్చట్లాడుకోడాని కెళ్ళేది...

పాపం శారదమ్మ రిక్షాలో వెళ్ళేవాళ్ళు..

శారదమ్మ పనివాళ్ల కెవరి కన్నా పని జెబితే సరి ఆళ్ళను అర్జంటుగా పిల్చి తనేదో పని జెప్పి పంపించేది..

ఇంట్లో ప్రతిదీ అంతే అమ్మా... కూరానారా దగ్గర నుండి పెట్టుపోతల దాకా అంతా ఆయమ్మ యిట్టం.. ఆవిడదేపెత్తనం...

ఆవిడే కాదు.. డాక్టరు గారి తమ్ముళ్ళూ, చెల్లెళ్ళూ ఆళ్ళు కూడా అంతే... యిశ్వాసం లేదు.. చిన్నప్పుడే తండ్రిపోతే యీ డాక్టరు బాబుగారే చదువులు, వుద్యోగాలు, పెళ్ళిళ్ళూ ... అన్నీ చేశారా....

ఆళ్ళకు అసలు ఆయనన్నా లెక్కలేదు.. ఆ శారదమ్మ గారంటే అసలు గుడ్డి గవ్వలా చూసేవాళ్ళు.. నీదే ముండని మొహమ్మీదనే అడిగేవోళ్ళు...

ఆళ్ళేమిటి మీ పెద్దాడ బడుచు పిల్లలు ఆళ్ళు యిల్లంతా యిష్టమొచ్చినట్టు గల్లంతు చేసేవాళ్ళు.. ఆ టి. వి... తిప్పి పాడు చేసే వాళ్ళు... టేపురికార్డు పాటలు పాడుద్ది... అది ఆ శారదమ్మ గారిదే. దాన్ని తిప్పి నాశనం చేసే వోళ్ళు...

ఏమన్నా అంటే యీ పెద్దమ్మగారు శారదమ్మ గారి మీదనే కేకలేసేటోళ్ళు... బాగా అలుసయి పోయి 'నీదేముంది? యిది మా అమ్మమ్మ యిల్లు.. మా అమ్మమ్మ సామాన్లు. మా యిష్టం, అనేవోళ్ళు..."

సీత యిదంతా ఆశ్చర్యంగా వింటోంది.. తన పట్ల అత్తగారు ఆదరణ




చూపక పోయినా తను బాధ పడలేదు.. కారణం తను కోరింది పని మనిషిగా వంట మనిషిగా స్థానం... ఆవిడ దయ తలిచి కోడల్ని చేసుకుందని తను కృతజ్ఞతతో వుండేది...

కానీ కొడుకు కోరి చేసుకున్న పిల్లను అంత హీనంగా ఎలా చూడగలిగింది?

అత్తగారి మాటని కోడలు గౌరవించాలి...

కోడల్ని అత్తగారు అభిమానించాలి...

ఈ రెండూ కాకపోతే ఆ కుటుంబంలో సుఖశాంతు లేముంటాయి!...

సీత ఆలోచిస్తుంటే అన్నది కొండమ్మ..

"ఏందమ్మా ఆలోచిస్తున్నారు? నేను చెప్పింది అబద్ధం అనుకుంటున్నారా ... ఒట్టు అమ్మగారు.. పచ్చి నిజం.. ఒకసారి ఏమైందనుకున్నారు..

శారదమ్మగారు ఎక్కడికో పార్టీ కెళ్ళాలని మంచి చీర కట్టుకున్నారు.. మీరు కాపురాని కొచ్చిన కొత్తల్లో మీ తెల్ల చీరకు రంగు పులిమాడే... రవిబాబు .. ఆ పిల్లాడే గడపలకు రాసే పసుపు రంగు తెచ్చి పూశాడు ఎనక నుండి.. అది వెయ్యి రూపాయల చీర...

శారదమ్మ గారికి ఒళ్ళుమండి చెంప మీద ఒక్క దెబ్బ కొట్టిందని అలిగి గోల చేసి అన్నం తినకుండా పడుకున్నాడు.. డాక్టరుబాబుగారు శారదమ్మ గారిని కోప్పడే దాకాలేచి అన్నం తినలేదు...

వంట మనిషిని తగువులాడి పని మాన్పించేది. ఆ వెంటనే ఏదో రోగమని తను ముసుగు పెట్టి మూలుగుతూ పడుకుండేది... పాపం శారదమ్మ గారు.. అపురూపంగా పెరిగారు.. తిన్న కంచం కూడా ఎత్తి ఎరగరు.. నౌకర్లూ, చాకర్లు ... యింటి నిండా వుండే వాళ్ళం..

అలాంటి పిల్ల పొయ్యి దగ్గర కెళ్ళి చెయ్యి కాల్చుకుని ఏదో వంట చేస్తే ... ఎన్ని వంకలు పెట్టేదో యీవిడ....

ఈ కొడుకు దగ్గర వుంటోందా... యీ కొడుకు అందర్నీ పైకి తెచ్చాడా.. అభిమానంగా వుండాల్సింది పోయి మిగతా పిల్లలకు ఏం దోచిపెట్టేదో...

దూరపు కొండలు నునుపు అమ్మా... ఏడాది కొకసారి వచ్చి అన్నా వదినల మీద ఎక్కులు చెప్పే ఆళ్ళంటే ప్రాణాలు పెట్టేది యీ పెద్దమ్మగారు... సంపాదించిందంతా చేతుల్లో పోసే యీ కొడుకు కోడలి మీద ఆళ్ళతో ఏం సాడీలు చెప్పుతుండేదో..

ఇవన్నీ విసుగేసి శారదమ్మగారు ఆవిడ తెగ మెచ్చుకునే ఆ రెండో కొడుకు దగ్గరకే వెళ్ళి వుండమని చెప్పింది ఒకరోజు...

అలా చెప్పిందని ఎంత గాత్తరం చేసిందో.. పెద్దోళ్ళమ్మా.. మేము అనకూడదు... కానీ మాక్కళ్ళు లేవా.. చూడటం లేదా జరిగేది..."

కొండమ్మ యింత యిదిగా చెబుతోంది.. పైగా శారద పుట్టింటి నుండీ వచ్చిన మనిషి కదా యీమె... మరి యిన్నాళ్ళు యీ కొండమ్మ నెలా వుండనిచ్చారు అత్తగారు?..

ఆ సందేహమే అడిగితే,

"నన్నా ... నన్నేమన్నా సెయ్యాలంటే పెద్దలు దిగిరావాలి... నోరు లేని శారదమ్మ గారిని కానుగా.. ఆవిడ అరిచిందంటే నేను రోడ్డెక్కి అల్లరి చేస్తానని తెలుసుగా.

నన్ను ఎళ్ళగొట్టాలని ప్రయత్నం చేసింది.. కానీ పెద్దయ్యగారు డాక్టరుబాబుగారి చేత చేతిలో చెయ్యి ఏయించుకున్నారమ్మా... యీ పిచ్చి ముండ బతికున్నంత కాలం నీ యింట్లో అట్టే పెట్టుకుని యింత కూడుపడెయ్యమని.. అందుకని డాక్టరుబాబు నన్ను ఎళ్ళగొట్టరు యీవిడ ఎంత పోరాడినా సరే..."

అత్తగారి నిజస్వరూపం తెలిసే కొద్దీ సీతకు భయం పట్టుకుంది.. తను తెల్లని వన్నీ పాలని నమ్మింది.. ఆవిడ తనకు సాయం చేసిందన్న కృతజ్ఞతతో ఎంత నీచంగా చూసినా కిక్కురు మనలేదు.. కానీ రాత్రి...

సడన్‌గా సీతకు రాత్రి వుదంతం గుర్తొచ్చింది..

"రాత్రి ... డాక్టరు గారు పెద్దమ్మగారూ.. ఏమని ఘర్షణ పడ్డారు కొండమ్మా?"

సీతకు అత్తగారు తన మీద ఏం చెప్పిందో తెలుసుకోవాలనిపించింది.. కొంపదీసి పదివేలూ యిచ్చాను దానికే... అదే పుట్టింటి వాళ్ళకు యిచ్చి వచ్చిందంటే... సీత అది తెలుసుకోవాలనే అడిగింది...

బాలల్లారా రారండి! బాలరంజని మీదండి!!




మీకు ఉత్సాహాన్నిచ్చే మంచి మంచి సీరియల్స్,విజ్ఞానంతో పాటు వినోదాన్నిచ్చే చక్కని కథలు, ఇంకా ఏవిటంటే – బొమ్మల కథలు, వింతలు – విశేషాలు, మహనీయుల చరిత్రలు – ఇంకా – ఆరోగ్యానికి చిట్కాలు, పజిల్స్,ఇట్లా ఎన్నో వున్నాయి!

అన్నట్టు మీరు పాల్గొనే శీర్షికలు కూడా వున్నాయి!

అవేమిటంటే –

చిన్నారి నేస్తాలు (మీ ఫోటో పంపితే అచ్చు వేస్తారు)
బడిలో నా మొదటి రోజు (మీ అనుభవం రాసి పంపండి)
అడగండి, చెబుదాం (మీరే ప్రశ్న అయినా అడగండి జవాబు వస్తుంది)

మీకు కార్టూన్లు వెయ్యటం వచ్చా? ప్చ్! రాదా? పోన్లెండి, జోకులు వెయ్యటం వచ్చు కదా! అయితే ఓ పని చెయ్యండి! కార్టూన్ మాటల పోటీలో పాల్గొనండి! మాటలు రాసి బహుమతి గెలుచుకోండి!

## ఇక ఆలోచించకండి!

వెంటనే వెళ్లి రంగురంగుల పత్రిక **బాలరంజని** పిల్లల మాసపత్రిక కొనండి.

వెల ఎంతనుకున్నారూ?

రెండు రూపాయలే!

ఇది పిల్లల పత్రికైనా పెద్దవాళ్ళు కూడా నిరభ్యంతరంగా చదువుకోవచ్చు!

**ఆంధ్రపత్రిక ప్రచురణ**

## ఒకటి ఒకటి మూడు

"ఏముందమ్మా... మీ పెళ్ళిప్పుడు తాళిబొట్టు తాడు చేయించాలి, పట్టు చీరలు కొనాలి. పెళ్ళి కూతురుకు... అందుకని పదేలు కావాలని తీసుకుందట పెద్దమ్మగారు..

ఆ డబ్బుతో తనకూ కూతుళ్ళకూ మిగతా కోడళ్ళకూ ఒక్కోళ్ళకు రెండేసి ఏల రూపాయల చీరలు కొని పెట్టింది... అదే రాత్రి రడిగారు డాక్టరుబాబుగారు..." కొండమ్మ రాత్రి జరిగిన ఘర్షణను పూర్తిగా చెప్పింది.

'దానికి చీరలేంటి... వాళ్ళ అన్నయ్య కట్నం యిచ్చుకోలేదని కారుకిందపడి చచ్చిపోవాలనుకుంటే నేను బతికించాను.... మనింట్లో పని మనిషిగా పడుంటానన్నది. పెళ్ళీడు పిల్ల పని మనిషిగా ఉంటే వాళ్ళన్నయ్యా వాళ్ళు వొప్పుకోరని దయతలచి తాళికట్టించాను...'

దాంతో డాక్టరుబాబుగారు మండిపడిపొయ్యారు. ఆ విషయం నాతో ఎందుకు చెప్పలేదు... ఆడపిల్ల ఆపదలో వుండి సాయం కావాలంటే ఆ అమ్మాయిని ఈ యింట్లో పెట్టుకుని, లేకుంటే హాస్టల్లో వుంచయినా చదివించే వాళ్ళంకాదా. నీ చిన్నప్పటి స్నేహితురాలి కూతురని, రష్యాలో ఉన్నారని, మాట యిచ్చానని నాకు అబద్ధం చెప్పాల్సిన పనేమొచ్చింది. పదివేలూ తీసుకోవలసిన పనేమొచ్చింది" అన్నారు డాక్టరుగారు.

'బాగుంది... పెద్దన్నయ్య పెళ్ళంటే నీ చెల్లెళ్ళూ వాళ్ళు మాకు చీరలేవి అని అడుగుతారుగదా.... అందుకని...'

'అందుకని వాళ్ళకు చీరలు కొన్నావ్.... కానీ నా భార్యకు కొంటానన్న చీరలేవీ అని నేనడుగుతానని అనుకోలేదా?... నలుగుర్నూ ఏమిటి నీ భార్య మెళ్ళో బంగారపుతాడు కూడా లేకుండా యీ పిచ్చి చీరలతో యిలా వుందని అడుగుతారనుకోలేదా?

"ఒకళ్ళడగుతారనుకుంటే అసలు నీ పెళ్ళామని చెప్పాల్సిన పనేముంది.. అందరికీ నేను పని మనిషనే చెప్పాను... నువ్వూ అలాగే..."

'అమ్మా.....' డాక్టరుగారు మండిపడ్డారు...

'నువ్వేర్పాటు చేసిన పురోహితుడు చదివిన మంత్రాల్లో ఎక్కడా పని మనిషిని చెయ్యలేదు ఆ అమ్మాయిని... ఆ మంత్రాలు, నేను కట్టిన తాళి ఆ అమ్మాయిని నా భార్యను చేశాయి.... యింటి యిల్లాల్ని చేశాయి... అందుకే ఆ అమ్మాయి యీ ఇంటికొచ్చాక అర్ధాంగి అవుతుంది కానీ పని మనిషికాదు....

శారద చచ్చిపోవడానికి నువ్వే కారణమని తెలుసు.

అమ్మా ఇదిగో చెబుతున్నాను.... ఇన్నాళ్ళూ తల్లివని అభిమానించాను.... గౌరవించాను.... ఆ అభిమానాన్ని నువ్వు నిలబెట్టుకోలేదు. అందుకని యిక నుండి నేను కూడా ఏ అభిమానమూ చూపించాల్సిన పని వుండదు.

అంతేకాదు పెద్ద కొడుకుగా నా బాధ్యతలన్నీ తీర్చాను కూడా... యిక నా కెలాంటి బాధ్యతలూ లేవు....

ఇక ఈ ఇంట్లో నీ స్థానం గుర్తెరిగి నీ గౌరవం కాపాడుకో... భార్యగా నా యింటికి వచ్చిన పిల్లకు సముచిత స్థానమిచ్చి నీ పెద్దరికం నిలబెట్టుకో...'

కొండమ్మ జరిగిన ఘర్షణ అంతా వివరంగా చెప్పాక సీతకు ఏమీ పాలుపోలేదు.

అత్తగారు ఫలహారం చెయ్యకుండా పడుకోడం ఏమిటి.... ఈ గొడవలన్నీ ఎలా పరిణమిస్తాయి.

మనసేదో కీడును శంకిస్తుంటే ఆలోచిస్తుండిపోయింది సీత. అప్పుడేసుకున్న మాత్రలవల్ల కాబోలు మళ్ళీ నిద్రపట్టేసింది సీతకు...

కొండమ్మవచ్చి మధ్యాహ్నం ఒంటి గంటవేళ నిద్ర లేపితేగానీ లేవలేదు సీత....

చేతిలో పళ్ళెం పక్కన పెట్టి, "యీ పూట కూడా యిక్కడే భోజనం పెట్టెయ్యమన్నారు అయ్యగారు.... ఇవ్వాళా కిందికి రానివ్వద్దన్నారమ్మా. అందుకే కంచంలో ఆ వంటావిడ అన్నీ పెట్టి యిస్తే తెచ్చాను... తినండి" అన్నది.





## అఖిల భారత కార్టూన్ పోటీలో జయదేవ్ కార్టూన్‌కి రు. 3000 బహుమతి

భారత ట్రేడ్ ఫెయిర్ అథారిటీ (న్యూఢిల్లీ) వారు నిర్వహించిన నాలుగవ అఖిలభారత కార్టూన్- కారికేచర్ పోటీ (1986)లో డా. ఎస్. జయదేవ్‌బాబు వేసిన కార్టూన్‌కి రెండవ బహుమతి రు. 3000/= లభించింది. ఇంత వరకూ ఈ పోటీలలో మొదటి బహుమతి అందుకున్నవారులేరు. ఈ ఏడాది మూడవ బహుమతి కూడా ఎవరికీ రాలేదు. బహుమతి పొందిన కార్టూన్‌ని, కార్టూనిస్టు డా. జయదేవ్‌బాబుకి అవార్డుని అందజేస్తున్న ట్రేడ్‌ఫెయిర్ అథారిటీ అధ్యక్షుడు శ్రీ మహమ్మద్ యూనస్ నీ చిత్రంలో చూడవచ్చు.

"డాక్టర్‌గారి భోజనం అయిందా కొండమ్మా?"

"డాక్టరుబాబుగారు యింకా రాలేదు... ఆయన రాక పోయినా పన్నెండున్నరా ఒంటిగంటకల్లా మీకు పెట్టెయ్యమని చెప్పెళ్లారు... మీరు తినక పోతే మమ్మల్ని కోప్పడతారు." అన్నది.

భోజనం చేస్తున్న సీతకు ఎన్నో ఆలోచనలు...

తన పట్ల యింత అభిమానంతో ప్రతి విషయం ఎంతో శ్రద్ధ తీసుకుంటున్న భర్త.... అలిగి పడుకున్న అత్తగారి కోపం....

"అవును కొండమ్మా.... అత్తయ్యగారు భోజనం చేశారా?"

"ఆ కొడుకొచ్చి బతిమిలాడితే గాని ఆవిడ తినదు. నీ కెందుకు నువ్వు తినెయ్యమ్మా..."

రాత్రి భోజనం చేయనందున సీతకు బాగా ఆకలిగా వుంది. అందుకే మారు మాట్లాడకుండా భోజనం చేసింది. ఆ తర్వాత మళ్ళీ మాత్ర వేసుకుని పడుకున్న సీతకు సాయంత్రం నాలుగ్గంటలవేళ భర్త తట్టి లేపితేగానీ మెళకువ రాలేదు.

ఆయన్ని చూడగానే చప్పున లేచి కూర్చుంది.

"సీతా నాకు పనుంది. హాస్పిటలుకు వెళ్ళబోతున్నాను.... నీ ఒంట్లో ఎలా వుంది" అంటూ పల్స్ పట్టుకుని చూసి, యిక మాత్రలక్కర్లేదు... యీ రోజంతా మాత్రం రెస్టు తీసుకో...." అన్నారు....

ఆ తర్వాత జేబులో తాళం చెవులగుత్తి తీసి,

"ఇదిగో యివి బీరువా తాళం చెవులు. ఇవి నీ దగ్గర వుంచు.... ఎవ్వరికీ ఎట్టి పరిస్థితుల్లోనూ యివ్వద్దు.... ఇంటి పెత్తనం యిక నువ్వే చూడు."

ఉలిక్కిపడింది. సీత... పామును చూచినట్లు ఆ తాళం చెవులను చూస్తూ-

"వద్దండీ.... యివి నాకొద్దు... అత్తయ్యగారి దగ్గరే వుండ నివ్వండి...." అన్నది.

"వీల్లేదు.... ఇక అలా జరగడానికి వీల్లేదు... యీ యింటి పెత్తనమంతా నా భార్య చేతుల్లోనే వుండాలి."

"వద్దండీ... దయచేసి నా మాట వినండి... అత్తగారు బాధపడతారు.... ఆవిడను బాధపెట్టకండి... ఆవిడ మీ అమ్మగారు..."

"సీతా ... తల్లికానీ బిడ్డగానీ చివరికి భార్యాభర్తలయినా సరే చూపించిన గౌరవాన్ని, అభిమానాన్ని దుర్వినియోగం చేసుకోకూడదు ... ఎక్స్‌ప్లాయిట్ చేసుకోవాలనుకుంటే ఆ బంధం తెగిపోతుంది ... ఆ అభిమానం నశించిపోతుంది.

మా విషయం అదే జరిగింది. తల్లిగా గౌరవించాను. పెద్దకొడుకుగా బరువు బాధ్యతలన్నీ మోశాను ...

చివరికి నేను యిష్టపడ్డ పిల్లను చేసుకోడానికి వీల్లేదంటే నోరు మూసుకు వూరుకున్నాను".

డాక్టరుగారి గొంతు గద్గదమైంది. ఆయన కళ్లల్లో బాధ ప్రతిఫలించింది ...

సీత చలించింది ...

"ఏమండీ". అన్నది వోదార్పుగా ...

డాక్టరుగారు యిటు చూడటంలేదు ... కిటికీ దగ్గరకు వెళ్లారు. శూన్యమయిన ఆకాశంలోకి చూస్తూ,

"అవును సీతా ... నేను మెడిసిన్ చదివేటప్పుడు నా క్లాస్‌మేట్‌ను చేసుకోవాలనుకున్నాను .... కానీ అమ్మ యిష్టపడలేదు ...

కులంకాని పిల్లను చేసుకుంటే చెల్లెళ్లకు పెళ్లికాదు ... వాళ్ల బతుకులు నాశనమవుతాయి అన్నది అమ్మ ...

ఆవిడ మాట మేరకు ఆ పెళ్లి చేసుకోలేదు ...

ఆ తర్వాత నన్ను యిష్టపడి చేసుకున్నది శారద ... ఎన్నోసార్లు అమ్మ విషయం చెప్పడానికి ప్రయత్నించింది పాపం ...

కానీ తల్లి మీద గౌరవంతో టే శారద చెప్పింది ఏదీ నమ్మలేదు సీతా ...

గొప్పింటి నుండీ వచ్చింది కనుక ఆ సుపీరియారిటీ చూపిస్తోంది కాబోలు అత్తగారి దగ్గర అనుకున్నాను ..."

అలా చెబుతుంటే డాక్టరుగారి కళ్లముందు ఆనాటి సంఘటనలు మెదిలాయి కాబోలు ... ఆయన కళ్లలో తడి కన్పించింది ... ఆయన స్వరం వ్యధాపూరితంగా వుంది ...

అంతలోనే నిగ్రహించుకున్నారు శ్యామసుందర్‌గారు.

"ఆ విధంగా నేను యిష్టపడ్డ పిల్లను, నన్ను యిష్టపడ్డ పిల్లను ఆవిడ కోసం యిద్దర్నీ పోగొట్టుకున్నాను సీతా ...

అందుకే చివరకి ఆవిడ యిష్టపడ్డ పిల్లను చేసుకుంటేనన్నా ప్రశాంతంగా వుంటుంది కాపురమని నిన్ను చేసుకున్నాను ...

సీతా! తాళి కట్టినవాడ్ని ... నీకు మాత్రం అన్యాయం జరగనివ్వను సీతా ... యిక యీ యింటి పెత్తనమంతా నీదే కావాలి ... నా భార్యగా, యింటి యిల్లాలిగా నీ గౌరవం నీ స్థానం నేను కాపాడవలసిందే సీతా! తాళంచెవులు వద్దనకు".

సీత చేతిని తన చేతిలోకి తీసుకుని గుప్పటలో తాళంచెవి పెడుతుంటే సీతకు ఏం చెయ్యడానికీ తోచలేదు ... తన చెయ్యి వెనక్కు లాగేసుకుంటూ,

## ఒకటి ఒకటి మూడు

"ఏమండీ ... నా మాట వినండి ... అత్తగారు నన్ను చిన్న చూపు చూస్తున్నారని నేనేమి అనుకోటం లేదండి ... నన్నిలా వుండనివ్వండి ... మీ యింట్లో దాసిగా వుందామనే వచ్చానండి ...

దయచేసి నన్ను బలవంతం చెయ్యకండి ...

నేను ... నేను దేముడిమీద ప్రమాణం చేశానండి ..." అలా అంటుంటే సీత కళ్ల వెంట కన్నీరు తొణికింది ... గొంతు బొంగురుపోయింది.

నీళ్ళు నిండిన కళ్ల ముందు ఆనాడు రామాలయంలో అత్తగారి ముందు స్వామిమీద ఒట్టు పెట్టి చేసిన ప్రమాణం గుర్తొచ్చింది ...

"ప్రమాణమా! ... ఏం ప్రమాణంచేశావ్? ... ఎవరి ముందు చేశావ్?"

"పెళ్ళికి ముందు ... మా వూరి దేవాలయంలో అత్తగారి దగ్గర ప్రమాణం చేశాను దేముడిమీద ఒట్టు పెట్టుకుని ..."

"అదే ఏం ప్రమాణమని అడుగుతున్నాను".

"అదే ... యీ పెళ్ళి జరిగినా ... మీ నుండి ... మీ నుండి భార్యగా ఏమీ ఆశించకూడదని.... మీరు ... మీరు .... కండిషను పెట్టారు గదా ... అలాగే చేస్తానని ప్రమాణం..."

"సీతా ... నేను కండిషను పెట్టానా?! ... నా నుండి భార్యగా నువ్వు ఏమీ ఆశించకూడదని! ...

సీతా ఎవరు చెప్పారు నీకు ..."

అనుకోకుండా ఆయన గొంతు కటువుగా మారిపోయింది ... ముఖం క్రోధంతో ఎర్రబడింది ... సీత భుజాలు రెండూ పట్టుకుని వూపేస్తూ అన్నారు ...

"ఎవరు చెప్పారు నీకు నేను కండిషను పెట్టానని ... చెప్పు ..."

సీతకు ఆయన కోపం చూశాక, ఆ వుద్రేకం చూశాక తనను యిన్నాళ్ళుగా వేధిస్తున్న ఎన్నో ప్రశ్నలకు సమాధానం దొరికినట్లయింది ...కానీ ఆయన వున్న ఆ కోపంలో వాళ్లమ్మగారు చెప్పారంటే ఏం జరుగుతుందో తెలుసు కనుక మౌనంగా వున్నది.

శ్యామసుందర్‌గారికి అర్థమయింది. ఎవరు చెప్పి వుంటారో ... తన కోపాన్ని నిగ్రహించుకుని, కొంచెం శాంతించి-

"సీతా మా అమ్మ చెప్పిందా... చెప్పు సీతా" అన్నారు.

సీత భయం భయంగా ఆయన కళ్ళల్లోకి చూస్తూ వుండిపోయింది.

ఆయన చిన్నగా నవ్వారు.... సీత గడ్డం పట్టుకుని తల పైకెత్తి ఆ కళ్ళల్లోకి సూటిగా చూస్తూ-

"సీతా.... వయసులో వున్న భార్య దగ్గర నుండి భర్త ఏమీ ఆశించ కూడదని కండిషను పెట్టాడంటే అంత అమాయకంగా ఎలా నమ్మావు సీతా?" అన్నారు.

"మొదటి భార్యను మరిచి పోలేక..."

శ్యామసుందర్‌గారు నవ్వారు....

"చనిపోయిన భార్యను తల్చుకుంటూ తాళికట్టిన పిల్లకు అన్యాయం చేస్తే అది చచ్చిపోయిన భార్యకు న్యాయం చేసినట్లవుతుందా సీతా" అంటూ రెండు చేతులతో నూ సీతను దగ్గరగా తీసుకుని, ఆమె పెదవుల మీద తన పెదవులు అద్దుతూ, "అందుకేనా.... పెళ్ళయ్యాక వారం రోజులదాకా పైకి రాలేదు?" అని అడిగారు....

అవునని తలూపింది సీత.

"ఆ రోజు కూడా... నాకు సాయం చేసిన... మీ కాళ్ళకు.... ఒక్కసారి... నమస్కారం... చెయ్యాలనిపించి..." అంటూ సణిగింది...

"పోన్లే... కనీసం పాదాలయినా తాకాలనిపించింది." అంటూనే-

"ఆ రాత్రి అక్కడ హాల్లో ఎందుకు పడుకున్నానో తెలుసా... యీ విషయం అడగాలనే... నిద్ర లేపాలని ఎంతో అనుకున్నాను... కానీ అమాయకంగా నిద్రపోతున్న దానివి బెదిరిపోతావేమోనని ఆలోచిస్తుంటే నిద్రపట్టేసింది.." అంటూ సీతను గాఢంగా తన హృదయానికి హత్తుకుంటూ అన్నాడాయన...

"చూడూ... పిచ్చి ఆలోచనలేవి పెట్టుకోకు. నువ్వు ప్రమాణం చేశావేమో ఏమీ ఆశించనని.... నేనేమీ అలాంటి ఒట్టుపెట్టుకోలేదుగా... పైగా మన పెళ్ళినాడు నేనూ ప్రమాణం చేశాను... ధర్మేచ అర్థేచ కామేచ నాతిచరామి... అని.... ఇంకాయింకా చాలా ప్రమాణాలు చేశాను" అంటూ-

"ఇదిగో సీతా తాళం చెవులు... సందేహించకుండా తీసుకో" అన్నారు.

"ఏమండి.... వద్దండి.... ఇవిమాత్రం వద్దు. నేనిది ఆశించలేదు... అనుకోకుండా మీ ఆదరణ దొరికింది... అదే చాలు నాకు... మీరు బలవంతం చెయ్యద్దు. అత్తగారిని నొప్పించద్దు".

డాక్టరుగారికి మళ్ళీ కోపం వచ్చింది... చప్పున ఆ అమ్మాయిని వదిలేసి, "సీతా... నువు నా యింట్లో వుండదల్చుకుంటే, నా అర్ధాంగిగా వుండు... నా యింటి యజమానురాలుగా వుండు... అంతే... నీ యిష్టం.... నాకు టైమయిపోయింది నేను వెళ్తున్నాను." అంటూ తాళం చెవులు టీపాయ్‌మీదకు విసిరేసి గిరుక్కున తిరిగి వెళ్ళిపొయ్యారు.

సీతకు ఏం చెయ్యాలో పాలు పోలేదు...

ఆయన అంత కోపంగా వెళ్ళి పొయ్యాక ఆ తాళం చెవులు తీసుకెళ్ళి అత్తగారి చేతిలో పెట్టేంత సాహసం చెయ్యలేక పోయింది.

మరి తను అత్తగారిని నొప్పించి యీ యింటి పెత్తనం సాగించగలదా.... నిభాయించగలదా....

(ఇంకా ఉంది)








# దూరదర్శనం

లత

## పాలస్తీనా సినిమా

కథా కాలం 1948 నుంచి 82 వరకూ లెబనాన్ నగరం బీరూట్‌మీద జరిగిన యుద్ధం ఇజ్రాయెల్- పాలస్తీనియన్లు భూమికోసం దేశం కోసం కొట్టుకుంటున్న కథ శవాల్ని మూటగట్టి పారేయటం- శిథిలాలూ, స్త్రీల ఏడుపులూ ఎక్కువగా వినిపిస్తున్నయ్ పాలస్తీనా తగాదా క్రీస్తుపూర్వం నుంచీ ఉన్నట్లుంది యూదులకూ- యూదులు కానివారికీ అప్పుడు ఉండటం వల్లనే జీసస్ యూదుల్లో పుట్టి ఉండవచ్చును ఆయన మతం స్వీకరించిన వారు - ఆయన జాతిని గౌరవించరు ఇదొక అద్వాన్నపు కాలం చరిత్రహీన దౌర్భాగ్యపు యుగం- యూదులు జెరూసలెంని బాగా పునర్నిర్మాణం కావించు కొన్నారు- మనలా తీరిగ్గా కూర్చున్న వాళ్ళకు వాళ్ళ జీవన పోరాటంలో ఉన్న ఆరాటం అర్థం కాదేమో ఇది సినిమా అనేకన్నా డాక్యుమెంటరి అంటే బాగుంటుంది

## ది వింటర్‌టేల్ 1

షేక్స్‌పియర్ నాటికలో మొదటి బాగం ఒక రాజు తన భార్యని అనుమానించి- గర్భవతి అయి ఉండగా జైల్లో పెడతాడు- ఆమె అక్కడే ప్రసవిస్తుంది- మంత్రసానిలాటి వ్యక్తి- బిడ్డని రాజుకిచ్చి జైల్లో ఉన్నామె మంచిది అని చెపుతుంది ఇంతవరకూ ఈ వారం దృశ్య మానమయింది- మహాకవి షేక్స్‌పియర్- సుదీర్ఘమైన వాక్య విన్యాసాలు మామూలే అయినా అవి ఎంతో సారస్వతాన్ని మనకి అందిస్తాయి అయితే గతంలో ఈ వింటర్ టేల్ నేను మిస్సయిపోయాను- మళ్ళీ ఒక తడవ షెక్స్‌పియర్ చదవాలి.

సాయంత్ర ప్రసారంలో లక్ష తడవల చూసిన రష్యన్ సర్కస్ మళ్ళీ చూపించారు. రష్యాలో ఈ సర్కస్‌ని చూసి జనం ఛాలా ఆనందిస్తారు కాని మనకి ఇన్ని తడవల అదేపనిగా చూడటం నచ్చదు.

భారతీయులు అనుదిన నూతన భావావేశపరులు- కొత్తదనం కావాలి- పైగా ఇది పిల్లల కార్యక్రమంట. ఆ పేరుతో పెద్దల్ని చంపుతున్నారు. ఈ దిక్కుమాలిన సర్కస్ ఈ సంవత్సరంలో పదిసార్లు వేశారు.

తరువాత "ఎ- పిలిగ్రిమ్స్ లవ్" అనే డాక్యుమెంటరీలో గ్రీకు శిల్పం బాగుంది. సూర్య శిల్పం గొప్పగా ఉంది- దేవదూతలు మోస్తున్న స్తంభం- మాత్యూస్ మొదలయిన దేవతల శిల్పాలూ- బంగారు శిల్పాలూ, పెద్ద కంచు శిల్పాలూ బాగున్నాయి. గ్రీకు శిల్ప కళ తెలిసిన భారత శిల్పి పాత పోసినట్లు ఉన్నాయి ఈ వాపెల్సా సమాధులూను చాలా మంచి డాక్యుమెంటరి ఇది- బంగారు గులాబీ చెట్టు ఒకటి కాంతులు విరజిమ్ముతోంది ఇండియాలో ఉన్న చర్చి శిల్పాలను చూశా టర్కీ సంగీతం కూడా పాప్ మ్యూజిక్కే- ప్రస్తుతం

గాయని అందంగా ఉంది కఠక సంగీతం నచ్చకపోయినా పరవాలేదు ఈమె చాలా గొప్ప పాప్ మ్యూజీషియన్- నాకు ఈ సంగీతం నచ్చదు స్త్రీ ఎవరో ప్రసవవేదన, ఘోరంగా పడుతున్నట్లుంటుంది- ఇది టర్కీలో శాస్త్రీయ సంగీతాన్ని పడగొట్టిందిట

టర్కీలోని పాప్ సింగర్ హిందూ స్త్రీలాగా బొట్టు పెట్టుకొని ఈలవెయటం షోగ్గాఉంది

తరువాత యూ ఎండ్ యువర్ పెట్స్" అని ఒక ప్రసంగం వస్తోంది చాలా రోజులుగా ఆదివారాలు వచ్చిన ఈ ప్రసంగం, ఇప్పుడు శనివారానికి మార్చారు

పై చెప్పిన ఇంగ్లీషు టైటిలుకి తెలుగు ఇలా ఉంటుంది మీరూ మీ పెంపుడు ప్రాణులూ అని ఇక్కడ ఇంగ్లీషులో అంటున్న 'యూ అనవసరం వెద్యం మనకి కాదు మన పెంపుడు జంతువులకి కా.. టైటిలురీత్యా చూస్తే- తోకలూ- రెక్కలూ, చర్మ రోగాలూ వగైరా మనక్కూడా ఉన్నాయి కాబోలు అనిపిస్తుంది. యూ' - అక్కర లేదు యువర్ పెట్స్' అంటే చాలుననుకుంటాను

మాయ నృత్య నాటిక- బుద్ధజనని మాయ అన్నారు ఈ నృత్య నాటిక (కోమలావర్ధన్) (తమిళం)- మృగి అన్న నృత్య విశేషం ఇది- పిల్లలు చేతులతో నీడ బొమ్మలు వేయటం లాటిది. తమిళులు తెలివిగలవాళ్ళు- తెలుగులో ఒక లేడి కథ - ఫరవాలేదు. మృగశీర్షహస్తం కరెక్టుగా పట్టింది. సర్ప- పతాక- మృగశీర్షాలు ముద్రలలో తేలికైనవి. నర్తకి జఘన సుందరి.

రెండో అయిటమ్‌గా, మాయాదేవి గురించి ఎనౌన్స్‌మెంట్ అయింతరువాత- నర్తకి టైటిల్ డాన్స్ చేసింది.... గాయకుడు బుద్ధం అనటానికి భూతం అనడం తమిళభాషవారికి పాతకథే- లతాజీ గానం లలిత లలిత లతా లహరి. పాప్ మ్యూజిక్, విన్నపాపం భారతీయ కవుల భజన గీతాలతో తీరిపోయింది శనివారం ఎనౌన్సరు ఆదివారం వచ్చే హిందీ కథా చిత్రం సాయంత్రం 6–45కి అని ఎనౌన్స్ చేస నిముషం తరువాత 10–45కి అని చెప్పింది అంతేకాదు అలా అని స్క్రీన్‌మీద వేశారు

ఇంత అశ్రద్ధ పనికిరాదు

అచ్చుమిల్లె, అచ్చుమిల్లె' అనే సినిమా చూపించారు బాగానే ఉంది అందులో పచ్చపార్టీనీ పచ్చ జెండానీ విమర్శించాడు పాత కాంగ్రెసు పార్టీకి ఆకు పచ్చ బాలెట్ పెట్టెలు ఉండేవి కాని ఆకు పచ్చ జెండాలు లేవు అన్న, తలైవర్- అంటే పెద్దాయన- లాటి పదాలు ఆంధ్ర దేశానికే తగులుతాయి-

అప్పూ ఔర్ పప్పూ సీరియల్ నాటిక

అప్పూకోసం శత్రువులు తవ్విన గోతిలో పిల్లవాడు పడ్డాడు అప్పూ అతన్ని పైకి లాగాలని ప్రయత్నిస్తున్న పప్పూకి సింహం అరుపు వినిపించి పారిపోతుంది- ఇంతే ఈ వారం ఆ తర్వాత క్రికెట్

మధ్యలో ఒక నాటకం టి వి మీద సెటైర్ దాన్ని గురించి అమూల్యమైన కాలం వ్యర్థం చేస్తున్నది టి వి

సఫర్" - సినిమా చూపించారు

నటీనటులు బాగా చేసినా కథ చాలా తడవలు చూశాం, చదివాం ఒక స్త్రీ ఇద్దరు పురుషులూ- బ్లడ్ కాన్సరూ- హీరో త్యాగం హీరోయిన్‌ని పెళ్ళి చేసుకొన్న వాడికి - హీరో మీద అనుమానంలాటి మసాలాలు ఉన్నాయ్ గాని ఈ రకం సినిమాలు ఒకానొక కాలంలో చాలా వచ్చినయ్ చాలా విసుగు వచ్చింది ప్రేక్షకలోకానికి దీనికి ఫామిలీ సెంటిమెంట్.... అన్న పేరు పెట్టి నిర్మాతలు మనల్ని చాలా విసిగించారు. □



పాఠకుల శీర్షిక

# గర్భస్థ శిశువు చెప్పిన కథలు

## మాతృత్వం

నన్ను పరీక్షించిన తర్వాత లేడీ డాక్టర్ "మీకు ఆడపిల్ల పుడుతుంది" చెప్పింది.

ఆమె మాటలు వినగానే నాకు పక్కలో బాంబు పడ్డట్లయ్యింది. ఎలాగో గొంతు పెగల్చుకుని "డాక్టర్! మీరు చెప్పేది నిజమేనా?" ప్రశ్నించాను.

"ఇంకా అనుమానం ఎందుకమ్మా? అన్ని పరీక్షలు అయిన తర్వాతనే కదా ఆడపిల్ల పుడుతుందని చెప్పాను"

"మీరు అన్ని పరీక్షలు చేసారు కాదనను. కానీ మీరన్న మాటలే నాకు బాధను కలిగిస్తున్నాయి."

"అంతగా వర్రీ కావాల్సిందేముంది? మాతృత్వంలో ఎంతటి ఆనంద ముందో ముందు ముందు నీకే తెలుస్తుంది."

నేను మరేమీ మాట్లాడకుండా ఇంటికి వచ్చేశాను.

ఆడపిల్ల పుట్టబోతున్న విషయం శ్రీవారికి చెబితే ఆయన నవ్వి "సుగుణా! మన పెళ్ళి జరిగిన రెండు సంవత్సరాలకు నేను తండ్రిని కాబోతున్నాను. అదే నాకు ఎంతో ఆనందాన్ని కలిగించే సంఘటన. ఏ పిల్ల పుడితే ఏం? ఎవరు పుట్టినా వాళ్ళని నా కంటి పాపలా చూస్తాను." అన్నారు.

"ఏమండీ! ఆడపిల్ల పుడితే ఎంతటి కష్టమో ఓసారి ఆలోచించండి 'ఆడపిల్లగా పుట్టేకన్నా అడవిలో మానై పుట్టడం మేలు' అనే సామెత మీరు వినలేదా? ఆడపిల్లను పెంచి, నగలు కొనిపెట్టడం, పెళ్ళి చేసి అత్తవారింటికి పంపించడం ఎంతో కష్టంతో కూడిన పనులు. ఆడపిల్లలకు అయ్యే ఖర్చు మగపిల్లలకు అవదు. అదీగాక మగపిల్లవాడైతే కట్నం తీసుకోవచ్చు."

"ఐతే ఏమంటావు" శ్రీవారి ముఖంలో చిరాకు.

"ఏమీ లేదండీ, నేను అబార్షన్ చేయించుకుంటాను."

అంతే!

ఒక్కసారి నా చెంప చెళ్ళుమంది శ్రీవారి కళ్ళు కోపంతో ఎరుపెక్కిపోయాయి. శ్రీవారి ముఖంలో అంతటి కోపాన్ని నేనెప్పుడూ చూడలేదు. భయంతో ఓ అడుగు వెనక్కి వేసాను.

శ్రీవారు "సుగుణా! నీది ఎంత నీచపు ఆలోచన ఓ ఆడదానివై వుండి నీ గర్భంలో వున్న పసిపాపను హత్య చేయిస్తానంటావా? మీ అమ్మ కూడా నీలాగే ఆలోచించి నువ్వు గర్భంలో వున్నప్పుడు అబార్షన్ చేయించుకుందనుకో! నువ్వు ఈ భూమి మీదే పడివుండేదానివికావు. మరోసారి అబార్షన్ చేయించుకుంటానని అంటే నేను ఊరుకోను జాగ్రత్త" అని గట్టిగా చెప్పి బయటకు వెళ్ళిపోయారు.

శ్రీవారి కోరికను తీర్చవలసిన బాధ్యత నాకున్నది కనుక ఎదురు చెప్పలేదు.

నవమాసాలు మోసి ఆడపిల్లను కన్నాను. మాతృత్వంలో ఎంతటి ఆనందం వుందో నాకప్పుడు తెలిసింది. ఇప్పుడు మా చిన్నారి పాప లావణ్య అంటే నాకు ప్రాణం.

-ఎమ్. జ్యోతి కుమారి,
విజయనగరం

* * *



## ఆక్రందన ఆనందంగా మారాలి

గర్భంలో ఉన్న బిడ్డ ఆడో మగో తెలుసుకునేంత వరకూ మన సైన్సు అభివృద్ధి చెందినందుకు సంతోషించాలో లేక ఆ అభివృద్ధి చెందిన సైన్సు వలనే మన నాగరిక మానవజాతి అనాగరికంగా క్రూరంగా గర్భస్థ శిశువులను హత్య గావిస్తున్నందుకు ఏడ్వాలో తెలియటం లేదు.

పుట్టబోయే బిడ్డ ఆడో మగో తెలుసుకుని ఆడ అని తెలియగానే అబార్షన్ చేయించుకోవటం మహాదారుణం. ఈ దారుణానికి అసలు కారణం వరకట్నం. ఇన్నాళ్ళూ ఈ వరకట్నం వివాహిత స్త్రీలనే బలితీసుకుంటుందనే అందరికీ తెలుసు కానీ ఇపుడు ఆ రాక్షసి విరియని పసి మొగ్గలనే తినేస్తుందని తెలుసుకుని హృదయం ఉన్న ప్రతీమనిషీ నిశ్చేష్టులే అవుతున్నారు.

స్త్రీ ప్రేమకు, కరుణకు మారు పేరన్నారు. అటువంటి స్త్రీలే కరుడు కట్టిన హృదయాలతో కడుపు తీపిని, కన్న బిడ్డనే చంపుకుంటున్నారంటే వారిని స్త్రీలు అని ఎలా అనగలం? వంశపారం పర్యంగా వచ్చే లోపాలను శిశువు కడుపులో ఉండగానే తెలుసుకుని ఆలోపాలను సరిదిద్దటానికి ఈ వైద్య పరీక్షను కనిపెడితే పుణ్యానికి పోతే పాపం ఎదురైనట్లు అది శిశుహత్యలకు దారి తీసింది. ఈ భ్రూణ హత్యలు కావిస్తున్న వారందరూ




విద్యావంతులే. ఈ దారుణాన్ని ఎన్నో మహిళా సంస్థలు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాయి.

ఈ ప్రవృత్తి తీవ్రరూపం దాల్చి మరో దురాచారంగా మారక ముందే సమాజం అనబడే మన మందరమూ స్త్రీ జాతి నాశనం కాకుండా రక్షించాలి. ఈ శిశు హత్యలను చేయటానికి ప్రయత్నించే తల్లితండ్రులను పౌర హక్కుల సంఘాలు, సాంఘిక సంస్థలే కాకుండా, ఆ దారుణాన్ని ఎవరు పసిగట్టినా వెంటనే దాన్ని నిరోధించాలి. ఈ విషయంలో ఎవరికి వారే మనకెందుకులే అని ఊర్కోకుండా ప్రతీ ఒక్కరూ దాన్ని ఖండిస్తే గర్భస్థ శిశువుల ఆక్రందనను ఆనందంగా మార్చిన వారమవుతాము.

కుమారి చెన్నా కృష్ణవేణి,
సాయినగర్, విజయనగరం.

# పెంపకాన్ని బట్టి ఉంటుంది!

మానవుడు అంతరిక్షయానం చేస్తున్న ఈ రోజుల్లో గర్భంలోని శిశువు ఆడ, మగ అని కనుక్కోవడం విశేషమేమీకాదు. కానీ మానవుని విజ్ఞానం పెరిగేకొద్దీ అది మంచికే దారితీయాలి. ఆ విజ్ఞానాన్ని స్త్రీలు దుర్వినియోగం చేసుకోవడం విజ్ఞాన శాస్త్రానికే తీరని మచ్చ వంటిది. గర్భంలోని శిశువు 'ఆడ' అయినంత



మాత్రాన చంపుకోవాలని ఎందుకాలోచించాలి? అదే మన తల్లి అలా అనుకొని వుంటే మనం పుట్టి ఉండే వాళ్ళమా? ఆడ వాళ్ళుగా పుట్టి స్త్రీ జాతినే నాశనం చేయడానికి కంకణం కట్టుకుంటే ఇంక స్త్రీ జాతి ఎలా పురోగమిస్తుంది? ఏం? మగవాళ్ళే అంత గొప్పవాళ్ళా? బాగా ఆలోచించండి మగవాడు పుట్టింది మొదలు చివరి క్షణం వరకు స్వార్థంతోనే బ్రతుకుతాడు. కాని స్త్రీ ఎంతో ఓర్పుతో సహనంతో ధైర్యంతో నిస్వార్థంగా సమాజానికి ఎంతగానో ఉపయోగ పడుతూ వుంటుంది. 'ఆడ' అయినా, 'మగ' అయినా, వాళ్ళ భవిష్యత్తు మన పెంపకాన్ని బట్టి వుంటుందని నిస్సందేహంగా చెప్ప వచ్చు. కొడుకే తల్లి దండ్రుల్ని పోషించాలని లేదు. ఎంత మంది కూతుళ్ళు అమ్మా నాన్నలను పోషించడం లేదు? నువ్వు ఆడపిల్లవు నీకేమీ చేతకాదు. అనే సంకుచిత భావాన్ని కల్గనీయకుండా, అబ్బాయిలకులాగా, అమ్మాయికి కూడా నిస్వార్థంగా చదువు సంధ్యలు చెప్పించి ప్రతి తల్లి, తండ్రి వారి భవిష్యత్తుకు బంగారు బాట వేయ గల్గితే ప్రతి స్త్రీ కూడ, తన కాళ్ళ మీద తాను నిలబడి, పలువురికి మార్గదర్శి అవుతుంది. ఆడపిల్లకే జన్మనివ్వకుండా జాగ్రత్త




పడే తల్లి దండ్రులకు, కొడుకులకు పెళ్ళిళ్ళు చేయడానికి కోడలు కావాలి కదా! ఆ కోడలు మాత్రం 'స్త్రీ' కాదా? చరిత్ర తిరగ వేస్తే, చరిత్ర ప్రసిద్ధి కెక్కిన ప్రతి పురుషుని వెనుక ఒక 'స్త్రీ' వుందనుటలో అతిశయోక్తి లేదు. స్త్రీలు రాజ్యాలేలారు, యుద్ధాలు చేశారు. ఆధునిక యుగంలో తగిన ప్రోత్సాహాన్ని, చేయూతను కల్గిస్తే రాకెట్‌లా ముందుకు దూసుకెళ్తున్నారు. బాగా ఆలోచించండి, స్త్రీ జాతి అభివృద్ధికి తోడ్పడాల్సిన మనమే 'స్త్రీ' కి జన్మనివ్వకుంటే ఇంక 'ఆడ' దానికి దిక్కెవరు? ఈ వ్యాసం ఏ కొద్ది మందినయినా ఆలోచింప చేయకల్గితే సంతోషం.

పి. సరస్వతి,
వేపులభైలునగరి, పీలేరు.

# నేటి మహిళల కర్తవ్యం

ఈనాటి సమాజం శాస్త్రీయంగా



పారిశ్రామికంగా, నాగరికతతో ముందంజ వేస్తున్నా మానసికంగా ఎదగలేదనే చెప్పుకోవాలి. అమ్మాయి పుట్టగానే 'అయ్యో! ఆడపిల్లా' అని నిస్పృహ చెందే తలిదండ్రులు. 'ఆడపిల్ల పుట్టిందా ఇంక ఇప్పటి నుండే కట్నం డబ్బు దాచడం మొదలెట్టు' అనే ఇరుగు పొరుగుల అపహాస్యాలు. ఇలా ఆడ - మగ తేడాలను ఎత్తి చూపడం ఇంకా శోచనీయం. ఇంకా వారి పెంపకంలో గూడా తేడాలను చూపిస్తారు. వాడికేమి మగబిడ్డ. వాడితో 'చంతేమిటి' అని తిండి, చదువు, ఆట పాటలు ఇలాంటి చాల విషయాలలో తేడా చూపిస్తారు గాని ఆడపిల్లలకి శక్తి సామర్థ్యాలని పెంచుకొనే అవకాశాలివ్వడం గాని, ప్రోత్సాహాన్ని ఇవ్వడం గాని చేయరు. ఇంకా కొంత మంది ఆడపిల్ల పుట్టడం శాపం, మగబిడ్డ కలగడం వరంగా ఫీలవుతారు.

18 సంవత్సరాలు భారత దేశాన్ని పరిపాలించి ప్రపంచ దేశాలన్నిటిలో కీర్తిని సంపాదించుకొన్న ఇందిరమ్మ, గణిత శాస్త్రంలో అఖండ కీర్తి నార్జించిన శకుంతలాదేవి, భారత కవి కోకిలగా ప్రసిద్ధి గాంచి బాపూజీకి అనుయాయిగా వుండి స్వాతంత్ర్యం కోసం పోరాడిన సరోజినీ నాయుడు, ఆంధ్ర మహిళా సభ స్థాపించి అనేక మంది దిక్కులేని స్త్రీల నాదరించి ఆదర్శ మహిళగా పేరు గాంచిన




దుర్గాబాయి వీరంతా స్త్రీలే. ఇలా స్త్రీలలో చాలామంది మానసికంగా ఎదుగుదలను సాధించి అనేక రంగాలలో ప్రఖ్యాతి గాంచిన వారున్నారు. అప్రయోజకులైన మగ బిడ్డల కంటే ప్రయోజకు[illegible] ఆడ పిల్లలే మేలు. అధిక సం[illegible]నంతో శారీరకంగా, ఆర్థికంగా, మానసికంగా కృశించి దిక్కు తెలియని స్థితిలో వారిని గాలికి వదలి వేయడం కంటే పరిమిత కుటుంబంతో వున్న ఒక రిద్దరు బిడ్డలను (ఆడగాని, మగగాని) చక్కగా చదివించి ప్రయోజకులను చేసి సమాజాభి వృద్ధికి, తద్వారా దేశ సౌభాగ్యానికి తోడ్పడడమే నేటి మహిళల కర్తవ్యం.

అచ్యుతుని సత్యవతి,
పర్చూరు. □

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

గర్భస్థ శిశువు చెప్పిన కథలు

కథ వ్యాసం రాసిన వారి పేరు : ______________________

______________________

పూర్తి చిరునామా ______________________

పిన్ కోడ్ : ______________________

# హైదరాబాద్ నోట్‌బుక్

## మలేషియా. ఆంధ్ర నాయకులకు తెలుగు విశ్వ విద్యాలయం సత్కారం :

తెలుగు విశ్వ విద్యాలయం డిసెంబర్ 8 వ తేదీన మలేషియా తెలుగు నాయకులకు చేసిన సత్కార సభలో ప్రపంచమంతటా ఉన్న తెలుగువారి సాంఘిక సాంస్కృతిక విద్యా సంబంధాల సాన్నిహిత్యానికి మరొక ప్రపంచ తెలుగు మహాసభ ఏర్పాటు చేయడం అవసరమని పలువురు ప్రముఖులు సూచించారు. కౌలాలంపూర్‌లో ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభ నిర్వహించిన మలేషియా ఆంధ్ర మహాసభ అధ్యక్షుడు డాక్టర్ సి. అప్పారావు ప్రసంగిస్తూ, ప్రపంచ తెలుగు మహాసభ ఎప్పుడూ ఏటేటా జరుగాలని, విదేశాలలోని తెలుగు వారు భారతదేశంనుంచి, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం నుంచి, రాష్ట్ర ప్రభుత్వం నుంచి, తెలుగు విశ్వ విద్యాలయం నుంచి సాంస్కృతిక సాహాయ్యం ప్రతీక్షిస్తారని అన్నారు. తెలుగు భాషా సాహిత్యాల ప్రపంచ వ్యాప్త ప్రచారానికి కృషి జరుగాలని, అప్పుడు ప్రపంచ ప్రజలు తెలుగు సౌందర్య మాధుర్యాలను తెలుసుకోగలరని ఆయన సూచించారు. అమెరికాలోని విస్కాన్సిన్ విశ్వ విద్యాలయంలో తమిళభాష బోధింపబడుతున్నప్పుడు, తెలుగు కూడా అలాటి స్థానాన్ని ఎందుకు సంపాదించరాదని ఆయన ప్రశ్నించారు. విదేశాలలోని తెలుగు వారికి ఎంతో సేవ చేసిన అంతర్జాతీయ తెలుగు సంస్థ రద్దయినందుకు విదేశాల తెలుగు వారు చాల నిరాశ చెందారని, కాని, అది రద్దుకాక తెలుగు విశ్వ విద్యాలయంలో లీనమైందని తెలిసిన తర్వాత వారి మనస్సు కుదుట పడిందని, ఇప్పుడు దాని పేరు అంతర్జాతీయ తెలుగు కేంద్రమని తెలిసిందని డాక్టర్ అప్పారావు అన్నారు. 1975 లో ప్రథమ ప్రపంచ తెలుగు మహాసభను రాష్ట్రంలో నిర్వహించిన శ్రీ మండలి వెంకట కృష్ణారావు ప్రసంగిస్తూ, మరొక ప్రపంచ తెలుగు మహాసభ రాష్ట్రంలో జరగాలని పలువురు కోరుకుంటున్నారని, ఇది శతాబ్దాలక్రితం వందల కొలది తెలుగు కుటుంబాలు విదేశాలకు వలస పోయిన విశాఖపట్నంలో 1990 లో జరుగవచ్చునని అన్నారు. తెలుగు విశ్వ విద్యాలయంలో చాల సంస్థలు లీనం కావడంవల్ల ఆ సంస్థల బాధ్యతా భారం విశ్వ విద్యాలయానికి ఎక్కువయిందని ఆయన వివిధ అకాడెమీల లీనీకరణం ప్రస్తావించి అన్నారు. రాష్ట్ర విద్యా శాఖా కార్యదర్శి శ్రీ ఎస్. కాశీ పాండ్యన్ ప్రసంగిస్తూ ప్రపంచ మహా సభను ఏర్పాటు చేయాలని రాష్ట్ర ప్రభుత్వం ఆలోచిస్తున్నదని, మహా సభాస్థలి నిర్ణయం త్వరలో జరుగగలదని అన్నారు. ప్రాచీన కాలంలో తెలుగువారు నూతన ప్రాంతాలకు వెళ్ళి తమ అస్తిత్వాన్ని స్థిరపరచుకొనడంలో చాల ఉత్సాహవంతులుగా వుండేవారు గనుక ఆసియా ఖండపు మారు మూలలకూ వ్యాపించారు. ఉదాహరణకు తమిళనాడు, ఒరిస్సాల రాష్ట్రాలలో వున్నంతమంది తెలుగు వారితో పోలిస్తే, ఆ రాష్ట్రాలలో వున్న తమిళుల సంఖ్య చాల తక్కువ. తమిళనాడులోని జనాభాలో మూడవ వంతు తెలుగు సంతతివారు. అక్కడి తెలుగువారి తెలుగు భాష శ్రద్ధ లేని దానివలన నీరసించి పోతున్నది. కనుక తెలుగు విశ్వ విద్యాలయం ఇతర రాష్ట్రాలలోని, ఇతర దేశాలలోని తెలుగు భాషను, తెలుగు కళలను ప్రోత్సహించాలి - అని శ్రీ కాశీ పాండ్యన్ కోరారు. తెలుగు విశ్వ విద్యాలయం వైస్ ఛాన్సలర్ డాక్టర్ తూమాటి దోణప్ప ప్రారంభంలో మలేషియా ఆంధ్ర నాయకులకు స్వాగతం చెబుతూ, తెలుగు విశ్వ విద్యాలయం తలపెట్టిన కార్యక్రమాలను, ముఖ్యంగా విదేశాలలోని తెలుగు వారికి అంతర్జాతీయ తెలుగు కేంద్రం ద్వారా చేయ దలపెట్టిన సహాయ సహకారాలను వివరించారు.

## తెలుగు తేజం ఆవిష్కరణ :

విదేశాంధ్ర సేవా కేంద్రం డిసెంబరు 8 వ తేదీన సురవరం ప్రతాపరెడ్డి హాలులో ఏర్పాటు చేసిన సమావేశంలో శ్రీ మండలి వెంకట కృష్ణారావు ప్రసంగిస్తూ, ప్రథమ ప్రపంచ మహాసభ విచ్ఛిన్నోద్యమవాదుల ఉద్యమాలతో ఛిన్నాభిన్నమైన తెలుగు జాతిని, భాషా సంస్కృతుల ద్వారా ఏకం చేసిందని, ఆ మహాసభ ప్రపంచమంతటా తెలుగు కార్యక్రమాలను వ్యాపింప జేసిందని అన్నారు. ఈ సమావేశానికి ఆంధ్రప్రదేశ్ లోకాయుక్త శ్రీ ఆవుల సాంబశివరావు అధ్యక్షత వహించారు. హిమాచల్ ప్రదేశ్ మాజీ గవర్నర్ శ్రీ ఎన్. చక్రవర్తి ముఖ్య అతిథిగా ఉన్నారు. శ్రీ మండలి వెంకట కృష్ణారావు రచించిన వ్యాస సంకలనం "తెలుగు తేజము"ను మలేషియా ఆంధ్ర నాయకులు డాక్టర్ సి. అప్పారావు ఆవిష్కరించారు. ప్రఖ్యాత చలన చిత్ర నటులు డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావు మలేషియా ఆంధ్ర నాయకులకు, తదితరులకు మెమెంటోలు బహూకరిస్తూ, ప్రపంచ తెలుగు మహాసభ ఏటా జరుగాలని కోరారు. "తెలుగు తేజము" గురించి శ్రీ ఆవుల సాంబశివరావు, డాక్టర్ పి. ఎస్. ఆర్. అప్పారావు ప్రసంగించారు. మలేషియా తెలుగు సంఘం అధ్యక్షులు శ్రీ రామచంద్రన్, మలేషియా ఆంధ్ర ప్రచారకులు శ్రీ డి. శ్రీరాములు మలే షియా తెలుగువారి శుభాకాంక్షలు తెలిపారు.

## తెలుగు విశ్వ విద్యాలయం ప్రథమ వ్యవస్థాపన దినోత్సవం :–

తెలుగు విశ్వ విద్యాలయం ప్రథమ వ్యవస్థాపన దినోత్సవం డిసెంబర్ 2వ తేదీన రవీంద్ర భారతిలో వైభవోపేతంగా జరిగింది. విశ్వ విద్యాలయం వైస్ ఛాన్సలర్ డాక్టర్ తూమాటి దోణప్ప స్వాగతం చెప్పినమీదట రిజిస్ట్రార్ శ్రీ టి. డి. ప్రసాదరావు నివేదిక చదివారు. ఉత్సవాన్ని ప్రారంభించిన రాష్ట్ర లోకాయుక్త శ్రీ ఆవుల సాంబశివరావు తమ ప్రసంగంలో తెలుగు విశ్వ విద్యాలయాలయం నిర్దిష్టమైన విషయాలపై నిర్ణయాలు చేయాలని, విషయాల పౌర్వాపర్యం ముఖ్యమని, తెలుగును నవీన భాషగా చేయాలని, లిపి సంస్కారం అవసరమని, భాష సుగమంగా, పదజాలం తేలికగా ఉండాలని, విజ్ఞానం విస్తరిస్తున్నది గనుక దానికి సరిపోయే భాష అవసరమని, నూతన విజ్ఞానాన్ని, తత్త్వ శాస్త్రాన్ని సమన్వయపరచగల పద్ధతిని విశ్వ విద్యాలయం అనుసరించాలని, సంస్కృతం వద్దనే మూర్ఖుడిని కాను గాని, మితిమీరిన సంస్కృతం వద్దని అన్నారు. విద్యా శాఖా మంత్రి శ్రీ ముద్దుకృష్ణమ నాయుడు తమ అధ్యక్షభాషణంలో ప్రభుత్వం తెలుగు విశ్వ విద్యాలయానికి ఏడు కోట్ల రూపాయల గ్రాంటు ఇచ్చిందని, తెలుగులో ఎక్కువ పరిశోధన జరగాలని, భాషను సరళతరం చేయాలని, తెలుగు, కన్నడాలకు ఒకే లిపి అవసరమని, తిరువేంద్రంలో నన్నయ భవన స్థాపనకు ప్రభుత్వం మూడు లక్షల గ్రాంటు ఇచ్చిందని; ప్రపంచ తెలుగు మహా సభలను ఏర్పాటుకై ప్రభుత్వం ఆలోచిస్తున్నదని, యు. జి. సి. పరిగణన కోసం యూనివర్శిటీ గ్రాంట్ కమిషన్ ఉపాధ్యక్షులు సచ్చిదానంద మూర్తి, కేంద్రంలోని తెలుగు మంత్రులు ప్రయత్నించాలని, మహిళా విశ్వ విద్యాలయానికి గుర్తింపు అవసరమని అన్నారు. విశ్వ విద్యాలయ అనుదాన ఆయోగ (యూనివర్శిటీ గ్రాంట్స్ కమిషన్) ఉపాధ్యక్షులు డాక్టర్ కొత్త సచ్చిదానందమూర్తి ప్రధాన ప్రసంగం చేస్తూ, ప్రజ్ఞావంతుడైన నరుడు శీలంలో ప్రతిష్ఠితుడై చిత్తాన్ని ప్రజ్ఞను భావింపగా వివేకోత్సాహాలు కల్గి భిన్నక్లేశుడై క్లేశాన్ని విడదీసి పారవేయ గల్గుతాడని బుద్ధఘోష దన్న మాటలు ఉదాహరించి భూమిని దున్నితే అనూర్వర అయిన భూమి ఉర్వర అయినట్లు శీలవంతుడై చిత్తభూమిని విపశ్యనా జ్ఞానాన్ని అభివృద్ధిచేస్తే నరుడు సుసంస్కృతుడౌతాడని, శీల ఏకాగ్రతా విపశ్యనల సంవర్ధనమే సంస్కృతి అని వివరించారు. ఏ సంస్కృతీ విలక్షణమైంది కాదని, భారతీయ సంస్కృతి ఆర్య ద్రావిడ కిరాత నిషాద సంస్కృతులు జానపద విశ్వాసాలు, గాథలు, అనుశీలనాత్మక చింతనలు ఇస్లామీయ పాశ్చాత్య నాగరకతాదుల పారస్పరిక ప్రక్రియచే పరిపుష్టమైందన్నారు. వాదే వారి కృషి వలన భాష సంపన్నమై వైజ్ఞానిక సాంకేతిక ప్రగతికి అనువుగా వుంటుందని, ఆ యా తెలుగు సంస్కృతిలోని విశిష్టతను తెలిపారు. భారతీయ, ఆంధ్ర సంస్కృతిని గూర్చి వ్యవస్థితంగా, బహు శాస్త్ర పద్ధతులను సమీకరించి తెలుగు విశ్వ విద్యాలయం పరిశోధనను పురికొల్పితే బాగుంటుందని, శ్రీశ్రీ వర్ణించినట్లు సంకెళ్ళులేని నేలమీద సంతోష చంద్రశాలను తెలుగు ప్రజలు నిర్మించుకొంటారని ఆశిస్తున్నానని తమ ఉదాత్త ప్రసంగం ముగించారు. పిదప విశ్వ విద్యాలయం డాక్టర్ సచ్చిదానందమూర్తిని కాశ్మీర శాలువతో సన్మానించింది. రిజిస్ట్రార్ శ్రీ టి. డి. ప్రసాదరావు ధన్యవాదాలతో ఉత్సవం సమాప్తమైంది. తర్వాత కుమారి కె. శోభానాయుడు కూచిపూడి నృత్యం ప్రదర్శించారు.

## ఉపశ్రుతి :–

ఒక కవితల్లజానికి ప్రమాదం జరిగిందట. కర్ర ఊనుకొని నడుస్తున్నారు. ఎందుకుసార్ కర్ర సాయం పొందుతున్నారు?- అనడిగాను. ఆయన ఏదో సమాధానం చెప్పారు. పక్కనవున్న మిత్రులు శ్రీ అబ్బూరి వరద రాజేశ్వరరావు వెంటనే "కర్రలే మనతో ఆఖరు వరకు వచ్చేవి. పరలోకమూ కర్రలతోనే' అన్నారు ఛలోక్తిగా.

–తిరుమల రామచంద్ర

# గతుకుల బతుకులు

## "శ్రీమతి వాసిరెడ్డి"

"అమ్మాయి బ్రతికేనా"?

"ఏమో పాపం ఎంత తాగిందో. కల్తీ లేని పురుగు మందైతే ఓ చుక్క గొంతులోకి జారితే చాలంటారు ప్రాణం పోవడానికి".

"ఏ స్థితిలో వున్నప్పుడు చూసారో?"

"తాగేటప్పుడు బిడ్డలయినా జ్ఞాపకానికి రాలేదు గాబోలు పిచ్చి సన్నాసికి".

"ఏమిటోనమ్మా ఈ రోజుల్లోనే ఇట్లా కాస్త కష్ట మనిపిస్తే చాలు ఏదో ఒకటి మింగేసెయ్యడం మారోజుల్లో మేం అత్తారిళ్ళలో ఎంతెంత ఆరళ్ళు కిమ్మన కుండా భరించేవాళ్ళంగాదు. ఇంట్లో స్వతంత్రంగా చేత్తో తీసుకు తినడాని కుండేదా? మొగుడితో ఓ మాటా మంతీ ఏముండేది?"

"మాటా ఇంకానా. ఏ అర్ధరాత్రో అపరాత్రో ఏదైనా మాటుంటే మాట్లాడు కోవడం ఆడపుటకే అంత. ఆడదై పుట్టడం కష్టాలు పడటానికి కాక అందలా లెక్కడానికా".

"అయినా ఆ అమ్మాయికి చచ్చిపోదామనుకునేంత కష్టమే మొచ్చిందో. మొగుడు తాగు బోతైనా అత్త మామలు నెత్తి నెట్టుకుంటారను కుంటారు!"

"ఆ నెత్తి నెట్టుకుంటారు. చూసే వాళ్ళ కలాగే అన్పిస్తారు మావ ఫరవాలేదు గాని ఆ అత్తదగ్గర మాలావుచాణాతనం వుంది కనపడదు గాని" అంతా చేసుకున్న వాళ్ళ అదృష్టంలో వుంది. ఇదే నష్ట జాతకురాలు. దీన్ని దరిద్రమే ఆడట్టా ఎందుక్కాకుండా పోయాడు సుఖపడటానికీ గీతుండాలక్కాయ్. పెద్దాడు వాడి సంపాదనా వాడూ పెళ్ళాం పిల్లల్తో ఎంత సుఖంగా వుంటున్నారు. పెద్దదాని గీత తినబుట్టిందది" అంటూ ఓ రాగాలు తీస్తుంది. ఈ పిల్ల నెప్పుడూ సూటీపోటీ మాటల్తో సాధించడమే.

"పైగా ఇదో హటా కొడుకు నిర్వాకానికి. ఆగితేదో తన మొహానయినా వుండొచ్చుగా బిడ్డలిద్దరూ రత్నాలనిపించుకునే గీత. పరాయమ్మ గన్న బిడ్డ తేరగా ఉందని సాధించడం".

"అసలింతకూ ఎందుకు తాగిందో"

"ఏమో ఎందుకు తాగిందో ఇంట్లో గుట్టు బయటకు రానిస్తారా. ఆ మొగుడు చచ్చినోడి వెప్పుడూ వుండే భాగోతమేగా పీకలమొయ్యా తాగడం తిరగడం పిల్లలయినా దగ్గరుంటే ఎలా వుండేదో!"

"ఆ పిల్లలు ఏలెడు లేరు చదువులు చదువులంటూ పట్నం పంపితిరి"

"ఎవరి ప్రాణాల పైన ఎవరికి తీపుండదు. ఎంతో బలమైన కారణం వుంటే అంతకు తెగించిందో?"

ఇట్లా ఎవరికీ తోచిన విధంగా వాళ్ళు తలా ఒక మాటా వాళ్ళు సమాధానాలు ఆశించిందీ లేదు. వాళ్ళకు సమాధానం చెప్పడానికి ఆ మేడలో జీతగాడు మినహా ఎవ్వరూ లేనూ లేరు.

* * * * *

ఒకరికి తృప్తినీ హాయినీ కలిగించే విషయమే మరొకరి పాలిట శాపంగా పరిణమిస్తూంటుంది. డాక్టరు తన్ని బ్రతికించి ఘనకార్యం చేసానను కొంటుంటే తన పరిస్థితి ఎంత దయనీయంగా తయారైంది. తమ పరువు ప్రతిష్ఠ లేవో మంట గలిసి పోయాయని అత్తమామల కోర చూపులు. కూతురి దురదృష్టానికి తల్లిదండ్రుల కుమిలింపు. బంధు జనాల పరామర్శలు చాలా చీదరగా అసహ్యంగా వుంది. ఇష్టం లేని పెండ్లి తప్పించుకోడానికి ఏ గడ్డి పోచనో ఆధారం చేసుకుంటే ఆ గడ్డి పోచే పామై కరిచినట్లైంది. దొంగతనం చేస్తూ పట్టు పడ్డ దానిలా ఇతరుల ముఖం చూడాలంటే సిగ్గుగా వుంది. మొగుడి మహరాజు కేమి? తన పేకాటేమొ, తాగుడేమొ ఎప్పటి చిద్విలాసం. తన తాగుబోతు స్నేహితుడు పెళ్ళాంపై చెయ్యబోయిన అత్యాచారాన్ని కప్పెట్టుకోడానికి, "నీ మాజీ ప్రియుడి కేమైనా సుస్తీ చేసినట్లు కబురందించా? కాకపోతే ఎందుకింత తెగించావ్? ఈ అమృతం ఇద్దరం కలిసి తాగుదాం రా. ఎంత ఖుషీగా ఎంత మజాగా వుంటుందో?" ఇదీ అతగాడి పరామర్శ.

తానింటర్మీడియెట్ చదివేటప్పుడు తన క్లాస్ మేటెవడో సాహిత్యంలో తనకున్న పరిజ్ఞానాన్నంతా వుపయోగించి ఓ లేఖ వ్రాశాడు. మరి దాన్ని ప్రేమ లేఖే అంటారో లేక తెలిసీ తెలియని వయస్సులో చేసే ఆకతాయి పనే అంటారో. ఏమైనా ఆ లేఖ పుణ్యమా అని ఇంటర్ పూర్తవడంతో తన చదువుకి బ్రేక్. మేన బావతో మూడు ముళ్ళూ, మేనమామ కావాలని మేన కోడలిని పట్టపురాణిని చేసాడు. అక్క చెల్లెళ్ళ కెవరికీ లేని సౌభాగ్యం. ఒళ్ళంతా బంగారం. కానీ తనకేమొ ఇప్పటి తన పరిస్థితి స్మశానంలో పీనుగులా అనిపిస్తోంది.

గది నాలుగు మూలలా మంటలు లేస్తుంటే గది మధ్య చిక్కుకు పోయి పొగలో వుక్కిరి బిక్కిరౌతున్నట్టుంది. ఈ మంటల మధ్య నుండి బయటన్నా పడాలి. ఆహుతన్నా అయిపోవాలి. ధాత్రిలో ముందెన్నడూ లేని క్రొత్తరకపు ఆలోచనలు. ధాత్రికి విడ్డూరంగానూ నమ్మశక్యం గాకుండానూ వున్నది. మామయ్య అలా ఎందుకు మాట్లాడు తున్నట్లు? తన ఆలోచనల లోతు తెలుసుకోడానికా? లేక చుట్టపక్కాల్లో తన ఔన్నత్యాన్ని చాటుకోడానికా? తనిష్ట పడితే అంగీకారాన్ని తెలియ జేస్తే తనకు భర్త నుండి విడాకులట. పిల్లల బాధ్యత తామే పెట్టుకుని తనకు మరో పెళ్లి చేస్తారట. అప్పుడు గాని పుత్రుడికి బుద్ధిరాదుట. దారికి రాడట. అంత చికాకులోనూ నవ్వు. తను "అలాగే కానివ్వ మామయ్యా" అంటే ఏం చేస్తారో? మామయ్యలో అంతటి ఔన్నత్యం వుందా? ఇలాంటి పనికి



వీరేశలింగం మరో జన్మ ఎత్తాల్సిందే.

అసలు తనకీ మధ్య ఓ అన్నాలేదు నాన్నా లేదు మామా లేదు మగాళ్ళుంటేనే మందుకొస్తోంది. సమాజంలో గౌరవ ప్రదమైన ఉన్నత మైన స్థానాన్ని సుస్థిరం చేసుకోడానికి ఆడవాళ్ళ చేత అరవ చాకిరీ చేయించు కోడానికి పురాణాలు, ధర్మాలు, పూజలు, పునస్కారాలు పకడ్బందీగా ఎన్ని ఏర్పాట్లు. రోజూ ఇంట్లో తిరిగే మగవాళ్ళైనా సరే వాళ్ళొస్తే ఆడవాళ్ళు తప్పుకోవలసిందే. లేచి నిలబడాల్సిందే. తన ఈడు వాడే అయిన తన మరిదితో సైతం తాను ప్రక్కన కుర్చీలో కూర్చొని మాట్లాడలేదు. ఆడవాళ్ళ అణు వణువునా మగవాళ్ళ పట్ల ఆధిక్యతా భావం జీర్ణించుకు పోయింది. ఏమిటో ఈ మగతనానికున్న గొప్ప. అసలీ ఆడజాతే బుద్ధి స్వాభిమానం లేని జాతిగా తయారు చేయబడ్డది.

బానిస మనస్తత్వం. పెంపుడు కుక్కల్లాంటి వాళ్ళం. లేకపోతే చదువుకోని వాళ్ళ నుండి డిగ్రీలు పుచ్చుకున్న వాళ్ళ వరకు పెళ్ళిలో మొగుడి మెడలో దండ వేస్తూ ఆదండను కళ్ళకద్దు కోవడం. ఒహత్తని చూస మరొహత్త మొగుడూ పెళ్ళాలంటే జీవిత భాగస్వాములు. అర్థం చేసుకున్న వాళ్ళైతే మంచి మిత్రులు ప్రేమికులుగా వుండాలి. మొగుడి పట్ల ఈ భక్తి భావం ఏమిటి? ఇలాంటి చర్యలతో తమంత తాముగా మొగుడి చేతికి చంద్రకోల నందించడమే. తన పెళ్ళిలో తానూ గంగిరెద్దులా ఆదే పని చేసింది. కానీ ఇప్పుడా ఘటన చూస్తుంటే మాత్రం వాళ్ళ బుర్ర పగల గొట్టేసెయ్యాలన్నంత కోపం వస్తోంది. తనలో ఈ బడబానలం చల్లారే మార్గమేమిటో? ఆరోజే చచ్చి పోయుంటే గొడవ లేకుండా పోయేది. బ్రతికి సాముకు తినేదేమీ కనిపించడంలా. జంతువు బ్రతుక్కీ తన బ్రతుక్కీ తేడా ఏమీ కనిపించడంలా. తినడం, నిద్రపోవటం, లేవడం, బ్రతుకు లాగించడం ఇలా ఎంత కాలం? ఒక ప్రేమా, అనురాగం, అనుభూతీ, సుఖం సంతోషం ఏమీ లేవు. తను ఆడంబరంగా తయారై ఇతరులముందు ఆధిక్యతను చాటు కొంటూ కృత్రిమ సంతోషాన్నభినయిస్తూ బ్రతకాల్సిందే. జంతువుల పనేనయం వాటికి మానసిక మైన ఘర్షణైనా వుండదు. అలా అలా తేనెతుట్టెకు ఛట్టిన ఈగల్లా ముసురుకున్న ఆలోచనలతో అలిసి పోయిన ధాత్రి నిద్రలోకి జారుకున్నదీ.

కష్టాలతో బాధలతో అలిసిన వాళ్ళకు నిద్రను మించిన అప్పులు మరెవరుంటారు!

* * * * * *

తండ్రిని తనతో హైదరాబాదు తీసుకెళ్ళ డాని కొచ్చిన ఉజ్వల ధాత్రిని చూసి పోవడాని కొచ్చింది. ఉజ్వలను చూస్తే ధాత్రి అత్త సీతమ్మకు వళ్ళు మంట. చదువుకున్నానన్న పొగరు. మొగుణ్ణొదిలి ఢిల్లీ కెక్కింది ఉద్యోగం చేసి ఊళ్ళేల్దామని. వీళ్ళాంటి వాళ్ళైతే మాత్రం భర్త నొదిలీ కాపరం నాశనం చేసుకుంటారా? ఎంత వేధిస్తే మాత్రం ఓర్పుతో పడుండాలి. రాత బాగుంటే భర్త మనస్సు మారక పోతుందా. మొగుణ్ణొదిలి పెట్టిన దాని

# గతుకుల బతుకులు

బ్రతుకేం బ్రతుకు? ఇదీ ఉజ్వల పట్ల సీతమ్మ కోపానికి కారణం. మొగుడు ఎంత వేధించినా అత్త మామలు ఎన్ని బాధలు పెట్టినా ఖర్మనుకొని పడుంటే ఉత్తమ ఇల్లాలు. ఎదురు తిరిగితే బరితెగించిన వాళ్ళు. అందుకే ఈ పరమ కసాయి, కిరాతకపు, దుర్మార్గపు సమాజానికి భయపడే అత్తింట్లో ఎన్ని బాధలయినా పడుతున్నారు. జీవితాలను ఆహుతి చేసుకుంటున్నారు తప్ప తెగించి పుట్టింటికి రాలేక పోవడం. పుట్టింటి వాళ్ళు ఆదరించడానికి సిద్ధ పడక పోవడం. తమ బ్రతుకు తమదిగా బ్రతక లేక పోవడం. "మూడు ముళ్ళూ పడ్డాక ఆడదానికి చావైనా బ్రతుకైనా ఆ మొగుడితో నేనంటూ" వెధవ సూక్తులు. ఎంత కట్టుకున్న వాడైతే మాత్రం.... ఒక మనిషిని వేరొక మనిషి వేధించి బాధించి ఆహుతి చెయ్యడం ఇదెక్కడి న్యాయం? ఇదేమి న్యాయం? తోడేలు, పెద్దపులి వేటకుక్కల న్యాయం.

ఇంటికొచ్చిన మనిషిని ఏమీ అనలేక "ఆవిడగారు కోళ్ళ ఫారం దగ్గర కెళ్ళిందనుకుంటా" ముఖం చిట్లించుకుంటూ అన్నది సీతమ్మ.

మనస్సులోనే అమ్మయ్య అనుకున్నది ఉజ్వల. వేగుల వాడిలా ఈవిడక్కడక్కడే తిరుగుతుంటే తనూ ధాత్రీ మనస్సు విప్పి మాట్లాడుకోలేరు కూడా.

వేగంగా అడుగు లేసుకుంటూ ఇంటికి ఒఫర్లాంగు దూరంలో వున్న కోళ్ళఫారం కేసి నడిచింది ఉజ్వల.

వెనుక నుండే ఉజ్వలను చూస్తూ సీతమ్మ "గజ్జెల గుఱ్ఱంలా మొగుణ్ణొదిలేసి నునుపు దేలింది ఉద్యోగం వెలగ బెడుతూ" తన అక్కసు వెళ్ళ గక్కింది.

* * * * *

ఉజ్వలను చూసిన ధాత్రి ముఖం వికసిత పద్మమే అయింది. "ఈ ఊరెప్పుడొచ్చావే నాకు తెలియదు" స్వరంలో దాచుకోలేని సంతోషం.

"అంతఃపురంలో వుండే నీకు మాలాంటి వాళ్ళ రాక పోకలెలా తెలుస్తాయి?" ఉడికిస్తూ అన్నది.

"ఇదేనా అంతఃపురం"? కోళ్ళ ఫారాన్ని చూపుతూ నవ్వుతూ అన్నది ధాత్రి.

"కోడిపెట్టల కది అంతఃపురం కాదేమిటి"? "అయితే నేను కోడి పెట్టనా"? అమాయకంగా ముఖం పెట్టింది ధాత్రి.

అప్పటి ధాత్రి ముఖాన్నావరించిన ఆనందం అమాయకత్వాన్ని చూసిన వాళ్ళెవరైనా ఆ అమ్మాయి అంతకు కొద్ది కాలం ముందే ఆత్మహత్యకు పాల్పడిందంటే నమ్మడం కష్టమే. కష్టాలతో పాటే అప్పుడప్పుడూ ఇలాంటి వేవో చిన్ని చిన్ని ఆనందపు అనుభూతులు కలుగుతూ వుండక పోతే మనిషి మనుగడ సాగించడమే కష్టమవుతుంది.

స్నేహితురాలిని చూసిన ఆనందం నుండీ వాస్తవంలో కొచ్చింది ధాత్రి. "ఎన్నాళ్ళుంటావే ఇక్కడ. పద అలా ఆవేపచెట్టు క్రింద కూర్చుందాం".

ఇద్దరూ వేపచెట్టు నీడన చతికిల బడ్డారు. మందు మింగింతరువాత ధాత్రి బాగా చిక్కి పోయి కళ్ళలో ప్రాణాలు పెట్టుకొ నున్నదని చెప్పింది అమ్మ. కాని ఇప్పుడు మనిషిని చూస్తే ఫరవాలేదని పిస్తోంది.

"రేపే నాన్నను హైదరాబాదు తీసుకెళదామను కుంటున్నానే. నాన్న కంటికి శుక్లం ఆపరేషన్ చేయించాలి."

"మరి అమ్మను తీసుకెళ్ళవ్".

"అమ్మ తరువాతొస్తుంది". "ఏమే ధాత్రీ అంత పనికి ఎలా తెగించావే. నీ బిడ్డలు గాని మాలాంటి వాళ్ళెవరూ గాని బుర్రలో కైనా రాలేదంటే" మానుతున్న గాయాన్ని కెలకడమా మానడమా అని తటపటా యిస్తూనే అడిగింది ఉజ్వల.

ధాత్రి కళ్ళు నిండా నీరులయ్యాయి. తల వంచుకున్నది. మాట్లాడలా.

"నిన్ను కదిలించి ఏడ్పించాలని కాదే. నిజం చెప్పాలంటే ఆత్మహత్యకు పాల్పడే వాళ్ళంటే నాకు చాలా అసహ్యం. మన సమస్యలకు పరిష్కారం చావడమా? నాకు మించిన కష్టాలొచ్చినయ్యంటే నీకు. నీకు కట్టుకున్న వాడొక్కడి తోటే బాధ. నన్ను అత్తా, మామా, చివరికి మా ఆయన మేనమామ కూడా ఓ సారి చేయి చేసుకున్నాడే. నా సంగతి నీకు తెలుసుగా చిన్నప్పుడెవరైనా నన్నో చిన్న మాటన్నా పడేదాన్నేనా? అల్లాంటి నేను చచ్చానా?" ధాత్రి ముఖం లోకి చూస్తూ అన్నది ఉజ్వల.

"నీ సంగతి వేరు. నీ అంత ధైర్యం నా కెప్పుడూ లేదు". ఏడుపు దిగమింగుకుంటూ అన్నది ధాత్రి.

"ధైర్యమేమిటే సమస్యలకు పరిష్కారం చావడమా? బిడ్డల్ని కన్నావ్ వాళ్ళపట్ల నీ బాధ్యతేమిటి? నువ్వు చచ్చిన మర్నాడు మీ ఆయన పూలరంగల్లా పెళ్ళిపీటెక్కుతాడు. అభం శుభం తెలియని ఆ పసివాళ్ళేమైపోతారు? కష్టమొచ్చినప్పుడల్లా చావడానికా మనం పుట్టింది? అలా అయితే ఈ దేశంలో మనల్ని మించి ఎన్నో అవస్థలు పడుతున్న వాళ్ళెందరు లేరు! మనకు కడుపు నింపుకోవడం సమస్యకాదు. తెల్లారి లేస్తే పొట్టకోసం దేవుల్లాట. ఆ దేవుల్లాటలో మొగుడూ పెళ్ళాల కీచులాటలు కళ్ళముందే బిడ్డలు ఆర్ధాకలితో అనారోగ్యంతో కుములుతూ కునారిల్లుతుంటే... చావే అంతిమ పరిష్కారమయితే ఈ దేశంలో సగం మందికి పైగా బంగాళాఖాతంలో దూకాల్సిందే"

"తినడానికి లేకపోయినా మన బ్రతుకులకంటే వాళ్ళే ఎంతన్నా నయం ఒకప్పుడు కొట్టుకున్నా తిట్టుకున్నా ఇట్టే కలిసిపోతారు. నీతోటిదే లోకం అనుకుంటారు ఒకరి కొకరు. మనంత కుళ్ళు వాళ్ళలో ఏ కోశానా వుండదు." కుళ్ళు అనే మాటను వత్తి పలుకుతూ అన్నది ధాత్రి.

"అవునులే ఆకటి బాధ నీకూ నాకూ ఏమి తెలుస్తుంది. అనుభవంలో కొస్తేగాని తెలియదు మన మధ్యరకం వాళ్ళవి మేడిపండు జీవితాలు. ఇంటిపేరు కస్తూరివారు. ఇంటిలో గబ్బిలాల కంపు. మనం పడేబాధలు ఇబ్బందులు బయటకు చెప్పుకోలేం. సుఖ సంతోషాలలో

ఒలలాడుతున్నట్లు ఇతరులు భ్రమపడాలి. మనం లోలోపలే కుమిలిపోవాలి." "సరే ప్రస్తుతం శ్రీవారేమంటున్నారు"?

"ఏముంది అనడానికి మన నిత్య కార్యక్రమం షరా మామూలే నాకేనే ఏమిటో ఈ బ్రతుకు బండిని గతుకుల దారివెంబడి ఇలా ఎన్నాళ్ళు లాగించడమా అని."

"ఈ కోళ్ళఫారం నీక్కొంచెం కాలక్షేపమేమో."

"ఏం కాలక్షేపం లేవే వెధవకంపు. ఏ పనిలో వున్నా ఒంటరితనం అనే పెనుభూతం నన్ను వదిలేట్లు లేదే. దాంతో బుర్రలోకి పిచ్చి పిచ్చి ఆలోచనలు. పోనీ పిల్లల్ని హాస్టల్లో వేసేకి ఇల్లు అద్దెకు తీసుకుని ఇంటిదగ్గరుండే పిల్లల్ని స్కూలుకు పంపచ్చు. నాకూ కాస్త హాయిగా వుంటుందనుకుంటే టౌనులో ఇంక ఈయనగారికి పట్టపగ్గాలుండవు. ఆ అనుభవమూ అయింది."

"మీ అమ్మా వాళ్ళింటికెళ్ళి కొద్దికాలం వుండి రాకూడదూ!"

"ఆ పైన"

"ఏమైనా నీవు మాత్రం ఎలాంటి తొందరపాటు పనీ చెయ్యకు ఉన్నంతలో సాధ్యమైనంతవరకు సుఖపడే ప్రయత్నం చేయాలి గాని...."

"ఏమి సుఖమో నీలాంటి స్నేహితురాళ్ళున్నా గుండె బరువు కొంత దించుకోంటుండచ్చు! గుడ్డిలో మెల్ల. మామయ్యా నావైపునుండే ఆలోచిస్తున్నారు. ఆచరణలో సాధ్యమవుతుందో లేదో నే. రామకృష్ణయ్య మాష్టారు హెడ్మాస్టరుగా చేసి రిటైరయ్యారు గదా! ఆయన సాయంతో 6వ క్లాస్ వరకు ఓ తెలుగు మీడియం స్కూలు మన ఊరిలోనే పెట్టి నడిపితే ఎలా వుంటుంది? అని."

"ఓ భేషైన ఆలోచన. మనం గుర్తుంచుకోవలసిన విషయం ఒకటుందే ధాత్రీ. లోకానికి భయపడుతున్నంతకాలం ఈలోకం మనల్ని తరిమి తరిమి కొడుతూనే వుంటుందే. మనం ధైర్యంగా ఎదురు తిరిగామో తోక ముడవడమే. మనం ఏ తప్పు చేయనపుడు ఈ లోకానికి ఎందుకు భయపడాలే. చివరికి కట్టుకున్న వాణ్ణయినా ఎదిరించడమే తప్ప మన ప్రాణాల్ని ఎందుకు బలి చేసుకోవాలి? స్కూలు కాకపోతే ఇంకోటి. ధైర్యం మాత్రం వీడకు."

"పద ఇంటికి పోదాం."

"వద్దులేవే బాబూ ఇంతసేపు మనిద్దరం ఇక్కడ మాట్లాడుకోవడమంటే ప్రతిపక్షాలు కలిసి సమావేశమైతే పరిపాలిస్తున్న వాళ్ళను గద్దె దింపడానికి ఏదో గూడు పుఠాణీ జరుపుతున్నారన్నట్లు మీ అత్తగారికిప్పటికే బి. పి. పెరిగి పోయుండాలి ఇంకనేనిటు ఇంటికి పోతాన్లేవే" నవ్వుతూ అన్నది ఉజ్వల.

"ఏం ఫరవాలేదులే. కొంచెం కాఫీ తాగి వెళుదువు." అత్తయ్యకు నేనేం భయపడనులే అన్నట్లుంది ధాత్రి తీరు.

"ఓ ఫరవాలేదే నెగ్గుకొచ్చేట్లే వున్నావు పద నీచేతి కాఫీ త్రాగే వెడతాను." ఇద్దరూ ఇంటి వైపుకి బయలుదేరారు. □

# మ్యాజిక్ చేసే పోలీసు ఇన్స్పెక్టర్



ఇంద్రజాల ప్రదర్శన ఇస్తున్న శ్రీ రామకృష్ణారావు

మంచిగా ఆలోచిస్తే పోలీసులంటే ఎక్కువగా రక్షకభటులనీ, దొంగలను పట్టుకోవటం, శాంతి భద్రతలను పరిరక్షించటం మొదలగునవి చేస్తారని అనుకుంటాం. కొంచెం చెడుగా (యధార్థంగా) ఆలోచిస్తే భక్షక భటులనీ, లాకప్పులో శిరోముండనాలు, మానభంగాలు, హత్యలు వంటివి కూడా వీరే అప్పుడప్పుడు చేస్తుంటారని అనుకుంటూ వుంటాం. అయితే పోలీసులు పైన చెప్పినవే కాకుండా మ్యాజిక్‌లు చేసి ప్రజలను ఆహ్లాదపరుస్తారని, కూడా నిరూపించారు విజయవాడ అర్బన్ జిల్లాలోని గన్నవరం సర్కిల్ ఇనస్పెక్టర్ శ్రీ దశికరామకృష్ణారావు.

విద్యార్థి దశనుండే ట్రిక్కులు, మ్యాజిక్‌లు చేయడం పట్ల ఆసక్తి గలిగిన రామకృష్ణారావు 1943వ సంవత్సరంలో పశ్చిమగోదావరి జిల్లా నరసాపూర్ తాలుకాలోని జగన్నాధపురం గ్రామంలో జన్మించారు. ఏలూరులోనూ, గుంటూరు హిందూ కాలేజిలో కూడ విద్యాభ్యాసం చేసి సైన్సులో పట్టభద్రులైన శ్రీ రామకృష్ణారావు 1966లో పోలీస్ సబ్ ఇనస్పెక్టర్‌గా జీవితం ప్రారంభించారు.

అనంతపూర్‌కు చెందిన పి. అంజనేయులు, ఏలూరుకు చెందిన చార్వాక లానంద్, కలకత్తాకు చెందిన ఒ. పి. అగర్వాల్, హైదరాబాద్‌కు చెందిన బి. వి. పట్టాభిరామ్ వంటి విఖ్యాత ఇంద్రజాలికుల వల్ల స్ఫూర్తిని, ప్రోత్సాహాన్ని పొందిన దశిక రామకృష్ణారావు ఇంతవరకు 92 చోట్ల తన మ్యాజిక్‌ను ప్రదర్శించి పలువురు ప్రముఖుల మన్ననలను పొందారు.

1974లో మధ్యప్రదేశ్‌లో ప్రదర్శన యిచ్చిన రామకృష్ణారావుకు దర్శకులలోని ఎవరైన ఒకరు బంధించిన ఉచ్చు నుండి తనను తాను విడుదల చేసుకొనే 'హాంగింగ్ ట్రిక్' పట్ల మక్కువ ఎక్కువ.



శ్రీ దశిక రామకృష్ణారావు

శ్రీరామకృష్ణారావు క్రిందటి నెలలో హైదరాబాదులో జరిగిన అఖిలభారత పోలీసు డ్యూటీ మీట్‌లో పాల్గొని తన ప్రదర్శన ద్వారా రాష్ట్ర హోం మంత్రి వసంతనాగేశ్వరరావు డి. జి. పి. సర్దానా వంటి ప్రముఖులను ఆశ్చర్యంలో ముంచి వేశారు.

శ్రీరామకృష్ణారావు తన మాజిక్ ద్వారా నేరస్థులను మంచివారుగా మారిస్తే బాగుంటుంది.

—వయ్యాల్పి

# సియోల్ రజత పతక విజేత శీర జయరామ్



తెలుగు బిడ్డ సియోల్ ఆసియా క్రీడోత్సవాలలో రజత పతకము సాధించాడని చాలా మంది ఆంధ్రులకు తెలియదు. అందుకు కారణము మనకు కొన్ని క్రీడలలో ఆసక్తి యితర ఆటలయందు చిన్న చూపు ఉండటమే, విజయనగరం సమీపమున గల కురుప్పం అనే కుగ్రామములో పుట్టి, పార్వతీపురంలో విద్యాభ్యాసము చేసి జబల్‌పూర్‌లో సైన్యములో సిగ్నల్స్ శాఖలో పని చేయుచున్న 25 ఏళ్ళ శీర జయరామ్ బాక్సింగ్‌లో వెండి పతకము కైవసం చేసుకున్నారు. ఆసియా క్రీడలలో బాక్సింగ్‌లో పతకము సాధించిన ప్రప్రథమ ఆంధ్రుడు శీర జయరామ్.

పార్వతీపురంలో ఇంటర్మీడియెటు వరకు చదువుకున్న జయరామ్ సైన్యములో టెలిఫోన్ లైన్‌మన్‌గా చేరారు. తోటి సైనికులు క్రీడా పోటీలలో పాల్గొని పతకములు సాధించుట చూచిన జయరామ్ బాక్సింగ్ పోటీలలో పాల్గొనుట ప్రారంభించారు. దీక్షతో కృషి ఫలితముగా కొద్ది కాలములోనే జాతీయ స్థాయిలో గుర్తింపు పొందారు. 1982 ఢిల్లీ ఆసియా క్రీడలలో పాల్గొను అవకాశము కొద్దిలో తప్పింది. 1985లో ఢాకాలో జరిగిన సౌత్ ఏషియన్ ఫెడరేషన్ గేమ్స్‌లో పాల్గొని బంగారు పతకము గెల్చి అందరి ప్రశంసలు పొందారు. అంతకుముందు సంవత్సరము ఖాట్మండు లో జరిగిన పోటీలలో రజత పతక విజేత.

జయరామ్ సామాన్య కుటుంబములో పుట్టి కష్టము తెలిసినవాడు.నల్గురు సోదరులు, యిద్దరు సోదరీమణులు గల కుటుంబమును వృద్ధ తల్లి తండ్రులు పోషించుట కష్టమని భావించి చదువు మధ్యలో ఆపి సైన్యములో చేరారు.

బాంకాక్‌లో యిటీవల జరిగిన 12వ కింగ్స్ కప్ బాక్సింగ్ పోటీలలో, తొమ్మిదవ ప్రెసిడెంట్ కప్ పోటీలలో కాంస్య పతకాలు గెల్చారు.

సియోల్‌లో సాధించిన విజయానికి ప్రోత్సాహముగా 'హవల్దార్' స్థాయికి జయరామ్‌కి ప్రమోషన్ లభించింది. జయరామ్‌కి సైన్యములో ఆరు సంవత్సరముల అనుభవము ఉన్నది. రాబోవు ఒలింపిక్ క్రీడలలో పతకములు సాధించగలరని ఆశిద్దాం.

తెలుగువారు గర్వించ దగిన క్రీడాకారుడు శీర జయరామ్. కాని మన రాష్ట్ర ప్రభుత్వము ఈ విజయాన్ని గుర్తించి ప్రోత్సహించక పోవుట విచారకరము. అట్లే వాలీబాల్‌లో కాంస్య పతకము గెల్చిన జట్టులో ముగ్గురు ఆంధ్రులు కలరు. వారిని ప్రోత్సహించవలసిన బాధ్యత రాష్ట్ర క్రీడామండలికి గలదు.

– ముకరమ్

## న్యూఢిల్లీ లేఖ

అశ్వని ముఖచిత్రం కల పత్రిక చాలా ఆకర్షణీయంగా ఉంది. జయదుబాషీ గారి "కనపడకుండా పోతున్న ప్రభుత్వం" వ్యాసం చదివాను. నేటి సమకాలీన రాజకీయాలు కళ్ళకు కట్టినట్టుగా వివరిస్తున్నారు.

సాయినిరాజా, నేలకొండపల్లి

## కథలు

"పతివ్రత" కథ చాలా బాగుంది. భర్తను దారిలో నిలబెట్టడానికి ఆమె చాలా వెరైటీగా నటించింది.

జి. నాగరాజనాయుడు, నేలదానిపల్లి

★ ★ ★

"అనురాగపుటంచుల్లో" మా యింటిల్లిపాదిని ఆకర్షించింది. కథ మధ్యతరగతి కుటుంబాలకు దగ్గరగా వుంది. సీత పాత్ర సౌశీల్య భరితంగా సామాన్య గృహిణి స్పందనకు దగ్గరగా వుంది. మనుష్యుల ప్రవర్తన, ప్రవృత్తులను రచయిత్రి గారు చాలా చక్కగా ప్రతిఫలింపజేశారు.

పాలవరపు పద్మావతీదేవి, ఖమ్మం

## ఉత్తరాలు

( 4 వ పేజీ తరువాయి)

★ ★ ★

'అశ్వని' ముఖచిత్రంతో వెలువడిన సంచిక శోభాయమానంగా వుంది. "పతివ్రత", "అనురాగపుటంచుల్లో" కథలు చాలా బాగున్నాయి.

మోదేకుర్తి సత్యనారాయణ, అన్నవరం

## శీర్షికలు

ముఖచిత్రం అశ్వని చాలా అందంగా ముద్రించి అందించారు. సరికొత్త శీర్షిక "దూరదర్శనం" చదవడానికి సరదాగా వుంది. లతగారి వర్ణనలు రుచిగా, మధురంగా చదవాలనిపించేవిగా వున్నాయి.

షేక్ మస్తాను, గాలిబీబి, రేపల్లె

## విజ్ఞప్తి

1987 శ్రీరామనవమి పర్వదినంలోగా 'ఓం శ్రీరామ జయరామ జయజయ రామ' అన్న మంత్ర ప్రభావంతో, మారుతీ స్తోత్రంతో అద్భుత ఫలప్రదాయకమైన శ్రీరామ రక్షాస్తోత్రాన్ని భక్తుల సంపూర్ణ సలహా సహకారాలతో లక్ష ప్రతులు ప్రచురించి ఉచితంగా పంచి పెట్టదలచినాము. శ్రీ కోదండరామ భగవానుని దివ్య సుందర ముఖచిత్రంతో, శ్రీరామ రక్షా యంత్రపు ఫోటో తో అలరారు ఈ పుస్తక రత్నంలో 24 పుటలుంటాయి. రు. 100-00 అందజేయు ధన్యాత్ములకు వితరణ నిమిత్తం 50 ప్రతులు అంద జేయుటయేగాక కేంద్ర ప్రచురణల సెట్టును ఉచితంగా అందచేస్తాము.

దేశవ్యాప్తంగా గల ఆంధ్ర ఆస్తికు లెవరైనాసరే పోస్టేజి నిమిత్తం 30 పై. స్టాంపులు అందజేయు వారికి 2 ప్రతులు తిరుగు టపాలో ఉచితంగా అందజేసే ప్రయత్నం చేస్తున్నామని, 1987 శ్రీరామ నవమిలోగా యీ వితరణ జరగాలనీ కోరుతున్నాము.

పురాణపండ రాధాకృష్ణమూర్తి, జ్ఞాన మహాయజ్ఞ కేంద్రము, జయశ్రీ టాకీస్ రోడ్, రాజమండ్రి.

★ ★ ★

కొంపెల్ల జనార్ధనరావు రచనలను ఓ సంకలనంగా ప్రచురించాలని శ్రీశ్రీ స్మారక సంస్థ భావించింది. జనార్ధనరావు రచనలు 1937 నాటి వరకు ఉన్న పత్రికల్లో వచ్చాయి. 1934 నుండి 'ఉదయిని' పత్రికను త్రైమాసికగా నడిపించాడు. భారతి పత్రికలో 1934 దాకా సహాయ సంపాదకుడుగా పనిచేశాడు. అయితే కొంపెల్ల జీవిత విశేషాలంతగా తెలియడం లేదు. అతడి రచనల భోగట్టా కానీ, అముద్రిత రచనలు కానీ, జీవిత విశేషాలు కానీ, రాసిన ఉత్తరాలు కానీ ఎవరికైనా తెలిసుంటే మాకు తెలియజేయవలసిందిగా కోరుతున్నాం. ముఖ్యంగా అతడు రాసిన ఉత్తరాలూ, అతడి ఫోటో చాలా అవసరం. వీటన్నింటినీ మించి కొంపెల్ల వారసు లెవరో తెలీడం లేదు. వీలైనంత త్వరలో మీకు ఈ అంశాల్లో తెలిసిన వాటిని మాకు తెలియచేసి సాయం చెయ్యమని కోరుతున్నాం. త్వరలో ఈ సంకలనం మీ చేతుల్లో ఉంచే బాధ్యత శ్రీ శ్రీ స్మారక సంస్థది. ఆ అవకాశం కల్గించమని మిమ్మల్ని అర్థిస్తున్నాం.

-ఎటుకూరి ప్రసాద్, సమన్వయకర్త, శ్రీశ్రీ స్మారక సంస్థ, 3-6-737/3, హిమాయత్‌నగర్, హైదరాబాద్-500029.

Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Acting Editor: M. Madhava Rao, Chief Editor: S. Radhakrishne.
Phones : Business: 61247, 61248, 75569 Editorial: 75667




# అందాన్ని అందించడం ప్రకృతి సహజం.
# అందచందాల్ని అందించడం కేమియో లక్షణం.

కొబ్బరి నూనెలోని మృదువైన నవనీతం మీ శరీర శోభను ఇనుమడింప చేస్తుంది.

రోజంతా మీ శరీరాన్ని పూల పరిమళంలో తేలియాడిస్తుంది.

"న్యూ కేమియో బ్యూటీ సోప్" మీముందు.

అందాల సంరక్షణలో ఒక కొత్త అనుభవాన్ని అందిస్తుంది.

ACIL/025/86-Tel

## కేమియో
బ్యూటీ సోప్

మీ శరీర సౌందర్య పరిరక్షణలో ఓ కొత్తమలుపు ఇస్తుంది కేమియో






జయలక్ష్మి వారి
ఉత్పాదన

# పదవికోసం పవార్ పాట్లు!

జైలు నుంచి బయటికి రాగానే మళ్ళీ దగ్గరలోని బాంకుకే వెళ్ళే ఓ బాంకు దొంగని ఎందుకలా చేస్తావని అడిగితే 'డబ్బుండేది అక్కడే గదా మరి' అన్నాడట!

ఈ పిట్ట కథలో 'డబ్బు' అని ఉన్నచోట 'అధికారం' అని దిద్దుకోండి – శరద్ పవార్ తన మిత్రులకు ఇస్తున్నటువంటి జవాబు వస్తుంది. ఒక కాంగ్రెస్ వాది ఎప్పుడూ కాంగ్రెస్ వాదిగానే వుంటాడు కానీ మాజీ కాంగ్రెస్ వాదుల జాతిని కనుక మనం గమనించినట్లయితే ఆ జాతి వాళ్ళు అధికారంలో ఏ పార్టీ ఉంటే ఆ పార్టీ పొందు కోసం తహతహలాడతారు. పక్కన బ్రాకెట్లలో ఏం రాసి ఉన్నప్పటికీ ఆ పార్టీ కాంగ్రెస్ పార్టీ అయితే మరి మంచిది. ఇక కాంగ్రెస్ సంస్కృతి, మళ్ళీ ఇల్లు చేరడం లాంటి కబుర్లంటారా, అవన్నీ అర్థరహితమైనవి. తన పార్టీ గనుక అధికారంలో ఉంటే ఏ కాంగ్రెస్ వాదీ 'మళ్ళీ ఇల్లు చేరే' సంగతి ఆలోచించడు. పవార్‌కి గురుతుల్యుడైన వై. బి. చవాన్ శ్రీమతి ఇందిరాగాంధీ అధికారంలో లేనంత కాలం కాంగ్రెస్‌కు వెలుపలే ఉన్నారు. చౌధురి చరణ్‌సింగ్ జనతా పార్టీని ముక్కలు చేసిన తర్వాత ఆయన దగ్గరికి పరుగులు పెట్టిన వాళ్ళందరూ మాజీ కాంగ్రెస్ వాదులే. వాళ్ళు జనతా పార్టీకి ద్రోహం చేస్తున్నామని గానీ, జనానికి ద్రోహం చేస్తున్నామనిగానీ అనుకోనే లేదు. ప్రస్తుతం శరద్ పవార్ స్వంత ఇంటికి చేరుతున్నట్టు గానే, బహుశ రేపు రామకృష్ణ హెగ్డే స్వంత ఇల్లు చేరబోతున్నట్టుగానే, వాళ్ళు కూడ స్వంత ఇంటికి చేరుతున్నామనే అనుకున్నారు. చివరికి చూసేసరికి వాళ్ళందరినీ శ్రీమతి ఇందిరాగాంధీ మింగేసింది. ఇప్పుడు కూడా పవార్‌నూ ఇతరులనూ రాజీవ్ గాంధీ సరిగ్గా అట్లాగే మింగేయనున్నారు.

1980లో శ్రీమతి గాంధీ అధికారానికి వచ్చిన తర్వాత చవాన్ అతి దయనీయంగా కనబడ్డారు. రేస్ కోర్స్ రోడ్డు, తీన్‌మూర్తి మార్గ్ కలుసుకునే కూడలిలో ఆయనకు ఒక పెద్ద ఇల్లుండేది. శ్రీమతి ఇందిరా గాంధీ నివసించిన ఒకటో నంబర్, సఫ్దర్ జంగ్‌రోడ్డు ఇంటికి అది కూతవేటు దూరం. అప్పుడు నాదారి అదే గనుక అప్పుడప్పుడు నేను ఆయన ఇంటికి వెళ్తుండే వాణ్ణి. శ్రీమతి ఇందిరాగాంధీ కూడా అదే దారిలో వెళ్ళేవారు. చవాన్ ఇంట్లోంచి చూస్తే ప్రతి ఉదయమూ ఆ ఇంటి ముందు నుంచి ఆమె రాకపోకలు కనబడేవి. ఆమె ఎప్పుడైనా ఆ ఇంటికి రావడం గానీ, ఆయనను తమ ఇంటికి పిలిచారని గానీ నేననుకోను. మరి ఒకప్పుడు వాళ్ళు అతి సన్నిహితులయిన సహచరులుగా ఉండే వాళ్ళు. కాని కాంగ్రెస్ వాదులు ఒకరికొకరు అతి దగ్గరికి – అంటే ఒకర్నొకరు పొడుచుకునేంత దగ్గర్లోకి – రావడం ప్రమాదకరం.

వై. బి. చవాన్ లాంటి మనుషులు, తమను కొనే వారెవరా అని వెతికే కూరగాయల్లా ఎందుకు మారిపోతారోనని నేను చాల సార్లు నివ్వెరపోయాను. నేను ఇదివరకే చెప్పినట్టు చనిపోయే నాటికి ఆయన స్థితి దయనీయంగా ఉంది. శ్రీమతి ఇందిరాగాంధీ, తదితరులు ఆయనను కోపంతో చూసేవారు. గతవారం ఢిల్లీలోని ఆయన మిత్రులు కొందరు ఆయన రెండో వర్ధంతి జరపడానికి ప్రయత్నించారు గాని అది విఫలమై పోయింది. వేళ్ళ మీద లెక్క పెట్ట దగ్గంత మందే వచ్చారట. మంత్రులెవరూ రాలేదట.

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

సంపన్న రాష్ట్రమైన మహారాష్ట్ర గత కొంత కాలంగా పూర్తిగా మరాఠాల అధీనంలో ఉంది. కాని ఢిల్లీలో, ముఖ్యంగా రేస్ కోర్స్ రోడ్‌లో వాళ్ళ ప్రవర్తన చూస్తే మీరీ విషయం గమనించలేరు. ప్రస్తుత ముఖ్యమంత్రి ఎస్. బి. చవాన్‌ను ఏదో కారణం వల్ల నిజమైన మరాఠాగా గుర్తించరు. ఐతే ఇందువల్ల ఆయన పరిస్థితి మరింత అధ్వాన్నమయింది. బొంబాయి అనేది సరైన మాట అవునో కాదో గాని, ఆ బొంబాయిలో ఆయనను ఒక హెడ్ గుమస్తాగా గుర్తిస్తూ ఉంటారు. ఆయనకున్న పేరు ప్రతిష్ఠలు అవే. మొత్తానికి ఘనత వహించిన రాజకీయాలకు ఆయన చెందడనేదే అక్కడి వారి భావం. ఆయన కంటే ముందున్న వసంత రావు దాదా పాటిల్ ఇంకాస్త గట్టి మనిషె కాని ఢిల్లీలో ఆయన కూడా ఎక్కువ సాధించగలిగే వారు కాదు. పవార్ కూడ ఇటువంటి శాల్తీల నుంచే – అంటే, రాజకీయ శాల్తీల నుంచే – వచ్చారు. కాని ఆయన తనకూ, తన ముఠాకూ కొన్ని డజన్ల అసెంబ్లీ సీట్లు సంపాదించుకోవడం మించి రాష్ట్రంలో తమ పలుకుబడిని నిర్మించు కోలేక పోయారు. ఒక మరాఠా నాయకుడు న్యాయంగా పొందవలసిన పలుకు బడిని కూడగట్టుకో లేక పోయారు.

వై. బి. చవాన్, దాదా ఇద్దరు కూడా స్వాతంత్ర్య సమర యోధులు, 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో ఇద్దరూ పాల్గొన్నారు. 'చక్కెర లాబీ'గా గుర్తిస్తున్న వర్గాన్నొక దానిని రూపొందించడంలో ఈ ఇద్దరి బాధ్యతా ఉంది. ఈ వర్గం అనుమానానికి తావులేని వోట్ల బాంక్‌గా ఉంటున్నది. కాని వై. బి. చవాన్‌కు గానీ, దాదాకు గానీ ఇతర రాష్ట్రాల లోని నాయకుల లాగ, ఉదాహరణకి మద్రాసులో కామరాజ్‌కు, బెంగాల్‌లో డాక్టర్ బి. సి. రాయ్‌కి ఉన్నట్టుగా, సమ్మోహన శక్తి ఉండేది కాదు. బాల గంగాధర తిలక్‌కు, గోపాలకృష్ణ గోఖలేకు సమఉజ్జీ కాగల నాయకుణ్ణి కూడా మహారాష్ట్ర రూపొందించ



లేక పోయింది. చవాన్‌లు, పాటిల్‌లు, భోన్స్‌లేలు మరుగుజ్జుల వంటివారు. శరద్ పవార్ వంటి ఆశావహంగా కనిపించిన మనిషి కూడా వాళ్ళలో చేరిపోవడం విచారకరం.

ఢిల్లీకి ఎదురు నిలవగల నాయకులను మహారాష్ట్ర ఇష్టపడుతుంది. దాని సాంప్రదాయం అది. బహుశా అన్ని రాష్ట్రాల కోరికా అదేనేమో. శివాజీ ఔరంగజేబుకు ఎదురు నిలిచాడు. తిలక్ బ్రిటిష్ వాళ్ళను ధిక్కరించాడు. చవాన్, దాదాలు ఎవరినీ ధిక్కరించలేదు. రాజధానిలో ఎవరైనా వేలూపితే చాలు, వెంటనే తోక ముడుచుకుని వాళ్ళు ఢిల్లీకి పరుగులు తీశారు. నెహ్రూకు మహారాష్ట్ర నాయకులంటే చాలా భయం ఉండేది. బి. జి. ఖేర్, ఎస్. కె. పాటిల్ వంటి నాయకుల పట్ల మంచి గౌరవం ఉండేది. ఎందుకంటే ఆయన తిలక్ తదితరుల ఆచరణ పద్ధతులని చూశారు. కనీసం సూరత్‌లో కాంగ్రెస్‌నే తిలక్ ధిక్కరించిన వైనాన్ని ఆయన తమ తండ్రి దగ్గర విని ఉంటారు. కానీ చవాన్‌లు, పాటిల్‌లు రంగం మీదికి వచ్చిన తర్వాత మహారాష్ట్ర రాజకీయాలలో కులతత్వం ప్రవేశించింది. వై. బి. చవాన్ స్వయంగా అందుకు బాధ్యుడు కాక పోవచ్చు. ఆయనను మహారాష్ట్ర రాజకీయాలు ఉత్పత్తి చేసాయి గాని, ఆయన వాటిని సృష్టించ లేదు. ఢిల్లీలో శ్రీమతిగాంధీ వేసిన తెలివైన ఎత్తుల ఫలితంగా రాష్ట్రం ఆయన చేతి నుంచి జారిపోయింది. ఆయన కూడా జారి పోయారు. చివరికి తనకు తానే ఓ విదూషకుడుగా మారిపోయారు.

తమను ధిక్కరించగలరని గానీ, ఢిల్లీలో తమ సింహాసనానికి ముప్పు తేగలరని గానీ అనిపించిన రాష్ట్రాల లోని ప్రతి నాయకుణ్ణీ నెహ్రూ కుటుంబం నాశనం చేసింది. రాజీవ్ గాంధీ ప్రస్తుతం చేస్తున్న పని అదే. ఫరూక్ అబ్దుల్లాతో ఒప్పందం, ఇతరులతో ఒప్పందాలు ఆ ప్రయత్నంలోని భాగమే. కొంత కాలం గడిచిన తర్వాత శరద్ పవార్‌ను మహారాష్ట్ర ముఖ్యమంత్రిగా నియమిస్తారు. ఆయనకు కావలసిందీ అదే. ఆయన మరిన్ని చక్కెర కర్మాగారాలు నెలకొల్పి తన పలుకుబడిని పకడ్బందీ చేసుకుంటారు. ఆయన మరీ చెయ్యి దాటి పోతున్నారని ఢిల్లీలో పెద్ద మనుషులు భావించి, ఆయనను తోసివేసి దాదా కొడుకునో, మేనల్లుణ్ణో ఆ స్థానంలో కూర్చో బెట్టే దాకా అది అలా సాగుతుంది. వీళ్ళందరూ అల్ప సంతోషులు. చిన్న చిన్న వాటితోనే తృప్తి పడతారు. వాళ్ళు చివరికి తన్ని తగిలేయబడి నేల మీద పడి పాకే స్థితికి వస్తారు. వై. బి. చవాన్ ఒకప్పుడు శ్రీమతి ఇందిరాగాంధీని ధిక్కరించి సింహాసనానికి పోటీ పడగలిగిన స్థితిలో ఉన్నప్పటికీ చివరికి ఆయనకీ అదేగతి పట్టింది. అది ఆయన ఖర్మ. పవార్‌కి ఎదురయ్యేదీ అదే. కాకపోతే పవార్ వంటి మనుషులు పెద్ద ఎత్తున ప్రయత్నాలు చెయ్యరు గనుక పరిణామం కూడా అంత పెద్ద స్థాయిలో ఉండక పోవచ్చు. □

హలో! —గీతా



నో ఒక అద్భుత మైన
ల్లి ని. పరిశుభ్రమైన పద్ధతిలో
ూతన ఇటాలియన్
తములతో తయారు
బడినది. మిక్కిలి ప్రోటీన్లు
యుండి క్రొవ్వు పదార్థములు
డుటయే బాంబినో విశిష్టత.
ప్పుడు కాని, తరువాత కాని
గా కాకపోవుటయే బాంబినో
కత. నిమిషములలో బాంబినోతో
కము లైన, నోరూరించే
కాల, ఫలహారాలు తయారు
వచ్చును. ఇంకా బాంబినోతో
పొదుపు కూడా. నేడే వాడి
ండి. మీకే తెలుస్తుంది.



**బాంబినో కట్‌లెట్ :**

5 కప్పుల బాంబినోను ఉడకబెట్టి తీసి ఆరబెట్టి ఉంచండి. కీమానుకూడా ఉడకబెట్టి ప్రక్కన పెట్టండి. ఆరు లవంగాలు, ఏలక్కాయ, వెల్లిగడ్డలోని 5 పాయలు, అల్లం ముక్కలు దంచి ముద్ద చేయాలి. కళాయిలో నూనె మరగించి, కీమాను, బాంబినోను మసాలా ముద్దను ఈ కళాయిలో వేసి గరిటతో కలపాలి. తర్వాత దీసని దించి గ్రుడ్డు పచ్చసొన, మొక్కజొన్న పిండి కలిపి మూడు కట్‌లెట్‌లు చేయండి. తర్వాత దీనిని తెల్లసొనలో ముంచి రొట్టె ముక్కలు రుద్ధి బాగా వేయించండి.

# రుచిలో కమ్మదనం
# ఖర్చులో పొదుపుతనం
# అదే బాంబినో గొప్పతనం

బాంబినో వంటల విధానం తెలిపే పుస్తకం కొరకు వ్రాయండి.

జన జీవన్ ఫుడ్స్
ప్రైవేటు లిమిటెడ్,
1వ ఫ్లోర్, బషీర్‌బాగ్ ప్యాలెస్,
హైద్రాబాద్.

## వెర్మిసెల్లిని

తీపైనా ఖారా అయిన బాంబినోతో రుచే రుచి!




250 గ్రా. మరియు 500 గ్రా. ప్యాక్‌లలో దొరుకుతాయి.